చెప్పిరని మరియొక విధము. తిరువరంగప్పెరుమాళరయర్ మొద
లగువారును తిరుక్కోట్యూరునంబి, యింకను అనేకులు సన్యాస
విధి ననుసరించి ఆళవందారుల అర్చాదేహమును వెంచేపుచేసికొని
కావేరీతీరమునకు దెచ్చి భూస్థాపితముజేయ నుద్యుక్తులై యుండిరి.
ఆసమయమున పెరియనంబి, రామానుజులు పోయి చేరిరి.
ఈగుంపు లేమని పెరియనంబి విచారించి సంగతిదెలిసి మూర్ఛ
నొందెను. కొంతతడవునకు తెప్పరిల్లి లేచి నిన్ను పిలుచుకొని
రమ్మనిరి, వచ్చులోపల వెడలిపోయిరి అనిపెరియనంబి పలుకగా
విని రామానుజులు మూర్ఛనొంది మరల లేచి భగవత్సంకల్పమని
యెంచిరి. తిరువరంగప్పెరుమాళరయర్ మొదలగువారు వచ్చి
ఇంకను అపరక్రియ కాలేదు. రండి; వచ్చి ఆదివ్యమంగళవిగ్రహ
మును సేవింపుడని పిలుచుకొనిపోయిరి. రామానుజులు ఆళవం
దారులను పాదాదికేశపర్యంత మవలోకించి "ఓ వైష్ణవులారా! వీరి
మూడుచేతివేళ్లు ముడుచుకొనిపోయిన వేమి ? వీరు పుట్టిననాటి
నుండి అవి యట్లేయుండెనా ? ఇపుడే యిటు లాయెనా? చెప్పుడు.
మీరు వారితోనుండినవారు గనుక మిమ్మడిగితి" ననిరి. "ఇవి
పూర్వము సరిగా నుండెను. ఇపుడిట్లాయె"నని వారనిరి. ఎందుకని
రామానుజు లడుగగా "మహాత్మా! మీరే చెప్పవలయు"నని
వారనిరి.

మీకేమైనను వారు చెప్పియుండిరా యని రామానుజు లడు
గగా మాకేమియు తెలియదని వారిశిష్యు లనిరి. కాలక్షేపము
చేయునపుడు ప్రసక్తానుప్రసక్తముగ నేమైన మాటలువచ్చెనా
యని రామానుజు లడుగగా శిష్యులు యామునులయొక్క మూడభి
ప్రాయములను తెలిపిరని యొకవిధము. రామానుజులు మహాను
భావుడు, సర్వజ్ఞుడు, అవతారపురుషుడుగాన ధ్యానముచేసి యాము
నుల మూడభిప్రాయములను తెలిసికొనెనని మరియొక విధము.

(1) బ్రహ్మసూత్రములకు విశిష్టాద్వైతపద్ధతిలో భాష్యమువ్రాయ వలెననియు (2) వైష్ణవసిద్ధాంతమున కాధారముగనుండు విష్ణు పురాణమునుజేసిన పరాశరునిపేరు (3) వేదమునకు ద్రావిడ భాషలో నిర్మించిన నమ్మాళ్వార్లపేరును ఎవరికైనను పెట్టి కొన్ని శాస్త్రములుచేసి వారి ఋణము తీర్చుకొనవలయుననియు, ఈకార్య ములు జరుగలేదనియు, భగవంతుడు నెరవేర్చలేదనియు యాము నుల కొదువ లని యొకవిధము. 1. నాకుపిమ్మట వైష్ణవమతమును ఇంతదీక్షతో నడపువా డెవడైన నుండునా యనియు 2. భాష్యము వ్రాయవలెననియు 3. పరాశరుల పేరుంచవలెయుననియు యాము నుల యభిప్రాయములని మరియొకవిధము. ఒకవిధమునననుసరించి రామానుజులు శిష్యుల మాటలువిని అనేకశాస్త్రార్థములు ఆళవం దారులవద్ద తెలిసికొనుటకు లేకపోయెగదా యని చింతించి వేన వేలుగ శ్రీవైష్ణవులును, తిరువరంగప్పెరుమాళరయర్, పెరియనంబి మొదలగువారు నిలిచి చూచుచుండగా ఆళవందారుల చరమ విగ్రహమును సమీపించి ఇట్లు చెప్పిరి. మరియొకగ్రంథమువనుస రించి తనజ్ఞానదృష్టితో తెలిసికొని ఇట్లు చెప్పిరి. "నేను గోవింద భట్టరువలె మతాంతరమున కలియను. దుష్టసహవాసము విడిచితిని. వైష్ణవసిద్ధాంతమును స్థాపించెదను. పంచసంస్కార మావశ్యక మనియు, వైష్ణవసంబంధము గలవారు వేదాధ్యయనమువలె దివ్య ప్రబంధములను (అనగా ద్రావిడప్రబంధములను) అధ్యయనము చేయవలయుననియు, కర్మజ్ఞానభక్తులు చాలునని యుండువారికి శరణాగతిలో రుచి కలిగించెద ననియు ఇట్లు లోకోద్ధరణము చేసెద నని గట్టిగ ప్రతిన సల్పగా ఒకవ్రేలు సరిగా నయ్యెను. బ్రహ్మ సూత్రములకు భాష్యము రచించి ఆచంద్రార్కముగ నిలిపెదనని చెప్పగా రెండవవ్రేలు వెంటనే లేచెను. పురాణరత్నమని చెప్పబడు విష్ణుపురాణముచేసిన పరాశరులపేరును సకలవేదములను ద్రావిడ

భాషలో నిర్మించిన సమ్మాళ్వార్ల పేరునుపెట్టి వారి పేరుండునట్లు చేసెద నని చెప్పగా మూడవవేళ్లు సరిగా వచ్చెను. పై రెండువిధ ములననుసరించి నాలుగభిప్రాయములు తెలుపబడెను. నాల్గిం టిలో మొదటిది త్రోసివేసిన మూడగును. కడపటిది త్రోసిసను మూడగును. రామానుజు లిట్టే మూడుకార్యములను సత్యముగ చేసెదను అనగానే మూడువేళ్లును సరిగా వచ్చుటజూచి అచ్చటి వారు ఇతడు విశిష్టాద్వైత మతచక్రవర్తి అనితలంచి మీరే ఆళవం దారుల కొరత తీర్చువారు. విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించు టకు తగినవారు మీరే. ఇక మాకు మీరే గతి యని వారితోజెప్పి రంగనాథుని సేవింపరమ్మని పిలిచిరి. మీరంగనాథునికిని, నాకును సరిపడదని రామానుజు లనిరి. రంగనాథుడు సర్వలోకేశుడు గాడా అని వా రడుగగా సర్వలోకేశుడైనను నాకు అతనితో పనిలేదని రామానుజు లనిరి. మీకు స్వామి గాడా అని వారడుగగా కాడని రామానుజు లనిరి. ఎందుచేతనని వారుప్రశ్నింపగా "ఆళవందారులు నన్ను చూడదలచి ఎనిమిది దినములు జీవింపఁ గోరిరి. వారికొదవ తీర్చలేదు. నేను వచ్చులోపల వేళ్లు ముడుచుకొనునట్లు చేసెను. వారు నాతో నేమి మాట్లాడవలయునని యుండిరో! వారు ప్రాణ ముతో నుండిన నాకెన్ని శాస్త్రవిషయములు తెలిపియుందురో! ఏమో వచ్చితిని. కొదవ తీర్చెదననగానే వేళ్లు సరిగా విడిచిరి. ఈస్వామికి 'కర్తు మకర్తు మన్యథా కర్తుం' శక్తి యున్నదనుచున్నారే. వారి నిక నాల్గుదినము లిక్కడ ఉంచని కారణమేమి? అందుకు యోగ్యత లేదా ? లేకున్న చూడనేల ? శక్తి యున్నదా ? ఉండిన కాపాడ రాదా ? నాకు తత్త్వార్థగ్రహణ మహోత్సవము లేకపోయెను" అని రామానుజు లనిరి. వారికి భగవద్ద్వేషమా ? ఎంతమాత్రముగాదు. యామునాచార్యులను తాను, తన్ను యామునాచార్యులు చూచు టకు సహాయము చేయలేదనియు, వారికి కొఱత పెట్టెననియు

నేను కాంచీపూర్ణుడనుగదా! పూర్ణుడనే. నాకు అంతశక్తి యున్నది. ఐనను నీవు బ్రాహ్మణుడవు. నేనట్లు పుట్టలేదు. శాస్త్రములు చూచి నచో కులశీలములు పాటింపనక్కరలేదని యేర్పడును.

అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్యః సమ్యగ్ వ్యవసితో హి సః ॥

అను భగవద్గీత 9అధ్యా 30శ్లోకమునుబట్టి ఎట్టి హీనజాతి వాడైనను, ఎట్టిదురాచారుడైనను నన్ను భజించువాడు మహర్షియే. వాడే సాధువు అని స్వామిచెప్పెను. వరదుడేగదా గీతాచార్యుడు. నీవాతని యనుగ్రహమునకు పాత్రుడవు. మహాజ్ఞానివి. కాన శాస్త్ర ప్రకారము పోవుచున్నావు. నీకు భేదములేదు. ఎల్లవారును నీస్థితికి రాలేదు.

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥

అను భగవద్గీత 3అధ్యా 24శ్లోకము ప్రకారము ఇతరులు నీమార్గ మనుసరించరు. సాధారణమైన బ్రాహ్మణుడొక సాధారణ మైన శూద్రు నాశ్రయించును. అందుచే వర్ణాశ్రమధర్మములు నశించును. కాన గురువని తలంపకు మనిరి. తిరుక్కచ్చినంబి తన్ను సేవింపబోయిన రామానుజుల చేయిపట్టి త్రోసివేసిరి. నమ స్కారమును గైకొనుటకు యోగ్యత లేనివారు ఇతరులు తమ్ము సేవించిన సంతోషింతురు. లోకమం దిట్లువాడుక. ఆదిశేషుని అవతారమైనవాడు శిష్యు డనిరాగా తిరుక్కచ్చినంబి వలదనిరి. ఇందుకు గ్రంథకారు లాశ్చర్యపడిరి. అసాధులు, అసూయగలవారు, వాస్తవముగ గౌరవములేనివారు తమ్మితరులు గౌరవింపవలయు నని కోరుదురు. తెలిసినవారు నాకేమియోగ్యతగలదని అందురు. కాన తిరుక్కచ్చినంబి యిష్టపడలేదు. కులం తరుం (అనగా కులము నిచ్చును) అనియుండలేదా? మిమ్మాశ్రయించుట కేమి అటంకముని

రామానుజు లడుగగా "సరి. అటులైన కులము నిచ్చునను మాటను నమ్మి సంబంధములు చేయుదురా ? ఈకులము, మర్యాదకు సంబంధముచేయు కులము వేరే. 'సవర్ణాం' అని ఉండలేదా ? ఆ జన్మము వేరు; ఈ జన్మము వేరు, మన్యే= తలంచెదను అనిరి. దాని నిజతాత్పర్యము వేఱు. నీసేవలు పొందుటకు ఈజన్మము చాలదు. మనసా తలంపుము; చాలును" అని తిరుక్కచ్చినంబి యనిరి. రామానుజుల మనోరథ మీడేరలేదు. మీవలన కొన్ని సంగతులు తెలిసికొనగోరితిని. చెప్పననుచున్నారే యని రామానుజు లనగా నీకు కావలసినదిచెప్పెద నని కాంచీపూర్ణు లనిరి. గురువనక, శిష్యుడనక నమస్కరింపక పోయినను నాకు వలసిన సంగతులు మీ యొద్దతెలిసికొనిన గురువని యర్థముగాదా ? అని రామానుజు లడుగగా 'నేను స్వయముగ చెప్పను; వరదునిచేత చెప్పించెదను. ఆయనశిష్యుడవు కమ్ము' అని తిరుక్కచ్చినంబి చెప్పిరి. ఎటులైన నేమి మీరు నాకు గురువని మనసున దలచితిని. వరదుడును, మీరును ఇరువురు గురువు లయ్యెదరు. నే నడుగుసంగతులను వర దునికిచెప్పి ఆయనచెప్పుఉత్తరములను నాకు తెలుపుడు అని పలికి తిరుక్కచ్చినంబిని గురువని తలచినందున రామానుజుల వారి మృష్టాన్నమును భుజింపగోరిరి. ఈయన శేషాంశము. సర్వలోక గురువు కాబోవుచున్నాడు. వరదరంగరాజులకు ప్రీతిపాత్రుడు. నాగురువు యామునులకు మరింత ప్రీతిపాత్రుడు. ఈయన యింట భుజింపవలయును అని తలచి తిరుక్కచ్చినంబి రామాను జుల నడిగిరి. రామానుజుల కుండుభక్తియును, తిరుక్కచ్చినంబికి గల వైరాగ్యమును ఏమనవచ్చును ? లోకమున నెల్లవారికిని అట్లుండదు. వేదాంతదేశికులు స్వామి సన్నిధికిబోయి స్వామీ! 'సమలోష్టాశ్మకాంచనః' అన్నట్లు మట్టిగడ్డ, రాయి, బంగారములను సమముగ జూచు నేనేమి మిమ్ముల నడుగగలను? నేను రామానుజ

సిద్ధాంతమున జేరినవాడను. కావున అది శాశ్వతముగ నుండ వలయు నని అడుగవలయును. కాని అట్లడుగను. ఏలయన ఆసిద్ధాంతమును కదలించుట కెవ్వరికిని సాధ్యముగాదు. ఆచంద్ర తారార్కముగ నుండునట్లు చేసిరి. రామానుజసిద్ధాంతులకు మాత్రము పరస్పరము అసూయ యున్నది. ఆసంప్రదాయము ప్రకారము నేను అనుటకు 'అడియేన్' అందురు. మీరనుటకుదేవరీర్ అందురు (దేవరవారు) మాయిల్లు అనుటకు మాగుడిసె అందురు. మీయిల్లు అనుటకు మీతిరుమాళిగె యందురు. మార్గములోనే క్రింద పడి సేవించుకొందురు. వారిమాటలోనే నైచ్యానుసంధానము. ఇదంతయు వీరికి నోటనున్నదిగాని మనసులో లేదు. కాన ఆ అసూయపోయిన బాగుగనుండును. మన వారిని పిలిచి ఆఅసూయను వదలుడనిన వదలరు. అసూయనే పిల్చి "ఓ అసూయా! నీవు మా వారిని విడిచిపొమ్ము అని ఆజ్ఞాపించుము" అనిరి. లోకమున సంగతి యిట్లుండగా తిరుక్కచ్చినంబి రామానుజులయింట భుజింప గోరిరి. రామానుజుల భార్యయగు రక్షకాంబ లేక తంజమాంబను తళియ చేయుమని తిరుక్కచ్చినంబిని ముందుభుజింపజేసి పిమ్మట భుజింపవలయునను తలంపుతో వారిని పిల్చుకొని వచ్చుటకై వెడలి పోయిరి.

రామానుజులు తిరుక్కచ్చినంబిని పిలుచుటకై వెడలిపోగానే వారు మరియొక మార్గమునవచ్చి రామానుజులు లేనిసంగతి తెలుసు కొని "అమ్మా! నేను ఆలస్యముచేసితినేని స్వామికైంకర్యమునకు ఆటంకమగును. కాన నాకు ముందుగ సాపాటు పెట్టుము" అని యడి గెను. సాధారణముగ నూరురూపాయల ఉద్యోగస్థుడు పైయధి కారులక్రింద తా నొకచిన్నయుద్యోగి నని తలంచి యుండును. అతనిభార్యమాత్రము అట్లు తలంపక మనభర్త గొప్పవాడుగదా యని యహంకరించును. ఇట్లే రామానుజులభార్య గర్వించినది.

తిరుక్కచ్చినంబికిముంగిట భోజనముపెట్టి యెంగిలినెత్తి శుద్ధిచేయు మనెను. ఆయన యట్లే విస్తరినెత్తి స్థలశుద్ధి యొనర్చి వెళ్లెను. తంజమాంబ అతడు భుజించినచోట గోమయజలము చల్లి స్నానము చేసి మరల తళిగచేయుచుండెను. అపుడు రామానుజులు రాగా ఆభార్యాభర్తల కిట్లు సంభాషణ జరిగెను.

రామా : ముంగిట పేడనీళ్ళు చల్లియున్నవేమి ?

తంజ : తిరుక్కచ్చినంబి భుజించినచో టగుటచేత.

రామా : శుద్ధి నెవరుచేసిరి ?

తంజ : అతడు బ్రాహ్మణుడు కాడుగదా! తాకగూడదు గాన అతనినే చేయుమంటిని.

రామా : వారు భుజించగా శేషించిన యన్న మెచ్చట ?

తంజ : శూద్రశేష ముపయోగించరాదు గనుక దానిని పనికత్తెకు వేసితిని.

రామా : అయ్యో! ప్రసాదములేకుండ చేసితివా ? ఆపొయ్యిమీదనే తళిగ వేయుము.

తంజ : పొయ్యి నలికితిని.

రామా : ఆవస్త్రముతోడనే అన్నము వండుము.

తంజ : శుచినై స్నాన మాచరించి తళియచేయుచున్నాను.

ఇట్లు భార్య చెప్పగా రామానుజులు "అయ్యో! వరదుని పిలిచినట్లు పిలిచితినే. ఇదియి ట్లపకారము చేసెనే" యని వగచి ఇక ముందిట్లు చేసిన నిన్ను వదలుదునని యామెతో జెప్పి కాంచీపూర్ణుల యొద్దకేగి మిమ్ము పిలువకుండినను బాగుండెడిది. అపచారము తటస్థించినదే యని విన్నవించిరి. శ్రోత్రియునింటభోజనము నాకు లభించెను. ఆమెయే ఆకునెత్తియుండిన నేను చెడియుందును. నన్ను వరదుడు కాపాడెను అని తిరుక్కచ్చినంబి యనిరి.

పిమ్మట రామానుజులు తిరుక్కచ్చినంబిని జూచి నేను వేదము చదివితిని. యామునులయొద్దను, యాదవప్రకాశుల

యొద్దను మహదర్థములు తెలిసికొంటిని. అయినను నాకు కొన్ని సందేహము లున్నవి. యామునుు లుండినచో వానిని ప్రత్యక్షముగ నడిగి తెలిసికొనియుందును. (1) పరతత్త్వ మెవరు? (2) జీవాత్మ, పరమాత్మలకు భేదమున్నదా? ఒకటేనా ? (3) దానధర్మముల కంటె, జ్ఞానభక్త్యాదులకంటె పెద్దయుపాయ మెద్ది ? (4) అంతిమ స్మరణ కలుగవలయుననుచున్నారే, అది కల్గితీరవలెనా ? (5)మోక్షమునునది అనేకజన్మములకు పిమ్మటనా ? ఈజన్మముననే కలుగునా ? (6) మిమ్మాశ్రియించెద ననిన వలదంటిరే. ఇక నెవరి నాశ్రియింపవలెను ? ఈయారుసంగతులను వరదు నడిగి సెలవీయవలయునని యడిగిరి. ప్రతిదినమును తిరుక్కచ్చినంబి వరదునకు వింజామరవేయుచు స్వామి నిదురించగనే నిలుపుట మానుకగ నుండెను. తిరుక్కచ్చినంబి రామానుజు లడిగిన విషయములు మనసున నుంచుకొని వరదునికి కైంకర్యము చేయుచుండగా, స్వామి యెప్పటియట్లు నిదురింపక సంగతి "యేమిరా ? మనసున నేమో యుంచుకొనియున్న ట్లున్నది" అని యడిగెను. "ఔను స్వామీ! మనరామానుజునకు సందేహము లున్నవి. అనగా పరతత్త్వమెవరు? జీవాత్మ, పరమాత్మలకు భేదమా ? అభేదమా ? చరమోపాయమెద్ది ? మోక్ష మనేకజన్మములకా ? ఈజన్మమందేనా ? అంతిమస్మృతి ఆవశ్యకమా ? ఏగురువు నాశ్రియింపవలెను ? అనువిషయములు తెలియబలుకు"మని తిరుక్కచ్చినంబి యడిగెను.

శ్లో॥ అహమేవ (అయమేవ) పరం తత్త్వం దర్శనం భేద ఏవహి
ఉపాయేషు ప్రపత్తిస్స్యాత్ అంతిమస్మృతి వర్జనమ్.
దేహావసానే మోక్షం చ మహాపూర్ణం సమాశ్రియ ॥

"పరబ్రహ్మము, పరతత్త్వము, జగత్కారణ కారణము అందురేఅది నేనే. జీవాత్మ, పరమాత్మలుఒక్కటియగుటసరిగాదు. పరమాత్మ జ్ఞానానందస్వరూపుడు, వేదవేద్యుడు, పరమపురుషుడు, నిత్య

సూరిసేవ్యుడు. అట్టివానితో నిన్నటివరకు కుంభీపాకాది నరకముల ననుభవించుచుండిన జీవాత్మ సమాన మగునా? రామానుజుడును, మీరును బుద్ధిమంతులే. మీకు తెలియలేదా. నాఅభిప్రాయ మది కాదు. 'విద్యా వినయసంపన్నే' అన్నంతమాత్రమున అర్థమును చూడక విద్యనేర్చినవానిని, బ్రాహ్మణుని, ఆవును, ఏనుగును, కుక్కను, కుక్కమాంసము తినువానిని సమానముగ జూతురా? అన్నియు ఒక్కటగునా? అది అపార్థమే. భేదమనియే నాఅభిప్రాయము. ప్రపత్తియే గొప్పఉపాయము. నేను జ్ఞానిని, భక్తుడను, విరక్తుడను అనువానికే అంతిమస్మృతి కావలెను. స్వామీ! నాకేమియు తెలియదు అని భరన్యాసము శరణాగతిచేసిన వానికి అంతిమస్మరణ మక్కర లేదు.

యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యన్తే కళేబరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥

అనుభగవద్గీత 8అధ్యా 6వ శ్లోకమువలె అంతిమస్మృతి కావలెనని దేశికుల అభిప్రాయము. స్వామి అంతిమస్మృతి వల దనగా వారేల ఇట్లభిప్రాయపడి రన్నచో ప్రపన్నుడు స్మరింప నక్కరలేదనియు, వానికి అయత్నసిద్ధముగ అంతిమస్మృతికలుగు ననియు, జ్ఞానభక్త్యాదిమార్గమున పోవువారికి యత్నసిద్ధ మనియు, వాడు బుద్ధిమంతుడుగాన జాగ్రత్తగనుండి స్మరింపవలసియుండు నని వారి అభిప్రాయము. శరణాగతునికి ప్రారబ్ధకర్మముగూడ పోవును. ప్రారబ్ధకర్మ మనుభవించుటకే శరీరము కావలసి యుండును. అది లేనపుడు శరీర మక్కరలేదు. కాన ఈదేహము పోగానే మోక్షము లభించును. యామునుల శిష్యులలో నొకడైన మహాపూర్ణుని లేక పెరియనంబిని ఆశ్రయింపవలెను'' అని వరద రాజు కాంచీపూర్ణులకు తెలుపగా వారు రామానుజుల కెరింగించిరి. రామానుజుల కానంద ముప్పొంగి హర్షబాష్పములు రాలగా,

రోమాంచము కలుగగా నిస్సంశయులై వలదని తోఁయుచున్నాను, సాష్టాంగముగపడి తిరుక్కచ్చినంబిని సేవించిరి.

పెరియనంబిని శ్రీరంగమున నున్నారని కాంచీపూర్ణులవలన తెలిసికొని వారి నాశ్రయించుటకై రామానుజులు తహతహపడు చుండిరి. "రామానుజుడు నన్నుచూడకయే వెడలెనా ? ఆయనవచ్చి మంగళాశాసనము చేసినగదా నాకు గౌరవము ? ఆయనను శీఘ్రముగరప్పించి దర్శన మీయవలెను అని శ్రీరంగనాథుడు యోచించి తిరుక్కొట్యూరునంబి, పెరియనంబి మొదలగువారితో రామానుజునికి శ్రీవైష్ణవసిద్ధాంతమును చెప్పి పంచసంస్కారములుచేసి పిలుచుకొనిరండి'' అని ఆజ్ఞాపించెను. భగవదాజ్ఞానుసారముగ రామానుజులను పిలుచుకొనిపోవుటకై పెరియనంబి బయలుదేరి వచ్చుచుండగా మధురాంతకమున రామానుజులు వారి కెదురుపడిరి. "ఏరికాత్తరామన్'' సన్నిధిలో వారు కలుసుకొనిరి. ఇదివరలో "స్వాభావికానవధికాతిశయే శిత్రృత్వం'' అను శ్లోకమును చెప్పి రామానుజులను శ్రీరంగమునకు పిలుచుకొనిపోయి ఆళవందారుల చరమవిగ్రహమును సేవింపజేసినవారగుటచేత పెరియనంబిని రామానుజులు గుర్తెఱుంగుదురు. కాన వారిని చూచి, ''ఇదేమి ? ఎచ్చటివారును శ్రీరంగమునకు పోవుచుండగా మీరు దానినివిడిచి వెళ్లుచున్నారు'' అని యడిగిరి. ఆశ్రీరంగమునకు గౌరవము గల్గించుటకై మిమ్ము పిలుచుకొనిపోవ నేను వచ్చితి నని పెరియనంబి పల్కిరి. తన్ను శిష్యునిగా జేసికొనుటకై వచ్చిన పెరియనంబిని "ఏరికాత్తరామన్'' సన్నిధిలో చూచి రామానుజులు మిక్కిలి ఆనందపడిరి. వారిని చూచి సంతోషించుట కేమికారణము ? వారివలన నేమైన ధనలాభమా యనిన అట్లుగాదు. ఎవరెవరి కేది యిష్టమో అది లభించిన ఆనంద మగును. రామానుజులు మహాపూర్ణులను వెదుకబోగా వారే ఎదురుపడిరి. కావున సంతోషించిరి.

వారిని సేవించి వరదరాజస్వామి యుత్తరువును తెలిపి తమ చరణారవిందము లాశ్రయింప వచ్చితి నని రామానుజులనిరి. వారికిట్లు సంభాషణ జరిగెను.

పెరి : అట్లే కానిమ్ము. ఇది మాయూరును, మీయూరును కాదు. కాన కాంచీపురికి బోయి అచ్చట యుపదేశించెదను.

రామా : మీకు బదులాడరాదు. మన మిరువురమును రాత్రి వరకు బ్రతికియుండుట నిజమా ?

పెరి : అట్లగునా ?

రామా : ఆళవందారులు నన్నును, నేను వారిని చూడగోరితిమి. కాని అట్లు తటస్థించెనా ? కాన తమదర్శనమైన ఇచ్చోటు దివ్యదేశము. ఇదియే పుణ్యకోటి విమానము.

పెరి : రేపటివరకు తామసము.

రామా : మరల అట్లే అనుచున్నారే. నేను చిన్నవాడను. తమరు పెద్దలు. కాలు, కన్ను పోయిన నెట్లు ? వరాహపురాణమున "స్థితే మనసి సుస్వస్థే" అన్నట్లు శరీరమున పాటవ మున్నపుడే చెప్పిన బాగుగనుండును.

పెరి : కాంచీపురికి పోవులోపలనే శరీరపాటవము తగ్గునా ? ఆర్భాటముగ చెప్పుచున్నావు.

రామా : అది సరియే. శరీరము మారుటకు ఆలస్యమగును. కాని మనోవృత్తి సరిగ నుండదే.

> చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।
> తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥
> అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్ ।
> అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥

అను భగవద్గీత 6అధ్యా. 34, 35 శ్లోకము లందువలె మనసు చంచలమైనది. ఇరువురికిని మనసు సరిగా నుండవలదా ? ఒక క్షణ

మొకవిధముగ నుండని మనస్సు మారినచో నెట్లు ?

పెరి : ఏమిరా! నన్ను గురువుగ చేసికొనుటకు నీవు వచ్చితివి. నిన్ను శిష్యునిగ చేసుకొన నేను వచ్చితిని. ఇంతలోపల మనసు మారునా ?

రామా : ప్రాణము పోయిన నెట్లు ?

పెరి : ఇంతలోనే పోవునా ?

రామా : అది మెరుపువంటిది; పోవును.

పెరి : పోవునో, పోదో ఎవరికి తెలియును ? వరదరాజ సన్నిధియందైన బాగుగ నుండును.

రామా : అంతకంటెను ఈస్వామి తక్కువైనవాడా ?

పెరి : అచ్చట పుణ్యకోటివిమాన మున్నది.

రామా : ఇచ్చటనుండు పొగడచెట్టు దానికంటెను తక్కువా? వరదరాజులను హెచ్చని చెప్పుచున్నారే. అతనికంటెను ఈతడే హెచ్చు.

"రామో ద్విర్నాభిభాషతే". రాముడు రెండుమాటలాడువాడు కాడు- అనినవాడుకదా! ఈస్వామిది ఒకే మాట; ఒకే బాణము; ఒకే పత్ని.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

అను భగవద్గీత 15 అధ్యా. 12శ్లోకమట్లు లోకమంతటిని ప్రకాశింపజేయు సూర్యునియందుండు తేజస్సును, చంద్రుని యందును, అగ్నియందును ఉండుతేజస్సును నాతేజస్సని తెలియుము అని చెప్పిన స్వామికదా ఈతడు ? కాన తత్త్వోపదేశము లేక నామనసు మూయబడియున్నది. రాత్రివేళ ముకుళించిన తామరను తెల్లవారి సూర్యుడు వికసింపజేయునట్లు అజ్ఞానావృతమైన నామనఃపద్మమును తత్త్వోపదేశమను కిరణములచేత వికసింప

జేయుడు అని రామానుజులు ప్రార్థించగా మహాపూర్ణులు తమ గురువగు యామునాచార్యుల పాదపద్మములను తలచుకొని ఉపదేశింప సంసిద్ధులైరి. రామానుజులును ఉపదేశము స్వీకరింప సిద్ధముగ నుండిరి. ఇదియె నైమిశారణ్యము, ఇదియే పుణ్యకోటి విమానము, ఇదే శ్రీరంగము అని తలంచి నిమిత్తమాత్రముగ శిష్యులై యుండిరి. లక్ష్మీనాథుడు ఆదిగా గల గురుపరంపరను, పిమ్మట ద్వయమంత్రమును మహాపూర్ణులు రామానుజుల కుపదేశించిరి. ద్వయమంత్రమునకు మంత్రరత్నమని పేరు. ప్రళయకాలమున బ్రహ్మను తన నాభికమలమందు కూర్చుండబెట్టుకొని వేదములను చెప్పుటచేతనే అవి నిలిచియున్నవి. అట్టి ఉపకారకుడును, నరనారాయణుడై తిరుమంత్రము నుపదేశించినవాడును, సకలవేదశాస్త్రపురాణ సారమైన గీతను అర్జునునకు బోధించినవాడును అగుటచేతనే స్వామి ఆదిగురు వగుచున్నాడు. రామానుజులు గురుపరంపరాద్వయమంత్రములను ఉపదేశము పొంది మేఘావరణము తొలగగా ప్రకాశించు శరత్కాల చంద్రుని వలె ప్రకాశించిరి. ముఖ్యకార్య మాయెను. ఇక నీ శరీరము ఉండినను, పోయినను చింతలేదు. కాంచీపురికి రండు; నాగుడిసె యున్నది అని మహాపూర్ణులను పిలిచిరి. మహాపూర్ణులు రామానుజులకు పంచసంస్కారములు చేసిరి. అనగా బాహువులందు తప్త శంఖచక్రముద్రలు వేసిరి. పుండ్రము, దాసనామము ఉంచి మంత్రము నుపదేశించిరి. అర్చామూర్తియైన దేవరాజు నొసగిరి. పిమ్మట ద్వయమంత్రప్రతిపాద్యమూర్తియైన స్వామిని ప్రత్యక్షముగ చూపెదనని కాంచీపురికి పోయి చూపిరి. నాలాయిరమునకు అర్థము తెలిసికొనవలసియుండుటచే కొంతకాలము కాంచీపురము నందే ఉండవలయునని రామానుజులు కోరగా పెరియనంబి అంగీకరించిరి. గురుపత్నికి, తనభార్యకు పొత్తు కుదరదని తలంచి

రామానుజులు గురువును వేరొక గృహమున నుంచిరి. వారచ్చట ఆరుమాసము లుండిరి. మహాపూర్ణులకు వరదుని సేవయే పరమానందము. వారు భార్యతోడ స్వామిని సేవించుచు సంతోషముతో నుండునపుడు తమ గురువైన యామునులు తమకు చెప్పినట్లు సకలార్థములను పెరియనంబి రామానుజులకు ఉపదేశించిరి.

ఒకనాడు రామానుజులకు తలంటు వైష్ణవుడు ఆకలితో వచ్చెను. వారదిచూచి సంగతి యేమని అడిగిరి. ఆకలిగ నున్నదని ఆతడు చెప్పెను. అపుడు రామానుజులు "ఇతనికి అన్నముపెట్టు" మని భార్యతో చెప్పగా ఆమె ఒక్క మెతుకైనను లేదనెను. రామానుజులు వంటపాత్రలలో చూడగా పదుగురు భుజించునంత ప్రసాదముండెను.

రామానుజు లొకప్పుడు శ్రీపెరుంబుదూరునకు పోయిరి. ఆసమయమున మహాపూర్ణుల పత్నియు, రామానుజుల భార్యయు మంచినీటికై బావికి పోయి తమబిందెలను బావిలోనికి విడిచి ఏక కాలమున పైకెత్తగా మహాపూర్ణులభార్య బిందెలోని నీరు చింది రామానుజులభార్య బిందెమీద పడెను. అందులకు తంజమాంబ "ఏమే! మీరు మాయింట భుజించువారు. నన్ను మైలపఱచ వచ్చునా? నీభర్త నాభర్తకు పాఠముచెప్పుచున్నాడని అహంకరించి యిట్లు చేయవచ్చునా ? ఇక మీరు, మీపాఠము మాకక్కరలేదు" అని కోపించెను. వెంటనే మహాపూర్ణుల సతి జరిగినసంగతి భర్తకు చెప్పి నేడు శ్రీరంగమునకు వెళ్లవలసినదే. అటుపిమ్మటనే భోజనము అని చెప్పెను. ఎంతటిజ్ఞానియైనను భార్యమాట పథ్యముగుటచే మహాపూర్ణులు వెంటనే బయలుదేరిరి. రామానుజులువచ్చిన తన్ను వంపరని ఆతడు శ్రీరంగమునకు బయలుదేరెను. తిరుక్కచ్చినంబి సగౌరవపరచుట, తలంటువానికి అన్నముండియు లేదని చెప్పుట, పెరియనంబి భార్య నవమానించుట అను మూడుతప్పు

లను రామానుజులభార్య చేసెనని అన్నిగ్రంథములందు నున్నది. ప్రపన్నామృతమున మరియొక తప్పిదము కూడ చెప్పబడెను.

రామానుజు లొకనాడు సన్నిధియందుండగా నొకవైష్ణవా గ్రేసరుడు ఆకలియని వచ్చెను. మీరు మాయింటికిపోయి నేను చెప్పితినని నాభార్యతో చెప్పి భుజింపుడని రామానుజు లనిరి. అత డట్లేపోయి రామానుజులభార్యతో సంగతి చెప్పగా ఆమె నాభర్తకును, మీకును పని, పాటు లేదు. అంత అవసరమైన వారినే వచ్చి పెట్టుమనుడు అనెను. ఆవైష్ణవుడు పోయి ఆమెపలికిన పలుకు లన్నియు రామానుజులకు చెప్పగా వారొక వివాహపత్రిక వ్రాసి దానిని పండ్లు, పూలతో తబుకులో నుంచి మరల నతనిని ఇంటికి పంపిరి. తంజమాంబ శుభలేఖచూచి తనతమ్మునికి వివాహము జరుగబోవుచున్నదని సంతోషించి వచ్చిన బ్రాహ్మణునకు షోడశోపచారములు చేసి భర్తరాగానే నాసోదరునకు వివాహమట అనిచెప్పెను. రామానుజు లీనాల్గవతప్పును గూడ సహింపజాలక వివాహమహోత్సవమునకు పంపునట్లు మంచిమాటలతో నామెను తండ్రియింటికి పంపివేసి విరక్తులై సన్నిధికిబోయి తిరుకచ్చి నంబిని ముందుంచుకొని విధిప్రకారము సన్న్యాసము స్వీకరించిరి. కొందరు విధియుక్తముగను, మంత్రపూర్వకముగను భార్యా పుత్రాదులను వదలి మరల గ్రహింతురు. గ్రహింపకున్నను మనసా వారినే స్మరించుచుందురు. వారే వాంతాశులు అనగా వాంతియైనదానిని మరల తిన్నవా రనబడుదురు. యతిరాజు లట్టిసన్న్యాసము స్వీకరించలేదు. గృహస్థాశ్రమము దుండిన రాగము కలుగును. కామము తీరకున్న క్రోధము జనించును.

యతతోహ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥

అనుభగవద్గీత 2అధ్యా. 60శ్లోకముట్లు పండితునైనను మనస్సు బలాత్కారముగ నీడ్చును. కావున అట్లు పోనీయక

పరబ్రహ్మ మందు నిలుపవలెనని వారు సన్న్యాసమును స్వీకరించిరి. వారుగైకొన్నది త్రిదండ సన్న్యాసము. వరదరాజస్వామి వారికి సన్న్యాస మొసగి యతిరాజనుపేరు పెట్టిరి. యతిరాజనగా సన్న్యాసులకు రాజు. రామానుజులిట్లు యతిసార్వభౌములై మంత్రమును జపించుచు శిఖాయజ్ఞోపవీతసులతో త్రిదండ కాషాయాంబర యుక్తులై సూర్యునివలె ప్రకాశించుచుండిరి. సాధారణముగ లోకమున తమకు కొంత గౌరవము కలుగవలెనని, వీడు నాకు బంధువు, వాడు నాకు బంధువు అని గొప్పవారితో సంబంధము కల్పించుకొందురు. జన్మవిషయమై తండ్రి-కొడుకుల సంబంధము గొప్పది. విద్యావిషయమున గురుశిష్యసంబంధము గొప్పది. యతిరాజులకును, భగవంతునకును ఎట్టిసంబంధ మనగా వరదరాజు రామానుజులకు గురువు. శ్రీనివాసుడు శిష్యుడు. రంగనాథుడు తండ్రి, చెల్వపిళ్ల కొడుకు. భగవంతునితో నిట్టిసంబంధముగల యతిరాజులమహిమ నేమన వచ్చును? ఇంతకంటె హెచ్చేమి చెప్పవలెను? భగవంతుడిట్లు సకలవిధబంధుత్వమును ఒకనియెడ చూపెను. ఇంకొకనిపట్ల ఇత డిట్లు చూపలేదు.

రామానుజులు కూరత్తాళ్వాన్, మొదలియాండాన్ అనువారికి పంచసంస్కారముచేసి అనేకమంత్రార్థములు చెప్పిరి. మొదలియాండాన్ అనువారు రామానుజుల మేనల్లుడు. కూరమనుగ్రామమున నుండువారు కూరత్తాళ్వాన్. కొన్నిగ్రంథములలో మూడవ శిష్యు డొక డున్నట్లున్నది. సన్న్యాసము నంగీకరించినవారు సకలబంధువులను వదలవలెనుగదా! రామానుజు లట్లుచేసిరా? అనిన మేనల్లునిమాత్రము వదలలేదు. రామానుజులు యతిసార్వభౌములని యెల్లవారిచేత ప్రశంసింపబడుచుండునపుడు గోవింద భట్టరు ఆయనఙ్ఞప్తికి వచ్చెను. "అతడు అన్యాయముగ చెడెను. మీరు పోయినసనే తోవకువచ్చును" అని నేనుచెప్పినట్లు చెప్పుడని

కొందరువైష్ణవులను తిరుమలనంబియొద్దకుపంపిరి. యతిరాజులచేత పంపబడిన కొందరు శ్రీవైష్ణవులు తిరుమలకు పోయి నంబిని జూచి గోవిందభట్టరును చక్కబరచుడని ప్రార్థించిరి. యతిరాజులతేజము హెచ్చుచుండగా యాదవప్రకాశులది క్షీణించుచుండెను. అందరు రామానుజులను స్తుతించుచుండిరి.

ఒకనాడు యాదవప్రకాశుల తల్లి కోవెల మెట్లు ఎక్కుచుండగా ఊరంతయు 'రామానుజులు, రామానుజులు' అని కలవరించు చున్నారు. నాకుమారుడు సర్వలోకగురుడగు యతిరాజుతో విరోధము పెట్టుకొననేల ? ఎచ్చట గుణమున్నదో దానిని గ్రహింప వలదా ? అహంకరించుచున్నాడు. శిష్యవాత్సల్యముతో నుండ రాదా ? అకారణముగ ద్వేషించుచున్నాడే. ఆయనను ఆశ్రయింప రాదా ? అని అనుకొనగా "రామానుజుల నాశ్రయించిన ఏకొఱత యుండదు" అని అచ్చటివారు మాట్లాడుకొనుచుండిరి. అదియే ఉపశ్రుతి అందురు. ఆమె దానిని విని ఆశ్చర్య మొంది తమ యింటికిబోయి కుమారునికి సంగతిచెప్పి "నాయనా ! అట్లు చేయురా!" అనెను. "అమ్మా! మాకు వైరముగదా! ఎట్లు పోవుదు?" నని కుమారు డనగా "విరోధమువిడిచి భక్తితో నరిగి అతని నాశ్రయింపుము. నీవు మూర్ఖుడవు గావు, బుద్ధిశాలివిగదా!" అని తల్లి అనెను. ఇతరులుచెప్పిన వారు రామానుజులతో చేరినవారు గనుక నేను వారి కెదురై నిలుచుట సరిపడక అట్లు చెప్పించుచున్నా రనుకొనవచ్చును. తల్లిగావున హితమే చెప్పుచున్నదని తలచి యాదవప్రకాశులు "అమ్మా! రామానుజులు జ్ఞానియనియు, వరద రాజు, పెరుందేవితాయారులచేత కాపాడబడినవాడనియు, ఊరివారి కిని, నాకును శక్యముగాని బ్రహ్మరక్షస్సును తోలినవాడనియు నేనెఱుగుదును. ఇట్టి రామానుజుల నాశ్రయింపుమని చెప్పితివి. నీవు చెప్పినట్లు చేసెదనుగాని నేను తప్పు చేసితిని. అందుకు ప్రాయ

శ్చిత్తముగ భూప్రదక్షిణము చేయవలెను. నాకందుకు శక్తిలేదు. ఐనను యోచించెద'' నని నుడివెను. "కుమారా! యోచించవలెనా ? రామానుజులను కూర్చుండబెట్టి అతనిచుట్టు తిరుగుము. అదియే ప్రాయశ్చిత్తము. రాళ్లు, మన్ను మొదలగువానిని చుట్టిన నేమి ప్రయోజనము ? పదునాల్గులోకములు, దివ్యదేశములు, పుణ్య తీర్థములు, సర్వదేవతలు- సకలము వారియందేయున్న'' వని తల్లి చెప్పెను. యాదవప్రకాశు లామాటలు విని రామానుజుడు చిన్నవాడుగదా యని యోచించి ఆవిషయమున తల్లిమాటల యందు నమ్మకముగలుగక ఈముదుసలికి పిచ్చిపట్టెనా యని తలంచి మఠమున కేగి రామానుజుల నుద్దేశించి "అబ్బాయీ! ఇంతకుమున్ను నీవు శిష్యుడవుగ, నేను గురువుగ నుంటిమి. నాకు కొన్ని సంశయము లున్నవి. నీవు వానిని పరిహరించినయెడల నేను నీమతమున జేరెదను అనెను. మునుపుశిష్యుడనై యుండినందున నేను చెప్పను. నాశిష్యుడగు కూరత్తాళ్వాన్ వలన మీ సందియ ములు బాపుకొనుడని రామానుజు లనిరి. విష్ణువు పరతత్త్వమను టను యాదవప్రకాశులు ఖండించగా విష్ణువే పరతత్త్వమని కూరత్తా ళ్వారు స్థాపించిరి. పరమాత్మకు గుణములు లేవు, రూపములేదు, అని యాదవప్రకాశులు వాదించగా పరబ్రహ్మము సగుణుడు, సరూపుడని కూరత్తాళ్వారు స్థాపించిరి. సమాశ్రయణ మావశ్యకమని, అది లేకున్న వైదికకార్యములకు ప్రయోజనములేదని అనేక ప్రమాణములను జూపిరి. ఉపనిషత్తులను, వేదములను, పురాణము లను చెప్పి సంశయపరిహారము చేసి యాదవప్రకాశునకు మీద తోచలేదని రామానుజులతో విజ్ఞాపనము చేసిరి. "ఏమయ్యా! సమా ధాన మాయెనా ? మామతమున చేరెదరా ?'' అని యతిరాజడు గగా "చేర్చుకొందురా'' యని యాదవప్రకాశు డనెను. ఎట్లు రావలయునో అట్లువచ్చిన చేర్చుకొందుమని యతిరాజు లనిరి.

యాదవప్రకాశునకు భూప్రదక్షిణము గావించు శక్తి లేకుండెను. తల్లిమాటలయందు నమ్మకము లేకుండెను. సర్వవిధముల యతిరాజుమతమే ఉత్తమమని తోచియుండెను. ఈభావములతో అతనికేమియు తోచక నిదురించగా వరదరాజు స్వప్నములో కన్పించి "నీకును, నాకును సంబంధములేదు. మారామానుజునకు పూర్వపక్ష గ్రంథములు చెప్పిన ఆచార్యుడవుగాన చెప్పుచున్నాను. రామానుజు నాశ్రయింపుము- నీతల్లిమాటలు నమ్ము" మని చెప్పిరి. కలవరముండువారికి కలలు వచ్చును. వానిని నమ్మరాదని యెంచి యాదవప్రకాశుడు తిరుక్కచ్చినంబి నడిగెను. ఆయన స్వామి నడిగెను. "స్వప్నమున జెప్పుట యొకటియు, ఇపుడు చెప్పుట యొకటియా ? తల్లిచెప్పినట్లు చేయు" మనుము అని వరదరాజు లనెను. తిరుక్కచ్చినంబి యిట్లు చెప్పగా యాదవప్రకాశులు రామానుజులకు ప్రదక్షిణము సల్పిరి. యతిరాజులు వారికె సమాశ్రయణముచేసి తమవిధిప్రకారము సన్న్యాస మొసగి గోవింద జియ్యరని పేరుంచి మరల మనసు తిరుగకుండుటకై యతిధర్మ సముచ్చయమను గ్రంథమును సన్న్యాసులవిషయముగ వ్రాయు మనిరి. అత డట్లే వ్రాసెను. యాదవప్రకాశులు పుట్టినది మొదలు అద్వైతి. యతిరాజు లతని నెట్లు చేర్చుకొనెను ? అనగా మునుపు స్వామిసన్నిధిలో ప్రదక్షిణము చేయుచుండగా యామునాచార్యుల కటాక్షము అతనిమీద ప్రసరించెను. కాన చేర్చుకొన వచ్చునని తలంచిరి. గోవిందజియ్యరునకు రహస్యార్థములు తెల్పి శిష్యులతో నచ్చటనే యుండిరి. గోవిందజియ్యరు విష్ణువే పరతత్త్వమని యతిపతివలన గ్రహించినవారై మహావైష్ణవులై ప్రవచనము చేయుచుండగా కాలము వచ్చెను. అతడు మోక్షమునకు పోయెను.

రామానుజులు శ్రీరంగమున నుండనికారణముచేత పెరియ పెరుమాళ్లు అనగా శ్రీరంగనాథుడు చిన్నపెరుమాళ్లాయెను.

జగదాచార్యుడైన రామానుజుడు వచ్చియు నన్ను చూడకపోయెనని స్వామి చెప్పగా ఆళవందారులను ఎనిమిదిదినములు జీవముతో పెట్టి పెట్టరాదా ? తప్పుమీదే. కాన వారిని మన్నింప వేడుడని భక్తులనిరి. రంగనాథు డపుడు "సర్వేజనా స్సుఖినో భవంతు అని యుండవలదా ? మీరే ఆవస్తువు ననుభవింపవలెనా ? కావున రామానుజుని పంపు" డని వరదరాజునకు జాబు వ్రాయగా "అత్యుత్తమ వస్తువైన యెడల ఎన్నిదినము లనుభవించినను చాలుననిపించదు. అన్నముపై విసుగుజనించినవాని జీవనము దినములపర్యంత మేగదా! కావున రామానుజునివలననేగదా నాకు గౌరవము ? కనుక పంపుటకు వీలుగాదు" అని ఆయన బదులు వ్రాసెను. యామునాచార్యుల కుమారుడైన తిరువరంగ ప్పెరుమాళరయర్ అనువారు రంగనాథుని యభిమతానుసారముగ కాంచీపురికిపోయి వరదరాజును సేవించి పూదత్తాళ్వారు పాడిన 3అ. 2తిరు 95, 96 పాశురములను అర్థానుసంధానముతో దేవగానమున పాడిరి. గానప్రియుడగు వరదరాజస్వామి అరయరు నుద్దేశించి అయ్యా! మీకేమి కావలయునో కోరుకొను డనెను. "స్వామీ! గానమును విని యానందించువారు అట్లేయందురు. పిమ్మట దేనినైన నడుగగా మాట త్రిప్పుకొందురని అరయ రనెను. నేనట్లు చేయు ప్రభుడను కానని స్వామి చెప్పగా విశ్వామిత్రుడు శ్రీరాముని నడిగినట్లు అరయరు రామానుజు నడిగెను. వరదరా జందులకు సమ్మతించి "రామానుజా! వారిగానమువిని మోసపోయితిని. నిన్ను వారికి సమ్మానముగా నొసంగితిని పొమ్ము" అని ఉత్తరు వీయగా రామానుజు లట్లే చేసెద ననిరి. అరయ రిట్లు రామానుజులను పూర్ణపాత్రముగ అనగా సమ్మానముగ చేసికొని బయలుదేరిరి. రామానుజులు శ్రీరంగమునుండి కాంచీపురికి వచ్చినపుడు తండ్రి యింటికి కూతురు పోవునట్లుగ పరుగెత్తుచు వచ్చిరి. ఇపుడు ఇచ్ఛ లే

నుండి అచ్చటికి పోవునపుడు నిర్బంధముమీద అత్తగారింటికి పోవునట్లు తోచెను. కాన వారు దుఃఖించుచు అశ్రునయనములతో వరదరాజును స్మరించుచు తిరిగి తిరిగి చూచుచు పోవలసివచ్చెనే యని శ్రీరంగమునకు బోయిరి.

వారట్లు చింతాశోకసమన్వితులై అరయరు ముందు పోవుచుండగా వెనుక తిన్నగ పోయిరి. రంగనాథుడు వీరిరాక నెరిగి పెరియనంబి ప్రభృతులను పిలిచి కోవెలనుండి వైభవోపేతముగ వెడలి సకలమర్యాదలతో రామానుజులను పిలుచుకొని రండి, ముందు పొండి అని సెలవీయగా పెరియనంబి అట్లే వారి కెదురుగ పోయెను. వీరు వెళ్లిన చాలదని తలంచి రంగనాథుడు తానే రామానుజుల కెదురు పోయెను. అదేమి ? రంగనాథుడు రామానుజుల కెదురుపోవలెనా యనిన అతడు భక్తవత్సలుడుగదా! ఈతడు వచ్చిన తనకు గౌరవమని అట్లు చేసెను. రామానుజులు రాకుండిన వీరికి గౌరవములేదా యనిన అట్లుగాదు. భక్తుని పెద్ద చేయుతలంపుతో స్వామి అట్లు చేసెను. ''రామానుజా! వచ్చితివా! నేటినుండి నాకు గౌరవము'' అని స్వామి పలుకగా వారికి భయము గలిగి పెరియనంబిని చూపి అంతయు పెద్దలదయ అనిరి. ''అబ్బాయీ! నేనుగాదు పెద్ద. నీవే పెద్ద. ఏలన పొలిక పొలిక యనుపాశురమునకు అర్థముచూచినపుడు మంచికాలము రాబోవుచున్నదని చెప్పబడినదే! మీరు పుట్టబోవుచున్నారోయని ఆళవందారులు యోచించిరి. అట్టివారు మీరే యని మేమనగా కాదనిరి. ఆమహాపురుషుడవు నీవే'' అని పెరియనంబి రంగనాథునిముందు రామానుజులను పొగడి నీవికమీద రంగనాథుని మనస్సునకు కొదువ లేకుండ నడచుకొనుము, ఇచ్చటనే యుండుము అని చెప్పిరి. పెరియనంబి యిట్లు చెప్పగా రామానుజులు శ్రీరంగమునసే యుండునట్లు నిశ్చయించుకొనిరి. స్త్రీకి

ప్రౌఢవయస్సు రాకముందు అమ్మగారింటికి పోవలయునని యుండును. ప్రౌఢయై సంతానము కలుగగనే అత్తగారింటనే యుండగోరును. రామానుజుల స్థితియును అట్టిదే. రంగనాథుడు "రామానుజా! సన్నిధికార్యము లన్నియు చెడియున్నవి. నీ విచ్చటనేయుండి మంచియేర్పాట్లు చేయవలెను. నీసకలయోగ క్షేమములను ఒప్పగించితిని. కోవెలకు సంబంధించినవారిని నీక్రిందనుంచుకొని నీవు పైనుండి యోగక్షేమములు చూడవల యును. మహామతీ! నీబుద్ధికి ఈకోవెల ఒకటేయననేల ? పదునాల్గు లోకముల నిచ్చినను చక్కగ పరిపాలించ గలవు. నా కార్యములు చేసెదవా అని స్వామి యనిరి.

"అకలంకనాట్టాళ్వారు" అనురాజు శ్రీరంగము నేలుచుం డెను. స్వామి కాతనిపరిపాలన మిష్టములేకపోగా రామానుజు లారాజును బిలిచి మంచిమాటలుచెప్పి శిష్యునిగ చేసికొనెను. ఇట్లు స్వామియుత్తరువుమీద ప్రధానపురుషుని శిష్యునిగాచేసికొని సన్నిధిపరిపాలనలో ప్రవేశించి కోవెలయుం దుండిన అయోగ్యు లను దండించిరి. చెడిన ఒక్కొకక్క కార్యము నిట్లు రామానుజు లానందముతో చక్కబెట్టిరి. వైదికమైనను, లౌకికమైనను రామా నుజుల యిష్టప్రకారము జరుగవలసియుండెను. స్వామి కూర్చుండవలెనన్నను, లేవవలెనన్నను ఈయన చెప్పవలసినదే. నేటికిని రామానుజుల ఆజ్ఞాచక్రము శ్రీరంగనాథుని సన్నిధిలో నడచుచున్నది. రామానుజు లిట్లు శ్రీరంగనాథ సకలకార్యధురం ధరులై యుండునపుడు వరదరాజస్వామికి జ్ఞప్తికి వచ్చుచుండెను. రంగనాథుడును, గురువును ఉండుమని చెప్పినందున ఉండవలసి వచ్చెను. కాన వారికి సంకెళ్లు వేసిన ట్లాయెను. వారు రంగనాథుని ఆజ్ఞచేత కూరత్తాళ్వారు మొదలగు వారితో, కాలక్షేపముచేయు చుండిరి. కంచివరదుని విడిచివచ్చినందున వారిముఖ వేమైన వాడి

యుండెనా యనిన అట్లు వాడలేదు. రంగనాథుని ఆదరణయు, గురువుతో స్వామితో సల్లాపములును, ఊరివారు ఉండుడని చూపు ప్రీతియు తనకు లభించుటచేత రామానుజులు కరివరదుని మఱచి సుఖముగ శ్రీరంగమున నుండిరి.

ఈరీతిగ మఠమున నుండునపుడు తిరుమలనంబి యొద్దకు మునుపుపంపఁబడిన శ్రీవైష్ణవులువచ్చి యతిరాజులతో నిట్లు చెప్ప నారంభించిరి "మేమిచ్చటినుండి వెళ్లి తిరుమలనంబిని (శ్రీశైలపూర్ణులు, రామానుజుల మేనమామ) దర్శించితిమి. నేనొక మేనల్లుడను; గోవిందభట్టరొక మేనల్లుడు. ఆతనిని సరియైన మార్గమునకు త్రిప్పవలెను" అని మీరుచెప్పినమాటలు వారికి చెప్పితిమి. "నేను మాత్రమే వెళ్లిన కార్యము కొనసాగదు. మీరును నావెంట రండు" అని వారు మమ్మును శ్రీకాళహస్తికి పిలుచుకొనివెళ్లిరి.

సువర్ణముఖికి పోయి తీర్థము తెచ్చుమార్గమున మేమందరము కూర్చుండియుంటిమి. ఇంతలో పరమశైవుడైయుండిన గోవిందభట్టరు రుద్రాభిషేకముకొఱకై నీరుతెచ్చుటకు బంగరు బిందె నెత్తుకొని ఆమార్గమున వచ్చెను. "అబ్బాయీ! ఇటురమ్ము" అని తిరుమలనంబి పిలువగా ఏమని అత డనెను. అనేకశాస్త్రములు తెలిసి ఏది పరతత్త్వమో దాని నెఱింగి జ్ఞానయోగమున నుండరాదా ? ఇట్లు బిందె నెత్తుకొని సేవకునిపగిది నుండనేల ?" అని తిరుమలనంబి యనిరి. నన్ను ఎటులేని పిలుచుకొనిపోవుటకై యీయన వచ్చినాడని తలంచి గోవిందభట్టరు నవ్వి అటనుండి వెడలిపోయెనని శ్రీవైష్ణవులు చెప్పగా మామ వెళ్లికూడ కార్యము సఫలము కాలేదా అని రామానుజు లడిగిరి. "వినుడు. అతడు మాట్లాడినగదా చక్కదిద్దవచ్చును ? కావున మఱొక్కసారి వచ్చి యత్నింత మని తిరుమలనంబి తిరుమలకు వెళ్లిరి. మరల కొన్ని దినములకు మేముకాళహస్తికిపోయి పూర్వపుతావుననే కూర్చుంటిమి.

తిరుమలనంబి శిష్యులను ముందుంచుకొని కాలక్షేపము చేయు చుండగా గోవిందభట్టరు మునుపటివలె చేతిబిందెతో వచ్చెను. అతడు దేహమంతయు విభూతి పూసికొని త్రిపుండ్రములు, రుద్రాక్షమాల ధరించి పంచాక్షరీ మంత్రజపము– "ఓం నమ శ్శివాయ" మంత్రమును జపించుచు హెచ్చిన శివదీక్షతో చూపట్టెను. తిరుమలనంబి అతనినిజూచి "ఓరీ ! గోవిందా !" అని పిలిచిరి. అతడు మాట్లాడలేదు. కొండనువలె అతనిని కదలింప వీలుకాలేదు. శివభక్తులలో ప్రముఖుడు బాణాసురుడు. ఇతడు అతనికంటె గొప్పగ నుండెను. అణువులో నణువై, మహత్తుకు మహత్తైయుండు వాడు పరమశివుడు. అతనికి మీద వస్తువులేదు. శివుడుతప్ప వేరులేదు. అతడొకడే సత్యము. అతడే నేనని (శివోహమ్) తలంచియుండు గోవిందభట్టరును తిరుమలనంబి జూచి "యితనిని త్రిప్పుట కష్టము; మాట్లాడడు" అనుకొని ఆళవందారు స్తోత్రములోని–

"స్వాభావికానవధికాతిశయేశితృత్వం" అనుశ్లోకమును 1ఆ తిరుచ్ఛందవిరుత్తము 117 పాశురమును, 1ఆ 4నా నాన్ముగం తిరువందాది 3పాశురమును ఒకతాళపత్రమున వ్రాసి అతడువచ్చు దారిలో పడవైచిరి. అందలి ముఖ్యతాత్పర్య మేమనగా "వ్యాధి, మహావ్యాధి, చింత, జననమరణములు– వీని ననుభవించు ప్రాణు లకు దివ్యమైన, అప్రాకృతమైన పదవి నిచ్చువాడు నారాయ ణుడు. ఇంకొకని కట్టి శక్తిలేదు. వారుగూడ దేవతలే యైనను–

ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥

అను భగవద్గీత 8అధ్యా 16వశ్లోకము నట్లు ప్రాకృతశరీర మును మార్చి అప్రాకృతుని జేసి మోక్షమునకు పిలుచుకొనిపోవు ప్రభువు నారాయణుడే. వేదమును నమ్మువారు ఈసంగతిని

నమ్మెదురు. అతిశయోక్తి గాదు. నారాయణునికిని, బ్రహ్మాది దేవతలకును గల గౌరవమును జూడగా అతనిమహిమ సముద్రముగ నున్నది. వీరిమహిమ జలబిందువుగ నున్నది. అతడు ఆశ్రితులను విడువనివాడు, అనంతకీర్తి, అద్యంతరహితుడు, అదిశేషునిపై పవళించినవాడు, లోకనాథుడు, నారాయణానువాక ప్రతిపాద్యుడు. కొందరు త్రిమూర్తులలో నొకడు గొప్పయందురు. కొందరు ముమ్వురను సము లందురు. మరికొందరు త్రిమూర్తు లలో శివుడు గొప్ప అందురు. బ్రహ్మ గొప్ప అనువారు కొందరు. పలుమాట లాడుటకు అవకాశము లేదు. ఒకడు కాలుసాచగా మరి యొకడు దానిని కడిగెను. ఇంకొక డాజలమును శిరమున ధరించెను. బ్రహ్మ తన కమండలుజలము నెత్తి పురుషసూక్తముచేత త్రివిక్రముని అందమైన దివ్యచరణారవిందమును కడిగెను. ఆజలము నీలకంఠుని (శివుని) శిరమున పడునట్లు కడిగెను. వీరిలో శ్రేష్ఠు డెవడో యోచించుకొమ్ము'' అని శీఘ్రముగ బోధపడుటకై వ్రాసిరి.

అళవందారు స్తోత్రమందలి 'స్వాభావిక' అనుశ్లోకమును నుడివియే మహాపూర్ణులు రామానుజులమనసు నాకర్షించిరి. ఇతని మనస్సునుకూడ ఈశ్లోకముత్రిప్పునని తలంచి తిరుమలనంబి దీనిని వ్రాసిరి. ఈసంగతి నంతయును తిరుమలనుండి వచ్చిన శ్రీవైష్ణవులు రామానుజుల కెఱింగించిరి. యతిశేఖరా! ఇట్లు ప్రధాన శ్లోకపాశురములను వ్రాసి వేయగా అది గోవిందభట్టరు కాలికి తగిలెను. అతడు దానినెత్తి అందేమి యున్నదో యని చదివి 'ఓఉత్తరమా! నీతో నా కక్కర లేదు' అని దానిని పారవేసెను. మరల విచారించి చూతమని తలంచి దానినెత్తి బాగుగ చదివిచూచి గుంపుగ గూర్చుండిన తిరుమలనంబి మున్నగువారిని కనుగొని ''ఈతాటియాకుపై శ్లోకమును, పాశురములను వ్రాసినది మీరేనా?''

అని యడిగెను. ఔనని వారనిరి. ఏల వ్రాసితి రని యాత డడుగగా మీరు చూచుటకని వారనిరి. "మీరేల వచ్చితి"రని అత డడుగగా పాలుపిండుగోవును కొనిపోవవచ్చితి మని వారనిరి. ఓహో! నన్ను త్రిప్పుటకై వచ్చితిరా ? అందులకై వ్రాసితిరా ? ఈమాటలకు నేను బేలుపోయి తిరుగుదునా ? నాకన్ని శ్లోకములు రావు. అన్నియుచూచియేగదా ఇట్లయితిని. ఆస్థానమున శివునుంచితిని. మీచమత్కారములు నాయెడ ఫలింపవు. పోయి ఊరుచేరుడు అని గోవిందభట్ట రని పోయెను. "యతిరాజా! రెండవపర్యాయము గోవిందభట్ట రిట్లు మాట్లాడి వెళ్లెను. ఇంకను పక్వము గావలెనని తలంచి నంబి తిరుమల కరిగిరి. మరల మూడవసారి శ్రీకాళహస్తికి వెళ్లితిమి. పూర్వమువలెనే కాలక్షేపము చెప్పుచుండిరి. తిరువాయిమొళి 2ప. 2తి. 1, 2, 3 పాశురములు జరిగెను. గోవిందభట్టరు బిల్వపత్రములకై వచ్చి చెట్టెక్కుచు మూడవపాశురము ముగియు వరకు పంచాక్షర మంత్రోచ్చారణము సల్పుచు మారేడుదళములు గిల్లుచు, వినుచు మాట్లాడక నిలిచియుండెను. తిరుమలనంబి వైష్ణవ దీక్షకు తగునట్లు యుక్తులతో నింపుగ ప్రవచనముచేయుచుండగా తక్కినవారు ఆలకించుచు కూర్చుండియుండిరి. నాల్గవపాశురము వచ్చెను. "ఏల యింకొకనికై పత్రపుష్పములు గిల్లవలెను ? సకల దేవతలను, సకలచరాచరప్రపంచమును సృష్టించుటకై బ్రహ్మను నాభికమలమున సృజించిన దేవాధిదేవుడైన ఆస్వామికిమాత్రమే పుష్ప మర్పించవలెను. ఇతరునకు పుష్పపూజ తగునా" అని చెప్పగనే గోవిందభట్టరు చెట్టునుండి క్రిందికి దుమికి పూలబుట్టను క్రిందపడవేసి పరుగెత్తివచ్చి తిరుమలనంబి పాదములబడి నన్ను అంగీకరింపుడు. మీతో పిలుచుకొనిపొం డనెను. నాపాద స్పర్శచే పరిశుద్ధుడవైతివి, రమ్ము అని తిరుమలనంబి యనిరి. శ్రీకాళహస్తిప్రజల కీసంగతి దెలిసి "ఓహో! యీగట్టున గూర్చుండి

మోసముచేసి మాగోవిందభట్టరును పిలుచుకొని పోవవచ్చితిరా ?" యని వారితో కలహముచేసిరి. మేము వీనిని పిలువలేదు. వీడే వచ్చెద ననుచున్నాడు, మీరీతని నిటనే యుండుమని చెప్పి ఉన్నచో నుంచుకొనుడని తిరుమలనంబి యనెను. ఇన్నిదినము లుగ నిచ్చటనుండి యిన్నిధర్మములు విడిచి పోయెదవా ? అత డేమైన పొడి చల్లెనా ? అని పురజనులు చేయి పట్టుకొనగా "కాళహస్తి జనులారా! ఇక మీరు నన్ను తాకకుడు. మీకును, నాకును సంబంధము వీడిపోయినది- నేనును, మీరును శైవులమై యుండి నందున భేదము లేకుండెను. ఇపుడు మీకు పరమశివుని సంబం ధము, నాకు విష్ణుసంబంధము కల్గియున్నది. కావున మీరు మీరే; మేము మేమే- అని గోవిందభట్టరు వారిని త్రోసివేసెను. మీరు చెప్పునది బలేవింతగ నున్నది. మనసంబంధ మెక్కడ పోయినది అని వారు గోవిందభట్టరు నీడ్చుచుండిరి. నేనేమియు చేయలేదు. నన్నంటకుడు అని గోవిందభట్ట రనెను. అట్లు జరుగుచుండగా కాళహస్తీశుడు ఒకనియం దావేశించి "జనులారా! నేనితనికి అట్టి బుద్ధి నిచ్చితిని. పంపుడు; అడ్డగింపకు" డని చెప్పెను. అటులైన నితని నెందుకు పిలిచితి రని వా రడిగిరి. "ఈయన కాశీక్షేత్రము నకు వెళ్లినపుడు అచ్చటనే యుండవలెనని యతని కాశ గలిగెను. ఆయూరువదలి రావలెనని నాకు తోచెను. వీరికి భక్తి గలుగుటకై శివలింగమును జూపితిని. విష్ణువైననేమి, శివుడైననేమి మనసు తిరి గిన చాలునని అపుడట్లు చేసితిని. ఇతడు విష్ణుమతమున పుట్టి నాడు, వీనిని వదలుడు" అనెను. అంతటతిరుమలనంబి గోవిందభట్ట రును పిలుచుకొని "మంచికాలము; కాళహస్తీశ్వరుడు చెప్పెనని సంతోషించి, అతనిదీక్షను విసర్జింపజేసి పంచసంస్కారములు చేసిరి. ఇపు డితడు వైష్ణవాగ్రేసరు డయ్యెను. మీకంటెను హెచ్చుగ నున్నాడు" అని శ్రీవైష్ణవులు చెప్పగా రామానుజుల కానందమై

యీసంగతి దెలిపిన శ్రీవైష్ణవులకు సాలువలు గప్పిరి. ఈసంగతి ననేకులు చెప్పిరి. గాన వారివారి యోగ్యతకు దగినట్లు మర్యాదలు చేసి పంపిరి.

ఇట్లు శ్రీరంగమున నుండునపు డొకనాడు పెరియనంబి యొద్దకేగి సేవించి "మీరు మధురాంతక కాంచీపురములందు ఉపదేశించితిరి. ఆమాత్రము చాలునా ? వేదాంతరహస్యముల నుపదేశింపుడు. రంగనాథుని యోగక్షేమములకు నే నేర్పడినది తమవల్లనేగదా! తమపాదదాస్యముచేతనే ఆపదవి లభించెను" అని రామానుజులు విన్నవించగా పెరియనంబి యామునాచార్యులు తమకు చెప్పియుండిన ద్వయమంత్రార్థ ముపదేశించి నేను నాకుమారునకు రహస్యార్థములు చెప్పలేదు. నాగురునివద్ద సంపాదించిన సొత్తును నీ కొప్పగించితిని. నీవు నాపుత్రునికి చెప్పుము అనిపల్కి తన తనయుడైన పుండరీకాక్షుని రామానుజులకు శిష్యుని గావించిరి. అట్లుచేసి "యతిరాజా! యేమియో చదివితివి. తెలిసితివి. ఐనను అంతమాత్రము చాలదు. గోష్ఠిపూర్ణులు లేక తిరుక్కొట్యూరునంబి యని మరొకపెద్ద లున్నారు. వారియొద్ద తిరుమంత్రి చరమశ్లోకములను తెలిసికొనుము. ఆభాగమున నాయన బహు సమర్థుడు. ఆయర్థములను నీవు గ్రహించవలయును. చాల చక్కగ చెప్పుదురు; నీవు వినవలయు" నని పల్కిరి. "నేనే మహాపూర్ణుడను; నేనే అన్నియు తెలిసినవాడను; నాకే రామానుజులు శిష్యుడుగ నుండవలెను. ఆపేరు నాకే రావలయు" నని మహాపూర్ణు లనుకొనలేదు. రామానుజుడంతయు గ్రహించి లోకోద్ధరణ గావింపవలె నని అతడెంచి గోష్ఠిపూర్ణులను సందర్శింపు మనెను. ఎచ్చటెచ్చట ఏయే విశేషము లున్నవో వానినెల్ల సంగ్రహించుటకు పంపుట గురుధర్మము. మహాపూర్ణు లది నెరవేర్చెను. ఆమతస్థుడు, ఈమతస్థుడు అని చూడక భ్రమరము మకరందము

గ్రహించునట్లు విద్యలు గ్రహించుట శిష్యధర్మము- అది రామానుజు లనుష్ఠించి చూపిరి.

యతిరాజులు మహాపూర్ణుల ఆజ్ఞగొని తిరుక్కోట్టియూరునంబి యొద్దకేగి నమస్కరించగా ఎందుకు వచ్చితి వని వా రడిగిరి? తిరుమంత్రచరమశ్లోకములను చెప్పవలయునని రామానుజు లడుగగా 'నీపే' రేమని వా రడిగిరి ? నాపేరు యతిరాజని రామానుజులు చెప్పగా నీ వాతిరుమంత్రచరమశ్లోకముల నెఱుగదగవని వా రనిరి. అప్పటికిని యతిరాజులు పోక నిలువగా "ఇంకను నిలిచెదవేల పొమ్ము" అని వా రఱచిరి. రామానుజులు మరల పోయి మహాపూర్ణులతో సంగతి జెప్పగా "వారిని ప్రార్థించి అడుగరాదా ?" యనిరి. "ప్రార్థించి యడిగినను పొమ్మని" రని రామానుజులు చెప్పిరి. "పోనిమ్ము; వారు పెద్దలు. నాల్గుదినములు ఆగి మరలపొమ్ము. ఆమంత్రమునకుండు గౌరవ మట్టిది అని చూపుటకు వారట్లనిరి" అని పెరియనంబి పలికెను.

వారు పొమ్మనిరి. నాగతియెట్లని రామానుజులు నిద్రాహారములు మాని కృశించి పోయిరి. నాయోగక్షేమములు విచారించువానికి దుఃఖముగలిగెనే యని శ్రీరంగనాథుడు సంకటపడెను. ఇట్లుండగా స్వామి యుత్సవము వచ్చెను. గోష్ఠీపూర్ణులును వచ్చియుండగా శ్రీరంగనాథు డపుడు "గోష్ఠీపూర్ణా! నీవు మహాప్రాజ్ఞుడవు. మనవానికి రహస్యార్థములు చెప్పరాదా ? నాతో చేరినవాడతడు; బుద్ధిమంతుడు" అనిరి. ఇతడు రంగనాథుని యనుగ్రహము కల్గియున్నాడని గోష్ఠీపూర్ణులు మనస్సున సంతోషించి "స్వామీ! విషయము దొడ్డది. సమయముచూచి చెప్పెద" నని రామానుజుల నుద్దేశించి 'రమ్ము చెప్పెద' ననిరి. రంగనాథుడు చెప్పినందున గోష్ఠీపూర్ణులు మంత్రముల నుపదేశింతు రనుసంతోషముతో రామానుజులు మరల వెళ్లి సేవించిరి. "ఉండనిమ్ము.

స్వామిచెప్పిరి. ఐనను ఉపదేశము స్వామికా ? నీకా ? నీకు యోగ్యతలేనందున చెప్పుటకు గాదు.'' అని తిరుక్కోట్టియ్యూరునంబి యనగా యతిరాజులు తిరిగి వెళ్లిపోయిరి. రామానుజు లిట్లు పదునేడుపర్యాయములు తిరుక్కోట్టియ్యూరునంబి యొద్ద కేగియును ఉపదేశమును బడయజాలక ''నాకు యోగ్యత లేకున్నదే. యోగ్యుడనివా రెపుడు చెప్పుదురు ?'' అని మిగుల చింతించుచు ఆహారాదులు లేక తపించుచుండిరి.

తిరుక్కోట్టియ్యూరునుండి యొకస్వామి శ్రీరంగమునకు వచ్చి చూడగా యతిరాజులు ప్రవచనముసల్పక తదీయారాధన మనుమాటలేక చింతతో తపించుచు పరుండియుండిరి. వచ్చినవారు వారిక్షేమ మడుగగా ''నేనేమి యతిరాజును ? ఇన్ని పర్యాయములు తిరిగితిని. యోగ్యుడను కానే. ఇట్లు కాలము గడపుచున్నాను. నేనుండియేమి ? లేకున్ననేమి ? ప్రాయోపవేశము చేసితి'' ననిరి. వచ్చినవైష్ణవస్వామి తిరుక్కోట్టియ్యూరునంబియొద్ద కరిగి ''అయ్యో! యతిరాజు మహానుభావుడు. సంకటపడుచున్నాడు. ఇదేమి అన్యాయము ? తిరుమంత్రచరమశ్లోకముల నుపదేశించరాదా ? తపస్సుచేసినను మీకట్టి శిష్యుడు లభించునా?'' యని రామానుజుల మనోవ్యథను తెలిపెను. ''ఓహో! యింత శ్రద్ధతో నున్నాడా ? శాంతశమదమాదులు గలవాడు, వరదరాజునొద్ద సన్న్యాసము గైకొన్నవాడు, పెరియనంబిశిష్యుడు, ఆదిశేషుడు. రంగనాథుడుచెప్పినను నేనతని కుపదేశించలేదు. పదునేడుపర్యాయములు త్రిప్పితిని. అప్పటికిని కోపమురాక తనకు యోగ్యతలేదనియే తలచి యున్నాడు అని యెంచి తిరుక్కోట్టియ్యూరునంబి శిష్యుని బిలిచి యతిరాజును తోడ్కొనిరమ్ము'' అనెను.

అ శిష్యు డరిగి ''యతిరాజా! నన్ను తిరుక్కోట్టియ్యూరునంబి పంపిరి. తిరుమంత్రచరమశ్లోకములు చెప్పుటకై నిన్ను పిలుచు

కొనిరమ్మనిరి. ఇది గొప్పసంగతిగాన నీశిష్యవర్గముతోడ రావలదు. నీవొక్కడవే దండపవిత్రములతో రమ్ము" అని చెప్పెను. "అట్లే చేసెదను. నాభాగ్యము. నాకు చెప్పవలయునని వారికి తోచెనే! రంగనాథుని కటాక్షము" అని వచ్చినవానిని పంపి రంగనాథునిసన్నిధికి బోయి "స్వామీ! మీరు తిరుక్కోట్యూరునంబికి నన్ను గూర్చి చెప్పియుంటిరి. అది ఫలించె" నని విన్నవించిరి. "పరీక్షించియే చెప్పవలెనని శాస్త్రముండుటనుబట్టి నేను చెప్పినను అతడట్లు పరీక్షించెను. ఇపుడు పొమ్ము" అని రంగనాథు డనగా రామానుజులు మొదలియాండాన్, కూరత్తాళ్వారులతోడ తిరుక్కోట్యూరుకు పోయి నంబిని సేవించిరి. వారి కిట్లు సంభాషణ జరిగెను.

తిరు : నాశిష్యు నంపితినే, వచ్చినావా ?

యతి : ఆయనచెప్పుటవలననే వచ్చితిని.

తిరు : పదునెనిమిదిపర్యాయములు నిన్ను త్రిప్పితినే.

యతి : ఐన నేమి ? కడపట చెప్పెదనంటిరిగదా! (ఏమియును తెలియని శిష్యుడొకడు భగవంతుని పూజించుచుండెను. వానిభక్తికి సంతోషించి స్వామి సాక్షాత్తుగవచ్చి ఆరగించిపోవుచుండెను. పెట్టినదివాయు మగుటను జూచి సంగతియేమని అడుగగా స్వామి ఆరగించెనని వాడనెను. ఎల్లవారును నవ్విరి. తుద కీసంగతి గురువుతో చెప్పిరి. గురు వీ శిష్యునిపిలిచి "నాకు స్వామిదర్శనము చేయింపుము" అని అడుగగా "స్వామి నడిగి చెప్పెద" నని వాడనెను. మరునాడు స్వామిరాగా పాదములు పట్టుకొని సంగతి చెప్పగా "రేపు చెప్పెద" నని స్వామి యనెను. "గురువు తపించుచున్నాడు. చెప్పవలయు" నని మరునా డడుగగా స్వామి వానినొక మైలుదూరము దక్షిణముగా పిలుచుకొని పోయి పెద్దచింతచెట్టును జూపి "దీనిలో నెన్నియాకులున్నవో

అన్ని వేల జన్మములకు పిమ్మట నీగురువునకు నా దర్శన మిచ్చెద” నని చెప్పెను. అదివిని శిష్యు డేడ్చుచుండగా “నాయనా! స్వామి యేమనె” నని గురు వడిగెను. “స్వామీ! నాతో రండి” యని గురువును పిలుచుకొనిపోయి ఆగొప్ప చింతచెట్టునుజూపి యేడ్చుచు సంగతిచెప్పగా గురువు సంతోషముతో ఆడుటకు ఆరంభించెను. “స్వామీ! నేను దుఃఖించుచుండగా మీరేల సంతోషించుచున్నారు?” అని శిష్యు డడిగెను.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥

అనేకజన్మములు గడచినపిదప సర్వము వాసుదేవుడని తెలివి కలిగి నన్ను ఆశ్రయించుచున్నాడు. అట్టిపుణ్యాత్ముడు అరుదు అని భగవద్గీతయం దుండలేదా? ఆప్రకారము నాకు సద్గతికలదుగదా అని సంతోషించుచున్నానని గురువు శిష్యునితో జెప్పెను. అట్లే పదునెనిమిదిపర్యాయములు తిరిగినను కడపట ఉపదేశించెద ననిరి గదా యని యతిరాజులును సంతోషించిరి.

తిరు: యతిరాజా! నేను చెప్పినదేమి? నీవు చేసినదేమి? నేనుచెప్పిన దొకటి, నీవు చేసినది మరియొకటి.

యతి: మీరు ఉత్తరువు చేసినట్లే వచ్చితిని.

తిరు: అట్లు రాలేదు. నిన్నొక్కనినే రమ్మంటిని.

యతి: మీశిష్యు నడుగుడు; కోపించకుడు.

తిరు: దండపవిత్రములతో రమ్మంటి ననుచున్నాడు. అట్లు చెప్పినాడా?

యతి: చెప్పెను.

తిరు: మరి యిట్లేల వచ్చితివి?

యతి: ఆదండపవిత్రములు అనుపయుక్తములు; మాట్లాడవు. నాకు వీరిలో నొకడు పవిత్రము; మరియొకడు దండము.

కాన దండపవిత్రములతోడ మీయాజ్ఞానుసారము నేను వచ్చితిని. (అనగా సన్యాసి దండపవిత్రముల నెట్లువదలడో అట్లు వీరిని వదలనని యర్థము.)

తిరు : అటులైన వీరిలో దండ మెవరు ? పవిత్ర మెవరు ?

యతి : కూరత్తాళ్వారు సాధువు. విరక్తుడు. మిక్కిలి అణకువగలవాడు. అతడు పవిత్రము. మొదలియాండాన్ గడుసు వాడు, చిన్నవాడు. అతడు విద్యామదము వదలలేదు. వాదము చేయును. వచ్చినవారితో వాదించి, అణచి పంపుటకు నిలిపి యున్నాను. అతడు దండము అని యిట్లు తెలుపగా గోష్ఠి పూర్ణులు సంతోషించి మంచిసమయమున నుపదేశించెద నని చెప్పి-

పణవాద్యం నమో మధ్యం నారాయణపదాంతిమమ్ ।
మంత్ర మష్టాక్షరం విద్యా త్సర్వసిద్ధికరం సదా ॥
ముముక్షూణాం సదాజప్యం భుక్తి ముక్తిఫలప్రదమ్ ।
వైష్ణవానాం సదా జప్యం భక్తిజ్ఞానప్రవర్ధనమ్ ॥

అనునట్లు ఎనిమిదిఅక్షరములు, ఆదిమధ్యాంతములందు మూడు పదములును గలిపి సదా జపించువానికి సకలఫలముల నిచ్చు తిరుమంత్రము నుపదేశించిరి. అ ట్లుపదేశించి "యతిరాజా! దీనిని వెల్లడిచేయకుము" అని యాజ్ఞాపించిరి. యతిరాజులు తిరుకోట్టియూరునంబి కుమారుడగు సౌమ్యనారాయణులు తెక్క తెర్కాళ్వాన్ అనువారింట దిగియుండిరి. తిరుమంత్రోపదేశము పొంది సౌమ్యనారాయణుల యింటికి పోయిరి. నేను శేషుడను. సకలవిద్యాప్రవీణుడను. వరదరాజునొద్ద వినినాడను. ఇట్టి నాకే యీమంత్రము లభించుట కష్టము కాగా, ఎల్లవారిగతి యేమి ? అని తలచి యతిరాజు లామరునాడు "ఓ భక్తిగల శ్రీవైష్ణవులారా, రండి, రండి" అని తిరుమంత్రమును వెదజల్లిరి. సౌమ్యనారా యణుల ఇంటచెప్పిరనియు, ఆయూరి నృసింహస్వామి సన్నిధిలో

చెప్పిరనియు, గోపురమునెక్కి చెప్పిరనియు వేరు వేరు గ్రంథములు; చరమశ్లోకము చెప్పిరని కొన్నిగ్రంథములు. గోష్ఠీపూర్ణులు తిరుమంత్రము అందరికి చెప్పితివి గాన చరమశ్లోకమును చెప్పననగా, ఇకమీద చెప్పనని ప్రమాణముచేసి, దానిని గ్రహించిరని కొన్ని గ్రంథములు.

యతిరాజులకు తిరుక్కోట్టియూరునంబికి జరిగిన సంభాషణమిది.

తిరు : యతిరాజా! మంత్రమును వెల్లడిపరచితివా ?

యతి : ఔను.

తిరు : నేను వలదని చెప్పలేదా ?

యతి : అంటిరి.

తిరు : గుర్వాజ్ఞ మీరినవాని కేమి ఫలము ?

యతి : నరకము.

తిరు : అట్లైన నీకు నరకము గలుగదా ?

యతి : కలుగును.

తిరు : అందుకు తెగించి చెప్ప నేల ?

యతి : గుర్వాజ్ఞ మీరినందుకు నేనొక్కడనే నరకమున బడుదును. ఎందరో పరమపదమునకు పోదురు కదా. కాన నేనొక్కడను నరక మనుభవించిన నేమని అట్లు చెప్పితిని.

తి : అహా! ఎంత చదివితిని ? ఎన్ని మంత్రార్థములు చూచితిని ? ఎంతవయసాయెను ? ఈమంత్రమును వెలిబుచ్చరాదు. ఎల్లవారును నరకమున బడనిమ్మని యంటినే. మన్నాథా! లేక ఎంబెరుమాన్ లేక నా స్వామీ! పరసమృద్ధిలో నీకెంత అభినివేశము! నేనే ఇట్లు పదునెన్మిది పర్యాయములు తిరిగి శ్రమపడితిని. ఈమంత్రము ఎల్లవారికి లభించునా ? నే చెడిననేమి ? యని తలచి అందఱకు చెప్పితివే. నేనా నీకు గురుడను ? నీవే నాకు గురుడవు.

యతి : చరమశ్లోకము నుపదేశింపుడు.

తిరు : ఇక చాలు. నీకు చెప్పను.

యు : నాకుమాత్రము చెప్పెదరా ?

తి : నేనే "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అన్నట్లు "రంగనాథుని సేవించి ఏకాంతమున చరమశ్లోకమును అనుసంధించితిని. స్వామి సంతోషించి ఈమంత్రమును తగువానికి చెప్పు మనెను. శీఘ్రముగ అట్టివానిని పంపెద ననిరి. అట్టివాడవు నీవే, ఉపదేశించెదను. రమ్ము. కాని తిరుమంత్రము గొప్పది. ఇది గుహ్యతమమైన మంత్రము. నీవు దీనిని వెల్లడింతువు. ఎవ్వరికి చెప్పనని నాపాదములు స్పృశించి శపథము చేయుము. నీదండపవిత్రములనుకూడ ఆవలకు పంపివేయుము." అని ఇట్లు తిరుకోట్టియ్యూరునంబి చెప్పి ఎంబెరుమానార్లవద్ద ప్రమాణము చేయించి, రథమున గూర్చుండి అర్జునునికి ప్రియమైన గీతాచార్యుడు ప్రీతితో చరమశ్లోకము నుపదేశించినట్లు, తిరుకోట్టియ్యూరునంబి యతిరాజులకు చెప్పిరి. ఎంబెరుమానార్లు తాము సంపాదించిన రెండుమంత్రములలో తిరుమంత్రమును భూరిగ మహాజనులకు ఇచ్చిరి. చరమశ్లోకమును మాత్రము రహస్యముగ నుంచుకొనిరి.

పెరియనంబి రహస్యార్థములను తనపుత్రుడగు పుండరీకాక్షులకు ఉపదేశింపు మనినట్లు తిరుకోట్టియ్యూరునంబి యతిరాజులకు తిరుమంత్రచరమశ్లోకముల నుపదేశించి యీసొత్తును తనపుత్రునకిమ్మనిచెప్పి పరమానందభరితులై యుండిరి. యతిరాజు శ్రీరంగమునకు రాగా తన కారహస్యముల నుపదేశింపవలయునని కూరత్తాళ్వా రడిగిరి. ఉపదేశమును గోరువాడు-

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

అను భగవద్గీత 4అధ్యా. 34శ్లోకమట్లు ఆచార్యశుశ్రూష చేయ వలెను. ఒకసంవత్సర మట్లుచేసెదవా యని యతిరాజు లడుగగా ఒక సంవత్సరము గాదు, పదిసంవత్సరము లైనను చేసెదను. కాని శరీర మస్థిరము. కావున త్వరలో నుపదేశింపుడని కూరత్తాళ్వా రనిరి. నీవు చెప్పినది నిజము. ఒకసంవత్సరము శుశ్రూషచేయ వలెను. లేక ఒకనెల ఉపవాస ముండవలయును. ఆహారములేదని పడుండరాదు. ఎప్పటియట్లు సకలోపచారములు చేయుచుండ వలెను. అట్లుచేసెదవా అని యతిరాజు లడుగగా కూరత్తాళ్వారు అట్లే మాసోపవాసముచేసిరి. యతిరాజు లట్లు పరీక్షించి సంతో షించి తనకు తిరుక్కోట్యూరునంబి చెప్పిన ట్లుపదేశించిరి. మొదలి యాండానును ఆవలకు పొమ్మనిరి. కూరత్తాళ్వారునకే ఉపదేశింప వలెనని నాబుద్ధికి తోచినది అని యతిరాజు లనిరి. నాకెట్లు లభ్య మగునని మొదలియాండా నడుగగా నీవు తిరుక్కోట్యూరునంబి యొద్దకేగి నే నుపదేశించలేదని చెప్పుము అని యతిరాజు లనిరి. మొదలియాండాను యతిరాజుల ఆజ్ఞానుసారము తిరుక్కోట్యూరు నకు పోయిరి. యతిరాజుల దండమగు "నీవేల వచ్చితి ?" వని గోష్ఠీపూర్ణు లడుగగా వారు నా కుపదేశింపలేదని మొదలియాండాన్ చెప్పెను.

"ఓరీ : నీకు విద్యాధన కులమదము లున్నవి. విద్యనభ్య సించుటచే మదము గలుగును. నేను అనక, మేము అనునట్లు చేయును. విద్యనేర్చుటకు ఫలము తల్లి, దండ్రి, గురువు, పెద్దల యొద్ద ఎట్లు మెలగవలెనో అట్లు మెలగువిధము తెలియుట. ఇందు లకు మారుగా మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి తగ్గును. అహం కారముపుట్టును. మనలను రక్షించిన తల్లియే విషమిచ్చిన నెట్లు ? అట్లుసద్గుణములు గలిగించవలసిన విద్య దుర్గుణములను గలిగించిన తప్పగును. అదియే విద్యామదము. ధనముండుటచేత కలుగు

దానికి ధనమద మనిపేరు. నేను గొప్పకులమున పుట్టితి నని అహంకరించుటే కులమదము. అయోగ్యులకు ఈ మూడును మదము గలిగించును. యోగ్యులకు ఈమూడును దమము గలిగించును. ఓరీ ! నీకు ఈమూడుమదములు పోవువరకు యతిరాజుపదేశింపడుగాన ఈమూడుమదములను విడిచి అతనిపాదముల బడుము. నాయొద్ద ఉపదేశము పొందుట కాత డొక్కడే తగినవాడు. ఎవ్వరికిని రహస్యములు తెలుపవలదని నే నతనికి జెప్పగా కూరత్తాళ్వారు మొదలియాండానులకు చెప్పెద ననెను. సమ్మతించితిని. నీవు తగవని చెప్పలేదు. పాదముల బడుము. సమయము చూచి చెప్పెను అని తిరుకోట్టియూరునంబి చెప్పిరి. ఈసంగతి తెలియుటకే ఆరుమాసము లాయెను. మొదలియాండాన్ శ్రీరంగమునకు వచ్చి యతిరాజులతో సంగతి చెప్పగా ఈమదములను విడిచితివా యని వా రడిగిరి. విడిచితినని మొదలియాండాన్ అనగా లేదని తోచుచున్నదని యతిరాజు లనిరి. పరీక్షించి చెప్పుడని మొదలియాండా ననగా అట్లే కానిమ్మని యతిరాజు లనిరి.

ఇట్లుండగా పెరియనంబి కూతురు "అత్తుళాయి" అను నామెకు అత్తగారింట పోరు కలిగెను. అందు కామె సహింపలేక తండ్రియొద్దకు వచ్చి "నాయనా! అత్తగారు నన్ను బాధించుచున్నది. అర్ధరాత్రిలో జలము తెమ్మనుచున్నది. భయ మనిన ఓసీ ! నీకు తోడుగ వచ్చుటకు నేను పనికత్తెనా ? యని తిట్టుచున్నది" అని యేడ్చుచు చెప్పుకొనెను. అమ్మా! నేనేమి చేయుదును ? శిష్యునితో జెప్పుము. అత డేర్పాటు చేయునని వారనిరి. అత్తుళాయమ్మ యతిరాజులతో సంగతిచెప్పి "నాకు తోడుగ వచ్చుటకు ఎవరైన వచ్చిన చాలును. వారు జలము తేనక్కర లేదు" అనెను. "ఓరీ! మూడుమదములను విడిచితివా ? ఈమె గురుపుత్రి. సూర్యోదయము మొదలు పునస్సూర్యోదయపర్యంతము ఒక్కపని

యైసను ఈమె చేయగూడదు. ఈమెతో వెళ్లి యిట్లు గురు శుశ్రూష చేసెదవా ? ఆహా! ఇట్టి భాగ్యము లభించినదని సంతోషముతో చేయవలెను. చేసెదవా ?'' అని మొదలియాండా నును యతిరాజు లడుగగా వారందుకు సమ్మతించి ఆమెతో వెళ్లి సకలకార్యములు చేయుచుండిరి.

మహాపూర్ణుల వియ్యాలవారు సామాన్యులుగ నుందురా ? కాన పదుగురువైష్ణవులు చేరి ప్రసంగించుచుండిరి. వారిలో నొక వైష్ణవుడు అపార్థము చెప్పగా పాత్రలు తోముచుండిన మొదలి యాండాను సహించక యిట్లు చెప్పిన బాగుగనుండు ననెను. ''ఓయీ! వంటవాడా! నీవు పనివాడవు. మేము పదుగురము మాట్లాడుచున్నాము. నీవు నీవంటపని చూచుకొమ్ము'' అని వా రనిరి. అట్లే చేసెదనుగాని మీరుచెప్పిన అర్థము సరిగలేదు అని మొదలియాండాన్ పలికెను. పిమ్మట వారు ముందువెనుకల అర్థ మును చూడగా వంటవాడుచెప్పినదే సరియైన యర్థమని వారికి తోచెను. అపుడు పెరియనంబి వియ్యంకుడు, అల్లుడు, అత్తగా యమ్మ మొదలగువారు లేచిపోయి మీరు పెద్దలు, ఇక వంటచేయ కుడు అనిరి. నేను ఊరకుండను. గురునాజ్ఞ వలదనుటకు మీ రెవ్వరు ? అని ఆయన చెప్పెను. పిమ్మట వారిచేత వంటచేయించు టకు, నీళ్లు తెప్పించుటకు వారికి మనసువచ్చునా ? అపచార మపచార మపచార మనిరి. ఏయతిరాజు నాజ్ఞచేత వచ్చితినో ఆ యతిరాజు చెప్పిననే పోయెదనని మొదలియాండా ననెను. వారెల్లరు పోయి ''ఎట్టిపనివానిని పంపితి'' రని యడుగగా అత సిని పంపివేయుడని యతిరాజు లనిరి. వీరు చెప్పినను మొదలి యాండాన్ వెళ్లలేదు. యతిరాజు లొకశిష్యునిబంపి ''ఇంక చాలును, చరమశ్లోకము నుపదేశించెదను, రమ్మ''ని చెప్పిపంపగా వచ్చిరి. ''ఏమిరా! మూడుమదములను విడిచితివా ?'' యని

యతిరాజు లడుగగా విడిచితినని, తలంచెదనని మొదలియాండా ననెను. "పరీక్షించితిని, విడిచితి" నని తెలిసెను అని యతిరాజు లనగా భాగ్యమని మొదలియాండాన్ పల్కెను. పిమ్మట యతిరాజు లుపదేశించిరి.

యతిరాజులు మహాపూర్ణులయొద్ద ద్వయమంత్రమును, గోష్ఠీపూర్ణులవద్ద తిరుమంత్రచరమశ్లోకములను గ్రహించి కృతార్థులై మరల మహాపూర్ణులయొద్ద కేగి నమస్కరించి తమయాజ్ఞానుసారముగ విషయముల గ్రహించితి నని విన్నవించిరి. "ఇంతలోనే గ్రహించితి నని తలంపకుము. వరరంగాచార్యులు లేక తిరువరంగ ప్పెరుమాళరయర్ వద్ద కరిగి ద్రావిడవేదమును రాగముతోడను, తాళముతోడను నేర్చుకొనిరమ్ము" అని వా రనిరి. గానముచేత వరదరాజును స్వాధీనపరచుకొనిన వారియొద్ద యతిరాజులు ద్రావిడామ్నాయమును లోపలిరహస్యములతోడ గ్రహించి ఆచార్యునితో జెప్పిరి. ఆపాశురములకు అర్థవిచారము చేయవలయును. తగువారిని తెలిపెదను. పోయెదవా యని పెరియనంబి యడుగగా అట్లే చేసెదనని యతిరాజు లనిరి. "తిరుమాలె యాండాన్" లేక మాలాధరులయొద్ద కరిగి అర్థవిచారముసల్పుమని మహాపూర్ణు లాజ్ఞాపించగా యతిరాజులు వారియొద్దకేగి ఏమి తెలియని శిష్యుడు గురునొద్దనుండునట్లు నోరు చేతితో మూసికొని నిలిచిరి. ఆయనచెప్పువిషయ మట్టిదో లేక చెప్పు పాండిత్యమో, భక్తివిశేషమో యతిరాజుల నట్లొనర్చినది. వారు శఠారిసూక్తియగు నాల్గవఆయిరమును, తిరుమంగైయాళ్వా రానతిచ్చిన 2అ పెరియ తిరుమొళిని చెప్పుచుండిరి. మొదట పెరియనంబియొద్ద, పిమ్మట తిరుక్కోట్టియూరునంబియొద్ద, మూడవవారు తిరువరంగప్పెరుమాళరయరువద్ద, నాల్గవవారు తిరుమాలెయాండాన్వద్ద తెలిసిరని కొన్నిగ్రంథములు, మూడవవారు తిరుమాలెయాండాన్ కడకు

పోయిరని మరికొన్నిగ్రంథములు, మూలగ్రంథము ప్రపన్నా
మృతమును రెండును సరి యనిరి. ఎటులన వారు తిరువరంగ
ప్పెరుమాళరయరువద్దకు రెండుమారులు పోయిరి. తిరుమాలె
యాండాన్ చెప్పగా యామునులు రహస్యముగ జెప్పియుండిన
పంచమోపాయనిష్ఠను తెలియుటకై రెండవపర్యాయము పోయి
యుండిరి. అపుడు తిరుమాలెయాండాన్ వద్దకు ముందే పోయి
నట్లు అగుచున్నదిగదా! ఒకనాడు తిరుమాలెయాండాన్ అర్థము
చెప్పుచుండగా ఈపాశురమున కిట్లర్థము చెప్పవచ్చునని యతిరాజు
లనిరి. వారికి కోపము వచ్చెను. నేను యామునులవద్ద సాక్షాత్తుగ
విన్నవాడను. నీవిట్లు వేరుగ అర్థముచెప్పెదవా ? ఇది విశ్వామిత్ర
సృష్టిగ నున్నది. నేను పెద్దలుచెప్పినట్లు చెప్పుచున్నాను. కాదన
రాదు. నీవు సర్వజ్ఞుడవు. నీకు చెప్పుటకు గాదు; పొమ్మని
తిరుమాలెయాండాన్ పల్కిరి. యతిరాజులు మఠమున కరిగిరి.
పెరియనంబి తిరుమాలెయాండాన్ కడకేగి "మనలక్ష్మణులకు ఉప
దేశించుచున్నారా?" యని యడుగగా కాలక్షేపము నిలిచెనని వా
రనిరి "ఎందుచేత ?" నని పెరియనంబి ప్రశ్నింపగా నేనొకటి
చెప్పగా వాడొకటి చెప్పుచున్నాడు. పెద్దలుచెప్పినయర్థము కాదను
చున్నాడు. అందుచేత యపరాధము రాదా యనిపల్కిరి. పిమ్మట
వారిరువురును తిరుకోట్టియూరునంబియొద్దకేగి "మనము మువ్వు
రము యామునులవద్ద వినియుండలేదా" యనిరి. "యతిరాజు
చెప్పిన యర్థమే సరి" యని వా రనిరి. పిమ్మట అమువ్వురును గలిసి
మఠమునకు వచ్చిరి. "యతిరాజా! నే నాయర్థమును మరచితిని.
ఇక మీరు కాలక్షేపము వినవలయు" నని తిరుమాలెయాండాన్
చెప్పిరి. తిరుకోట్టియూరునంబియు, పెరియనంబియు, తిరుమాలె
యాండానును రహస్యముగ బిలిచి వాడేమైన చెప్పినను కాదన
వలదు. ఆయనకు తెలియక వినుచున్నాడనుకొనవలదు. సాందీపుని

యొద్ద గీతాచార్యుడు తెలిసికొనునట్లు నిమిత్తమాత్రముగ గురు వుండవలెనని యున్నాడని చెప్పి వెళ్లిరి. యతిరాజులు మునుపటివలె కాలక్షేపము వినుచుండిరి.

యతిరాజులు తిరుమాలెయాండానువద్ద కాలక్షేపము వినుచుండగా మరలనొక గొప్పసంగతి వచ్చెను. ముందువా రర్థము చెప్పినపుడు ఆయర్థము బాగుగనున్నది. ఇట్లుకూడ నొకయర్థము చెప్పరాదా యని యతిరాజు లడిగియుండిరి. ఇపు డట్లుగాక ఒక్కనాడును యామునులు ఇట్లు చెప్పియుండ రనిరి. ఏమిరా! యామునులు అర్థముచెప్పగా నీవు వింటివా ? వారిదర్శనమే నీకు లేదు. నేను సాక్షాత్తుగ విన్నవాడను అని తిరుమాలెయాండాను లనగా నేను వారిని చూడ నవసరములేదు. నాకాయర్థము తెలియును. ద్రోణాచార్యుల ధనుర్విద్యారహస్యములు ఏకలవ్యునకు తెలియలేదా ? నాకు యామునులయందు గల భక్తిచేతనే తెలిసెను. ఏకలవ్యుడు ద్రోణాచార్యుల కెట్లు శిష్యు డాయెనో అట్లే నేనును యామునులకు శిష్యుడ నైతి ననుకొనుడు. దుర్యోధనాదులు సమీపమున నుండియు గ్రహించిరా యని యతిరాజు లనిరి. తిరుమాలెయాండానుకు కోపము వచ్చెను. కృష్ణుడు సాందీపునియొద్ద నామమాత్రముగ విద్య నభ్యసించినట్లు యతిరాజు నీయొద్ద అభ్యసించుచున్నాడని తెలియు మని తిరుకోట్టియూరు నంబి, పెరియనంబి చెప్పియుండుట చేత ఆయన నిజబుద్ధితో యోచించి యతిరాజులు చెప్పినయర్థమే సంగతము. యామునులు నేను చెప్పినట్లు చెప్పియుండరు అని తలంచి తోడనే లేచి "యతిరాజా! యామునులు చెప్పిన యర్థములను జెప్పుచున్నావు. నీ కెట్లు తెలియుచున్నదిరా ? ఇకమీద నీకు అర్థముచెప్పుట నావల్ల గాదు. నేను శిష్యుడను, నీవు గురుడవు" అని యతిరాజులు నివారించుచున్నను ఆగక ప్రదక్షిణముచేసి నమస్కరించిరి.

పుత్రుడైనను, శిష్యుడైనను, శత్రువైనను అగుగాక! వారి వద్ద విషయము గ్రహింపవలసినదే. తిరుమాలెయాండాన్ యతిరాజుల నిట్లు ప్రశంసించి తనపుత్రుడైన సుందరబాహువు లేక సుదరత్తోళుడయాన్ అనునాతని యతిరాజులకు శిష్యునిగజేసి "యతిరాజా! నేనొక కార్యమును చెప్పెదను. చేసెదవా? యామునుల కుమారునియొద్ద విశేషము లుండును. నీ వచటికి పోయి విశేషముగ శుశ్రూషచేయుచుంటివేని నీకుపదేశింతురు పొమ్ము" అని చెప్పిరి. రామానుజులు యామునపుత్రులైన తిరువరంగప్పెరుమాళరయరు కడ కేగి విశేషములు చెప్పుడని కోరిరి. అన్నియు చెప్పి ఆయెనే యనిరి. యతిరాజులు అచ్చటనే యుండి పాలు కాచి కలకండవేసి వెచ్చవెచ్చగ వారి కిచ్చుచు అనేకమాసములు గడపిరి. "యతిరాజా! బాగుగ నున్నదని వారనుచుండిరి. ఇట్లుండగా ధనుర్మాసము వచ్చెను. అరయరు సన్నిధిలో నాడి వచ్చి పరుండుదురు; వారికి శ్రమగ నుండునని తలంచి యతిరాజులు వేడినీళ్లుపెట్టి ఒడలుపట్టి స్నానము చేయించుచుందురు. భక్తితో వారిట్లు ఆరునెలలు గడుపగా "యతిరాజా! నీకు మంత్రోపదేశ మాయెను. సకలశాస్త్రములును నేర్చియైనది. ఇందరుపెద్దలయొద్ద యిన్నివిద్యలు గ్రహించితివే. "ఎవరు పెద్ద లని గ్రహించితి" వని అరయ రడుగగా సాక్షాత్ వైకుంఠనాథుడు అని యతిరాజు లనిరి. "కాదు. నీకుపంచ మోపాయమును జెప్పెదను. అది శరణాగతికి మీదిది. కర్మజ్ఞాన భక్తిప్రపత్తులకు పైది. అదేమన—

గురు రేవ పరంబ్రహ్మ గురు రేవ పరం ధనమ్ ।
గురు రేవ పరః కామో గురు రేవ నారాయణః ॥
గురు రేవ పరా విద్యా గురు రేవ పరాగతిః ।
అస్మాత్తదుపదేష్టాం సా తస్మా ద్గురుతరో గురుః ॥

అని యీశ్లోకమట్లు సర్వమును గురువే యని భావింప వలెను. భగవంతు నాశ్రయించితిమి. కాపాడునని తలంచి గురువును మఱువ రాదు. భగవంతునికి ఆగ్రహము గలిగినను 'వీడు నాశిష్యుడు' అని గురువు చీటినిచ్చును. గురువునకు కోపము వచ్చిన ఎవడును కాపాడలేడు. ఉపాయోపేయములు గురువే. వారి యొద్దకు చేరినచో వారే భగవంతుని యొద్దకు చేర్చుదురు'' అని యిట్లు తలచియుండుట అను పంచమోపాయము నుపదేశించగా యతిరాజులు వినిరి. పెరియనంబి, తిరుక్కోట్యూరునంబి, తిరుమాలె యాండాను తమపుత్రులను యతిరాజులకు శిష్యుల గావించిరి. నాకు కుమారుడు లేడు. యోగ్యుడగు తమ్ముని కుమారునిగ దలపవలయును. ఇదిశాస్త్రము గాన నాకుమారునితో సమానముగ తలచియుండు తమ్ముడగు ''శొట్టినంబి''ని శిష్యునిగా జేసెద నని తలంచి వా రట్లే చేసిరి. ఒకరాజు రాజ్యపరిపాలనము చేయుచుండి తాను పోవునపుడు తనకుమారుని క్షేమమునకై అనేక సన్మంత్రులయొద్ద తనసర్వస్వము నిచ్చినట్లు యామునులు రామానుజులకై అయిదుగురు శిష్యులయొద్ద రహస్యముల నుంచిరి.

రామానుజులు ఈశిష్యుల నందరిని చెంతనుంచుకొని కాలక్షేపము చెప్పుచుండగా అర్చకులు వీరికి విరుద్ధముగ నడచుచుండిరి. ఆయనకు సరిపడలేదు. యతిరాజు మిక్కిలి యాచారపరుడు. వీరిని తొలగింపవలయును అని అర్చకులు సంకల్పించిరి. ప్రధానార్చకుడు ఒకశ్రీవైష్ణవుని పిలిచి ధనమిచ్చి యతిరాజు మాధుకరమునకు (తుమ్మెద అందందు తేనెను సంపాదించును. అదియే మధుకరవృత్తి. అటులే శరీరధారణార్థము అందందు ప్రసాదము స్వీకరించుటయు మధుకర మనబడును.) వచ్చునపుడు విషాన్నమును పెట్టునట్లు మీభార్యకు చెప్పుము అనెను. ఆవైష్ణవుడు తనభార్యకు చెప్పగా ఆమె సంకోచపడెను. అత

డామెను నిర్బంధించెను. యతిరాజు వారింటివాకిట పోవుచుండగా వీరికి విషాన్న మిడిన తప్పుపని యగును. ఇడకున్న పతివాక్యో ల్లంఘనము చేసిన ట్లగును అని యాపతివ్రత యోచించి విషా న్నముదెచ్చి యతిరాజుల కిచ్చి ప్రదక్షిణము చేసి నమస్కరించి లోపలికరుగక కాలివ్రేలిని నేలవ్రాయుచు అధోముఖియై ముఖమున కళలేక నిలబడెను. యతిరాజు లామెవాలకమును కనుగొని జ్ఞాన దృష్టిచేత సంగతి గ్రహించి ఆయన్నమును ఒకకుక్కకు వేయగా అది తిని చచ్చెను. ఈమె పతివ్రత యని తలంచి యతిరాజామెను ఆశీర్వదించి వెడలి హత్యాదోషపరిహారముగ మూడుదినములు ఉపవాసము చేసిరి. ఆకుక్కకు మోక్షము లభించువేళ వచ్చెను. అది యతిరాజుల పరీక్షకు పాత్ర మాయెను. పెరియనంబి తిరు క్కొట్యూరునంబియొద్దకు పోయి యుండిరి. వారీసంగతి విని యతిరాజులను చూచుటకై వచ్చిరి. ఇచట మధ్యనొక కథ యున్నది. అదికొన్నిగ్రంథములందు లేదు. "కిడాంబియాచ్చాన్" అనువాడు తిరుమలనంబికి బావమరదికొడుకు. ఆయన తనమేనత్త భర్తను అనగా తిరుమలనంబిని చూడబోయిరి. ఈయన ఉండు నపుడే తిరుమలనంబికి పుత్రుడు గలిగెను. ఆబిడ్డ ప్రహ్లాదుని యట్లు బాలలీలలో భగవద్భక్తి గల్గియుండెను. శ్రీరంగమునుండి కొందరు వైష్ణవులురాగా విశేషము లేమని తిరుమలనంబి యడిగిరి. "కోవెలయంతయు మీ మేనల్లుడగు యతిరాజులదే" అని వారు చెప్పిరి. ఈమాట వినినతోడనే కిడాంబియాచ్చానుకు, తిరుమలనంబి పుత్రునకు శ్రీరంగమున కరిగి యతిరాజులను జూడవలెనను కోరిక గలిగెను. కిడాంబియాచ్చాను బయలుదేరగా బిడ్డయును నేను వచ్చెద ననెను. వీనినిగూడ పిలుచుకొని పొండని తిరుమల నంబి చెప్పగా వారు పిలుచుకొనిపోయి యతిరాజుల కాబాలుని జూపిరి. "ఈబాలు డెవ"డని యతిరాజు లడుగగా "తిరుమలనంబి

కుమారుడని, ఇతనికి భగవద్భక్తియు, తముచరణారవిందములందు భక్తియు గలదు. తమ్ము సేవింపవలయునని ఆశపడెను'' అని కిడాంబియాచ్చాన్ చెప్పిరి. యతిరాజు లాబిడ్డనుజూచి "ఓహో! ఈతడు తిరువేంగడముడయాను అనుగ్రహముచేత పుట్టినవా''డని తెలిసికొని ఆబిడ్డ ననుగ్రహించి కిడాంబియాచ్చానున కుపదేశించిరి. దగ్గరబంధువును, గురువును అగుటచేత యతిరాజులు సకలార్థములు వారికి చెప్పిరి. యతిరాజు రంగనాథానుగ్రహపాత్రులుగాన సూర్యోదయము మొదలు సకలకైంకర్యములును కిడాంబియాచ్చాన్ స్వయముగ సల్పునట్లు ఏర్పాటు చేసికొనిరి. ఈదివ్య మంగళవిగ్రహమును కాపాడవలయునని భక్తిచే నట్లేర్పడిరి.

పెరియనంబి, తిరుక్కోట్యూరునంబి యతిరాజులను జూచుటకై కావేరిప్రక్కగ నెండలో వచ్చుచుండిరి. ఇరువురు వచ్చిరని యొకగ్రంథము. ఈసంగతి విని గోష్ఠిపూర్ణులు మాత్రము వచ్చిరని యొకగ్రంథము. యతిరాజులు భక్త్యతిశయముతో వారి కెదురుగబోయి సాష్టాంగపడిరి. వారు లెమ్ము అనలేదు. వీరు లేవలేదు. ఇంతయుచూచుచుండిన కిడాంబియాచ్చానుకు ఇది సహింపరాని దయ్యెను. అయ్యా! కావేరికి ఆప్రక్క నిలుపరాదా? గురుశిష్యమర్యాదయన్న నిదేనా ? మాగురువును చంపుటకు వచ్చితిరా ? లెమ్మనరాదా ? చోళియా (ముందుజుట్టువాడా) అని వారిని తిట్టి యతిరాజులనెత్తి దేహమందలి మన్ను తుడిచి భుజముమీద వేసికొనెను. గోష్ఠిపూర్ణులు యతిరాజుచేయి పట్టుకొని ''యతిరాజా! ఇతడు నీదేహము కష్టపడగా సహింపలేకపోయెను. నీశరీరముమీద పరమాభిమానము గలవాడు. వీనియొద్దదప్ప నితరులయొద్ద భుజింపకుము'' అనిరి. ఒకగ్రంథములో మరొక సంగతి యున్నది. యతిరాజులకు మునుపు విషము పెట్టించుటకు యత్నించిన అర్చకుడు తనయత్నము ఫలించక పోగా అసూయతో

మరల ప్రియత్నించెను. ఒకనాడు యతిరాజులొక్కరే రంగ నాథుని సేవింపబోయిరి. వారు ఒంటరిగ వచ్చుటనుజూచి అర్చ కుడు తీర్థమున విషముగలిపి యిచ్చెను. అయోగ్యుడు ఘాతుకుడు అట్లు చేసెను. యతిరాజులాసంగతి తెలిసియు భగవత్పాదతీర్థ మగుటచేత తీసికొనిరి. అది పనిచేయలేదు. ఎందుచేత ననగా యతిరాజులు ఆదిశేషుడుగదా! ఈయన విషములో ఆవిషము కోట్యంశముండునా ? అంతేగాక యీయన హరిభక్తుడు. హరి పాదోదకమున విషముచేరెను. కాన హాని కలుగలేదు.

సేతువుమొదలు శీతాచలమువరకు యతిరాజులను బోలిన వారు మరియొకరు లేరు. అతడు అనంతకీర్తి. దేవేంద్రుడు, దేవతలచేత సేవింపబడుచు రాజ్యమేలునట్లు యతిరాజులు ఎల్ల వారిచేతను సేవింపబడుచుండిరి. వారు సేతువునుండి హిమగిరి వరకు శాత్రవులను ఖండించి అప్రతిహతముగ శిష్యులతో ప్రకా శించుచుండగా యజ్ఞమూర్తియగు నొక పెద్దపండితుడు మహాద్వైతి వచ్చెను. "ఈరామానుజాచార్యులు కన్యాకుమారినుండి కాశ్మీరము వరకు తన్నుమించినవాడు లేడని యున్నాడు. వీనిని జయించ వలయును"అని అసూయాప్రేరితుడై జయభేరి వేయుచు వచ్చెను. ఆతని వెనుక బండ్లకొలది తాటియాకుపుస్తకములు తెచ్చుకొనెను. అట్లు విద్యాగర్వముతో వచ్చి యతిరాజులను గాంచి "యతిరాజు, యతిరాజు అందురే. ఆ యతిరాజులు నీవేనా ? నాతో వాదము సల్పవలయు" నని అడిగెను. వాదించుటకు సందేహము లేదు. మీరొకటి చెప్ప నేనొకటిచెప్పి ప్రయోజనము లేదు. పందెము పెట్ట వలయును. ఏమి పందెము పెట్టెద రని యతిరాజు లడుగగా "నేను ఓడిపోయినయెడల నీపాదరక్ష శిరమున నుంచుకొని నీపేరు పెట్టు కొని నీమతమున ప్రవేశించెదను." యతిరాజా! నీవు ఓడిన నేమి చేసెదవు అని యజ్ఞమూర్తి యనెను. "నేను జపించు మంత్రమును

జపింపను. కాలక్షేపము చెప్పను. గ్రంథసన్యాసము (అనగా పుస్తకములను వదలుట) చేసెదను'' అని యతిరాజు లనిరి. వీరిరువురును ఉజ్జ్వలనరసింహస్వామి సన్నిధిలో చేతులెత్తి ప్రమాణము చేసిరి. వాద మారంభమాయెను. యజ్ఞమూర్తి లేక కారుణ్యాకరుడు అని యతనిపేరు. అతడు శాస్త్రపంక్తిని వల్లించువాడు. లోపలిసంగతి తెలిసికొనలేదు. యతిరాజు తెలిసినవారు. పెద్దగోష్ఠి సమకూడెను. యతిరాజెట్లు జయించు ననుకొనిరి. అతడట్లు వాదించుచుండెను. పదునారుదినములు వాదము సమముగనుండి పదునేడవదినమ్మున యతిరాజులవాదము ఈషత్తు తగ్గినట్లు తోచెను. అతడే మీద మీద పోవుచుండెను. యతిరాజులకు సాధ్యపడలేదు. యోచించుచుండిరి. పదునేడవదినమున వాదమునుండి లేచుసరికి అతని కక్షయే అధికముగ నుండుటచేత యతిరాజులు రేపు చెప్పెదనని అతనితో పల్కి చింతాశోకసమన్వితులై తీర్థపానములేక పరుండిరి. ''యతిరాజా! అతడు నిన్ను జయింపవచ్చినా డనుకొంటివా? గొప్పవాడు. నిన్ను సంకటపెట్టుటకై అతనిని తెచ్చితిననుకొంటివా? ఒక్కొక్కడు వచ్చివచ్చి నీతో వాదములు సల్పరాదనియు, అందరికి పైవాడు, సింహమువంటివాడు నీకు శిష్యుడు కావలయునని కోరిపిలుచుకొని వచ్చితిని. నీవుచెప్పుదానిని బుద్ధిమంతులు గ్రహింతురు. నీవును యోచించునట్టివానిని నీకు శిష్యునిగ చేసినయెడల వచ్చినవారిన్ని వాడు చూచుకొనును. కనుకనే అట్టివానిని శ్రమపడి తెచ్చితిని. రేపు వాడు ఓడిపోయి నీకు శిష్యుడగును'' అని వరదరాజస్వామి చెప్పెను. ''శిష్యుడైనప్పటికి చూతము. రేపు వాడడుగుదానికి సమాధానము చెప్పవలయునే'' అని యతిరాజు లనిరి. యామునాచార్యులు మాయావాదఖండనమను ఒక గ్రంథమును వ్రాసియుండిరి. ప్రసంగకోలాహలమున యతిరాజు లాచిన్నపుస్తకమును గమనింపలేదు.

అపుడది కావలసియుండెను. వరదరాజు లాపుస్తకమును చేతికిచ్చి దీనిలోనుండు యుక్తులను చెప్పుము. సరిపోవును అనిరి. యతిరాజు కన్నుతెరచి చదివి "ఆహా! యామునులు ఈచిన్నగ్రంథమున నెన్నివ్రాసిరి. ఇతర గ్రంథములం దేమి యున్నది?" అని సంతోషించి, వాదమునకు పోయిరి.

ముందునాడు యజ్ఞమూర్తి యతిరాజులను చూచి "యతిరాజా! రేపు చెప్పవలయును, లేకున్న జయభేరి వేయింతును" అనియనగా యతిరాజులు ముఖము చిన్నబుచ్చుకొని వెళ్లియుండిరి. పదునెనిమిదవనాడు యతిరాజులు వాదమునకు రాగా యజ్ఞమూర్తి వారిముఖమును జూచి "ఓహో! యితడు నిన్న ముఖము చిన్నబుచ్చుకొనిపోయెను. నేడు దీప్తితో నున్నాడు. కారణమేమి ? ఈయన కేదో గ్రంథము దొరకియుండవలయును" అని తలంచి "యతిరాజా! నీకు భగవంతుడు ప్రసన్నుడై యేదో సరకు నిచ్చినట్లున్నది. నీవు చెప్పి, నేనోడి నలుగురియందు నగుబాట్లపాలు కానేల ? నేను నీకు శిష్యుడనైతి" ననెను. ఈయన మనుష్యమాత్రుడు గాడు. సాక్షాత్ పరమేశ్వరాంశము అని భావించి ప్రదక్షిణనమస్కారములుచేసి యతిరాజు పాదములు శిరమున నిడుకొని శిష్యుడాయెను. శిష్యుడైనమాత్రమున చాలదు. వాదముచేయవలెనని యతిరాజు లనగా మీకు భగవంతుడేదో చెప్పిపోయెను. నా కాసంగతి తెలిసెను. శిష్యుడ నైతినని యజ్ఞమూర్తి పలికెను. సూర్యుడు రాత్రివేళ అగ్నిలో ప్రవేశించుచున్నాడు. రెండుతేజస్సులు చేరుటచేతనే అగ్నికి రాత్రులయందు ప్రకాశము హెచ్చుగా నుండును. "రాత్రి నీతేజస్సును గ్రహించితిని. నీవిపుడు నాతేజస్సును తీసికొనుము" అని అగ్నిదేవుడు తనతేజస్సును పగటివేళ సూర్యున కిచ్చుటచేత పొగను జూచియే అగ్నిని తెలిసికొనవలసిన ట్లున్నదని వేదవాక్యము.

దీపమునకు పగటిపూట ప్రకాశములేదు. రాత్రికాగా ప్రకాశించును. పగటిపూట ప్రకాశించనందున అగ్నిలేదని యర్థమా ? కాదు. మధ్యాహ్నము తేజోహీనమైన అగ్నియేకదా అట్లు ప్రకాశించును. సూర్యుడస్తమించునపుడు ప్రకాశించకుండునట్టి అగ్నిని పిలిచి "నీకు నాతేజస్సు నిచ్చెదను. నీవు దానినుంచుకొని ప్రకాశింపుము" అని చెప్పిపోవును. అగ్నితేజస్సు, సూర్యతేజస్సు-రెండును చేరగా ప్రకాశముగలిగెను. అట్లే రఘుమహారాజు రాజ్యము లభించుటకు ముందు పగటియగ్నివలె ప్రకాశింపకుండి రాజ్యమురాగా సూర్యకాంతిగొన్న యగ్నియట్లు ప్రకాశించెనని రఘువంశమున చెప్పబడెను. ఆరీతిగనే యజ్ఞమూర్తి మీదమీదపోగా యతిరాజుల ముఖచ్ఛాయ తగ్గిపోయెను. భగవత్కృపను తీసికొని ప్రకాశించెను. ఇట్టి యతిరాజులను యజ్ఞమూర్తిచూచి "నేనోడితిని. మీశిష్యుడనైతిని. మీమతమున గలసితిని. మీపాదరక్షల నొసగుడు" అని చెప్పి బలాత్కారముగ వానిని గైకొనెను. అటులైన మామతమున నుండవలసిన విధమునగదా ఉండవలెను అని యతిరాజు లనగా యజ్ఞమూర్తి తన ఏకదండమును పారవైచి త్రిదండసన్యాసి యాయెను. ప్రాయశ్చిత్తముగ మరల ఉపనయనము చేసికొనెను. ఈయన పరమతస్థుడుకాగా తోడవచ్చినశిష్యులగతి యేమి ? పరమతస్థుడైన యీయన నాశ్రయింపవలయునా ? వారివారి యూళ్లకు పోవలయునా ? అట్లగుటచేత ఈయన తానుమారుగనే ఒక్కొక్కశిష్యుని మార్చెను. సన్యాసిగనుండినయెడల త్రిదండము నిచ్చెను. ఓడిపోయినవారు గెల్చినవారిపేరు పెట్టుకొనవలయును గదా! యతిరాజు స్వయముగ జయించలేదు. స్వామివలన జయముగలిగెను. స్వామియు సాక్షాత్తుగ జయించలేదు. ఇరువురి వలన జరిగినకార్యముగనుక ఇరువురిపేర్లను ఈయన పెట్టుకొనవలసియుండెను. దేవరాట్దేవమన్నాథన్ లేక పేరరుళాళప్పెరుమాళ్

ఎంబెరుమానార్ అని రెండుపేరులు పెట్టిరి. ఇది మిక్కిలి పొడవైన పేరగుటచేత దేవరాజన్ అని వ్యవహారనామ ముంచిరి. యతి రాజులు శిష్యులను బిలిచి "ఈయన ఓడిపోయినాడు గనుక మీతో సమానుడని అనుకొనవద్దు. నాస్థానమున నుండువాడని తలంపుడు. మీకు నాయందెట్లు భక్తి కలదో, ఎట్లు నాకు శుశ్రూష చేయుదురో అట్లు వీరికిని చేయుడు" అని చెప్పిరి.

యతిసార్వభౌము లిట్లు యాదవప్రకాశులను సరిపరచి గోవిందజియ్యరుగ చేసి అతనికంటెను హెచ్చైనవానిని ఎట్టి వాది వచ్చినను ఖండించువానిని వరదరాజుల పరమానుగ్రహమున జయించి, సూర్యుడు ప్రకాశించునట్లు అద్వితీయుడై ప్రకా శించుచు, సూర్యుడు అంధకారమును పోగొట్టునట్లు అంధకార స్థానమున నుండువారిని ఖండించుచు నుండిరి. అపుడు అనంతా ళ్వాన్ మొదలగు గొప్పపండితులు రామానుజుల నాశ్రయింపరాగా, నాకు పెద్దశిష్యు డున్నాడు. ఆయనయొద్దకు పొండు అని చెప్పిరి వారెల్లరును పేరరుళాళప్పెరుమాళెంబెరుమానారు దగ్గరకు పోగా వారు "రామానుజులు ఉండగా నేనేమి కాలక్షేపము చెప్పుదును. (కురివిన్ కళత్తిలే పనంకాయై కట్టినాప్పోలె) అనగా చిన్నపిట్ట గొంతుకు తాటికాయను కట్టినట్లు రామానుజులు చేసిరి. నేను అజ్ఞుడను, ఆయన సర్వజ్ఞుడు, మహానుభావుడు, ఆయన చరణ ములనాశ్రయింపుడు" అని చెప్పెను. ఆచార్యుల కుండవలసిన వాత్సల్యమును యతిరాజుచూపగా శిష్యులకుండవలసిన భక్తి నైచ్యానుసంధానమును దేవరాజు చూపిరి. వారందరును మరల వచ్చి ఇచ్చటనే ఆశ్రయించునట్లు చెప్పిరనిరి. పిమ్మట తిరువాయ్ మొళి కాలక్షేపము జరుగుచుండగా తిరుమలవిషయము వచ్చెను. "ఆహా! ఏమి వేంకటేశ్వరుడు; నాకు వాధముతోనే సరిపోవుచున్నది. తిరుమలకు పోయి పుష్పకైంకర్యము చేసిన బాగుగ నుండును.

అట్టి సుకృతప్రాప్తి గలవా డెవడో యని యతిరాజు లనగా, "నాకు ఆజ్ఞ నిచ్చిన నేను చేసెద" నని అనంతాళ్వాన్ అనెను. "నేను పోయిన నేమి? నాశిష్యుడు పోయిన నేమి? ఒకకార్యమును తండ్రిచేసిన నేమి? కొడుకుచేసిన నేమి?" అని తలచి యతిరాజులు అనుజ్ఞ నీయగా ఆయన తిరుమలకు పోయి నందన వనము ప్రతిష్ఠించి పుష్పములను, తులసీదళములను మాలలుగట్టి భగవత్కైంకర్యము చేయుచు సుఖముగ నుండిరి. యతిరాజు అనంతాళ్వానును పంపి వారు సుఖముగ కైంకర్యము చేయుచున్నారని విని తాము కూడ తిరుమలకు పోయి స్వామిని సేవింప వలయునని తలచి స్వామిసన్నిధికి పోయి "రంగనాథా! వేంకటేశ్వరుని సేవింపవలయునని యున్నది. నిన్ను విడిచి పోవుటకు ఇష్టము లేకున్నది. అయినను ఆజ్ఞ ఆయెనేని పోయివచ్చెదను." అని యడుగగా "ఆహా! అటులే పొమ్ము. పోయి తిరిగి సుఖముగ రమ్ము" అని రంగనాథు డనెను. యతిరాజులు శ్రీరంగనాథుని అనుమతిపొంది అనేకశిష్యులతోడ తిరువేంగడముడయానును సేవింప బయలుదేరి కాంచీపురి మార్గమున తిరుపతి చేరిరి. వడుగు నంబి లేక ఆంధ్రపూర్ణులు అనువారు రచించిన యతిరాజవైభవము అను గ్రంథమున యతిరాజులు కాంచీపురి మార్గమున తిరుపతి చేరిరని తెల్పబడియున్నది. ప్రపన్నామృతమున మధ్య నొక సంగతి చెప్పబడెను.

యతిరాజులు తిరుమలకు పోవునపుడు అష్టసహస్రమను గ్రామము చేరిరి. వారి కా గ్రామమున ఉత్తమ బ్రాహ్మణులును, మహాప్రాజ్ఞులును అగు వరదాచార్యులు, యజ్ఞేశ్వరుడు అను ఇరువురు శిష్యులుండిరి. వారిని చూచి అనుగ్రహించి పోవలయునని రామానుజులకు తాత్పర్యముండెను. వారిలో నొకరగు వరదాచార్యులు మిగుల దరిద్రుడు. కాని మిగులభక్తిపరుడు. మరియొక

డైన యజ్ఞేశ్వరుడు మిక్కిలి శ్రీమంతుడు. అతనికి భక్తి తక్కువ. భక్తియేకదా ముఖ్యము. ధనవంతులవలన నేమి కావలయును ? అట్లు ద్రవ్యవంతుడని ఆశ్రయించినను యేదో స్వల్పద్రవ్య మిచ్చి పొమ్మనును. ఇందులకై యొకరిని స్తుతింప వచ్చునా ? మనయెడ భక్తికలవా డెవడో ఆతడే మనకు ప్రభువు అని లోకు లకు తెలుపుటకై యతిరాజులు వరదాచార్యుల ఇంటికి పోయిరి. అపుడు వరదాచార్యులు ఇంటలేడు. ఉంఛవృత్తికి పోయి యుండెను. అమ్మా! ఇంటిలో నెవరు ?, వరదాచార్యు లెక్కడ ? అని యతిరాజు లడిగిరి. అపుడు లక్ష్మియను పేరుగల వరదా చార్యులభార్య మూడుమూరలగుడ్డ కట్టుకొని యుండెను. ఆమె ఇంట నుండునపుడు ఆతుండుగుడ్డను కట్టుకొని, బయటకరుగు నపుడు ఒకచీర కట్టుకొనును. ఆమె రామానుజుల రాక నెరిగి సేవింపవలయునను కోరికతో నుండెను. కాని ఆవస్త్రముతో వచ్చు టకు లేనందున సంజ్ఞార్థమై చేతులు కొట్టెను. రామానుజు లాశబ్ద మును విని సర్వజ్ఞులుగాన విషయమును గ్రహించి తమతలకు చుట్టి యుండిన కాషాయమును లోనికి విసరివేసిరి. ఆమె యతిరాజు వేసిన వస్త్రమును గట్టుకొనివచ్చి వారిని సేవించెను. "ఆహా! మేము శుష్క దరిద్రులము. ఈయన మహానుగ్రహముతో వచ్చిరి. భర్త ఉంఛవృత్తినల్పి సంపాదించుకొని వచ్చుదానితో నేమగును ? గురుదేవు లిందరు శిష్యులతోడ దయచేసిరి. మరల నిట్టి కైంక ర్యము లభించునా ? కాన చెడుపని చేసియైనను వీరి నారాధింప వలయును. అట్లు చేయవచ్చునా ? యనిన తిరుమంగై యాళ్వారు ఋజుమార్గమున సంపాదించిరా ? దొంగిలించియేకదా తదీయారాధ నము సల్పిరి. మహానుభావుడు, మహాజ్ఞాతయగు ఆయనయే అట్లు చేసియుండగా నాకేల యోచన. వైష్ణవారాధనమే గొప్పసంగతి. భర్త వచ్చినను ఈకార్య మెట్లు నిర్వహించగలరు ? అని యామె

యోచించి చెడుకార్యము చేసియైనను వీరి నారాధింపవలయునని నిశ్చయించుకొనెను. ఆయూరిలో నొక పెద్దయంగడివాడు లక్ష్మమ్మ రూపలావణ్యములను చూచి మోహించి బీదరాలుగ నున్నది. ఒకనాడు నాయొద్దకు వచ్చిన యెడల పాదాదికేశ పర్యంతమును అమూల్యాభరణముల చేత నలంకరింపనా అని తలచి ఆమెకు సంగతి చెప్పి పంపుచుండెను. పతివ్రత యగుట చేత నామె అందులకు సమ్మతింపకుండెను. ఇపుడు ఆమె కా సంగతి జ్ఞప్తికి వచ్చెను. భర్తవచ్చువరకు నిదానించెద మనిన పరులు దూషింపుదు రని మరల నామనసు మారునేమో లేక భర్తవచ్చి ఈయకార్యము చేతనే వీరికి భోజనము పెట్టవలయునా ? తదీయా రాధనము ధనికులు చేయువలయును– అనునేమో ? కావున శీఘ్ర ముగ పోవలయును అని తలచెను. ఈమలమూత్రశరీరము నిచ్చి తదీయారాధనకు కావలసిన ద్రవ్యమును తీసికొని ఉడయవరుల నారాధింపవలయునని యెంచి ఆమె ఆవైశ్యుడుండు స్థలమునకు పోయెను. ఎందులకు వచ్చితివని వాడడుగగా సంగతి చెప్పెను. "అహా ! ఎన్నిదినములుగ ప్రియత్నించు చుంటిని; అట్టిది స్వయముగనే వచ్చెను. నాభాగ్యము; నే డెవరిముఖము చూచి తినో యని వాడు సంతోషించి నాసకలభాగ్యములు వలయు నన్నను ఇత్తునే'' యనెను. బియ్యము, గోధుమనూక, చక్కెర, నెయ్యి మొదలగు పదార్థములను యథేష్టముగ పంపెను.

లక్ష్మమ్మ యతిరాజులను సేవించి శిష్యులతోడ నారగింప వలయునని విన్నవించగా నీవు సాధ్వివి; శిష్యుని భార్యవు; నీకు ఉపదేశమై యుండును. తశియు చేయుము అని రామానుజు లనిరి. ఆహా! ఇందరికి భగవంతుడు ఇచ్చెనే అని యామె ఆనంద ముతో వంటచేసెను. ఆమెచేత భక్తితో అర్పింపబడినదానిని పరమ పవిత్రమని తలచి రామానుజులు భుజించిరి. మనసే ముఖ్యము;

శరీరము కాదు. "ఆహా! ఈమె యెంతసమర్థురాలు. యుక్తి చేసి ఇందరికి కావలసినది తెచ్చినది," అని వారు సంతోషించిరి. వారికి వ్యభిచారము సమ్మతమా యనిన కాదు. ఆమె పాతివ్రత్యము చెడిపోదని వా రెరుగుదురు. భోజనానంతరము వారు సకల శిష్యులతోడ గూర్చుండి "శిష్యులారా! వరదాచార్యులు లేరు. ఆమె యెట్లు పాకము చేసెను ? ఎంతలో చేసెను!" అని చెప్పుచు ఆనందించుచుండిరి. యతిరాజ చంద్రులు వరదాచార్యుల యింట భుజించి సుఖముగను, ఆనందముగను గూర్చుండి ఉభయవేదాంతములను నిరర్గళముగ ప్రవచనము చేయుచుండగా వరదాచార్యులు వచ్చి "నేనింటలేను. నాభార్య యేమి చేసెనో" అనగా "భయపడకుడు; భక్ష్యములతోడ విందు గుడిపించెను. మీరు లేనిదే కొదవ" యని యతిరాజు లనిరి. ఈయనకు సందేహము గలిగి లోపలికిపోయి చూడగా సందేహము నివృత్తి యాయెను. భార్యను పిలచి "సంగతియేమి ? నిజము చెప్పుము" అని యడిగిరి. "మీరు గ్రామాంతర మరిగితిరి. జగద్గురువు వచ్చిరి. ప్రార్థించినను రానివారు మీరువచ్చువరకును వారి నట్లే యుంచ రాదు గదా! అట్లుంచినను మీరువచ్చి యేమిచేయగలరు ? వాస్తవము విన్నవించెదను. మీపాదసాక్షిగా, సన్ననేక దినముల నుండి కోరియున్న అంగడివానికి నాసమ్మతిని తెలిపితిని. అటు పిమ్మట ఈసకలవస్తువులను వాడు పంపెను. వంట చేసితిని. వారు భుజించి గ్రంథవ్యాఖ్యానము చేయుచున్నారు" అని యామె పల్కెను. వరదాచార్యులు మహాజ్ఞాతగాన ఆసంగతి విని సంతోషించెను. "నీవు నాకు భార్యవుగావు, గురువగుచున్నావు. వచ్చిన వారికి పస్తు లేకుండునట్లు చేసితివి. జన్మాంతరమున నేజేసిన పుణ్యవశమున నాకు భార్యవైతివి. తిరుమంగై యాళ్వారును ప్రమాణముగ చేసికొంటివి. పెద్దల నారాధించితివి." అట్లు కాకున్న అప

చ్చారపడి మనమిరువురమును నశింపవలసియుండునుకదా!'' యనిరి. ''రాజకుమారిని బ్రహ్మరక్షస్సు పట్టగా అనేక మంత్రి వాదులు మంత్రములచేత తోలుటకు యత్నించిరి. యాదవ ప్రకాశులును ప్రయత్నించిరి. వారిచేత కాలేదు. అట్టిబ్రహ్మ రక్షస్సును పాదస్పర్శచేత తరిమివేసిరి'' అని వరదాచార్యులు యతిరాజులను స్తోత్రము చేసిరి. భార్యాపుత్రాదులు, ధనధాన్యా దులు ముఖ్యముకాదు. అజ్ఞానాంధకారమును పోగొట్టు గురువు ముఖ్యము. అట్టిగురువు నారాధింపగల్గెనని వరదాచార్యులు సంతో షించిరి. పురుషుడు లేనిసమయమున ఇంటికివచ్చిన పెద్దలతో మాట్లాడినను, వారి నారాధించినను తప్పుగ నెన్నబడుచుండగా వరదాచార్యులట్లు తప్పుగ నెంచక భార్యను స్తోత్రము చేసిరి. ఆనందముచేత నాడిరి. బండి యెద్దులు జతగా నుండవు. ఆలు మగలు నొకేరీతిగ నుండరు. ఈభార్యాభర్తలకు అట్లుగాక ఒకే మనసుగ నున్నదని యతిరాజులు సంతోషించిరి. నీకంటెను నీభార్య మహాభక్తురాలు. ఆమెచేసినకార్యమునకు నీ వానందించు చున్నావు. నీ వెంతధన్యుడవురా! మీయిరువుర మనస్సేమిరా ? యని రామానుజులు సంతోషించిరి. వరదాచార్యులభార్య భోజన పదార్థములను దెచ్చినవిధము తప్పేకదా యనిన, తనతో చేరిన వారు పాపముచేసిన ఆపాపమును ధ్వంసముచేయువారు రామాను జులు. జనులపాప మనుకట్టెలకు అగ్నివంటివారు. అట్టివారు సంతోషించి కొనియాడిరి.

భాగవతులకు భోజనపదార్థములను పంపిన యంగడివాని సంగతేమి యనిన, కబీరుదాసు తనభార్యను భుజముమీద గూర్చుండబెట్టుకొని పోయి, ''ఓసీ! ఇతడు భాగవతులకు సహాయ మొనర్చినవాడు. అతడు కోరునట్లు నీశరీరము నతనికి ఉపయోగ పడనిమ్ము.'' అని చెప్పి విడిచిపోయినట్లు, వరదాచార్యులు

భార్యను గాంచి "నీవు వాగ్దానము చేసితివిగదా! రమ్ము. నీకు తోడుగ వచ్చెదను" అని పిలుచుకొనిపోయి అంగడివానికి ఒప్ప చెప్పి, చీకటియగుటచేత నేనును వచ్చితిని, నాకు నీపై కోపములేదు. సంతోషమే. నీమనోరథ మీడేర్చుకొనుము అనిచెప్పి వెళ్లినట్లు చెప్పుదురు. లక్ష్మమ్మ ఉపకారస్మృతిచేత రామానుజుల శ్రీపాద తీర్థమును, ప్రసాదమును తబుకులో బెట్టుకొని అచంచల మనస్సుతో నరిగెను. అనగా అయ్యో! వీరు వచ్చినందున కదా నాపాతి వ్రత్యము చెడును అని అనుకొనలేదు. ఈప్రభువు వలన గదా తదీయారాధన జరిగెనని ఉపకారస్మృతితో పోయెను. వర్తకు డామెను అంతఃపురమునకు పిలుచుకొనిపోయెను. ఆమె అచ్చటికి పోయి వానికి తీర్థప్రసాదములు ఇచ్చెను. ఆతీర్థము లోపలికి పోగానే రజోగుణ, తమోగుణములు పోయెను. ప్రసాదము స్వీక రించగనే వివేకము గలిగెను. ఆయంగడివాడు తనదౌష్ట్యమును తలచి కన్నీరుకారగా తత్క్షణమే లేచి అంగవస్త్రమును నడుమునకు కట్టుకొని నమస్కరించి "అమ్మా! నీవు నాకు తల్లివి. నీభర్త నాకు తండ్రి. నేను మహాపాపిని. నీవిషయమున చెడుతలంపు కలిగి యుంటిని. ఇదివరలో చెడుతలంపు గలిగి యుంటివి కదా యని యడిగెదవా, మోసపోయితిని. బుద్ధిచెడి మన్మథవికారమునకు లోబడి అట్లు తలచితిని. నీచేతితో తీర్థమీయగనే నాసకలపాప ములు వీడెను. మన్నింపుము" అని ప్రార్థించెను. గురువు ఆరా ధనమును, మాటతప్పకుండుటయు, అంగడివాడు కడతేరుటయు చూచి ఆమెకు మిగుల సంతోష మాయెను. "ఓయీ! నీకు నేనేమి ప్రత్యుపకారమును చేయుదు"నని ఆమె యడుగగా ఏపెద్దల పాద తీర్థముచేత నాకు జ్ఞానము కలిగెనో ఆపెద్దలకు నన్ను శిష్యునిగ చేయుమని ఆతడనెను. దాన వానిని పిలుచుకొని పోయి యతిరాజు లను చూపి, "ఓయీ! నీవు ఇచ్చినది తెచ్చి వీరి నారాధించితిని.

సేవింపుము" అనగా అతడు సేవించి వైష్ణవశిఖామణి యయ్యెను. తుదకిట్లు అగునని తెలియగా వైష్ణవారాధనము జరుగవలయు ననియు, దంపతులు కృతార్థులగుదురనియు, ధనికుడు మేలొందు ననియు ఊరకుంటి నని యతిరాజు లనిరి. ఇట్లు జరుగుచున్నదని యజ్ఞేశ్వరుడను ధనికుడు విని మార్గమున దీపావళు లుంచి అలంకారములు చేసెను. నేను వారివలె అల్లాడవలయునా ? నాయింట సకలభాగ్యములును సిద్ధముగ నున్నవి అని తలచి బంధువుల నందరిని పిలిపించెను. తామరపువ్వు సూర్యోదయము నెదురు చూచునట్లు యజ్ఞేశ్వరుడు రామానుజులరాక కెదురుచూచుచుండెను. మూడుదినములైనను వారు రాకుండుటను చూచి "పేదవారింట నున్నారు. ఇక్కడికి రాకుండిన నాగౌరవము తగ్గును" అని తలచి తానే పోయి "రాకున్నారే! సకలమును యథేచ్ఛముగ నుంచియున్నానే. రండి" అని పిలిచెను. "నీవు ధనికుడవే. వరదాచార్యులవలె భక్తుడవు గావు, వచ్చుటకు నాకిష్టములేదు" అని రామానుజు లనిరి. నేను యాగము చేయలేదా అని యజ్ఞేశ్వరు డడుగగా "నీవన్నియును చేయుచున్నావు. ధనము వ్యయమగుచునే యున్నది. యోగ్యతలేదు. డంభార్థము, ఖ్యాతి, లాభమునకై చేసెదవు.

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥

అను భగవద్గీత 17అధ్యా॥ 20 శ్లోకమట్లు సాత్త్వికదానము లేదు. నీవు శిష్యుడవే. జ్ఞాతవైనను రాను" అనిరి. అట్లు సెలవీయ రాదని ఆతడు పాదముల బడెను. రామానుజులు వినక వానిని ధిక్కరించి ప్రయాణమైరి. లోకశిక్షార్థము వారట్లు కఠినపుమాట చెప్పి పోయిరి.

యతిరాజులు యజ్ఞేశ్వరుని ధిక్కరించి ప్రయాణమై త్రోవ ముగ మధ్యమందు దివ్యక్షేత్రములను దర్శించుచు వెళ్ళుచుండగా

తిరుమలకు సమీపమునందుండు విఠలదేవరాయుడను రాజు వీరి ప్రభావమును విని వచ్చి శరణాగతి చేయగా నతనిని శిష్యునిగ చేసికొని, తిరుమలకుపోయి, కపిలతీర్థమున స్నాన మాచరించి కొండఅడుగున నిలచి "ఈపర్వతమును త్రొక్కికదా పోవల యును. ఇది భగవత్స్వరూపము గాన ఇచ్చటినుండియే స్వామికి నమస్కరించెద" ననిరి. అపుడు అనంతాళ్వారు వారియొద్దకువచ్చి "యథా గురు స్తథా శిష్యః" అన్నట్లు మీరు దీనిని త్రొక్కకున్న మేముమాత్రము త్రొక్కవచ్చునా ? తామే రాకున్న మేము తిరుమల నెక్కుటను మానెదము. స్వామికి ఆరాధన నిలిచిపోవును అనిరి. రామానుజులు బాగుగ యోచించి ఒకధర్మమును కనుగొని ఒకవిధముగ నిర్ధారించిరి. "పరమభక్తులు, కైంకర్యపరులు అగు శ్రీవైష్ణవులు ప్రార్థించుచున్నారు. వీరిమాట వేదశాస్త్రములకంటెను హెచ్చైనది" అని తలచి "మీరెల్లరు చెప్పుచుండుటచేత ఎక్కెద" ననిరి. భాగవతుల ఉత్తరు వని తలచి వారిమాటకు గౌరవ మిచ్చి అందుచేత అవశ్యము వెళ్లవలసినదే యని కొండనెక్కిరి. మొదటి మెట్టున కాలుంచి స్వామిని ధ్యానించి శిష్యులతోడ పోయిరి. కొండపై కాలక్షేపముచేయుచుండు తిరుమలనంబి మర్యాదార్థమై ప్రసాదముతోడ రామానుజుల నెదుర్కొనిరి. నన్ను గౌరవింప మీరువచ్చుట సరికాదు. ప్రసాదము ఎవరిచేతనైనను పంప వచ్చును. ఇందుకై మీరు రావలయునా ? ఇది యుక్తమైన కార్యముగ నుండలేదు. ఎవరైన బాలుడు దొరకలేదా ? యని యతిరాజులు తిరుమలనంబి నడుగగా "నేను వెదుకగా నెవ్వడును దొరకలేదు. నాల్గువీథులలోను నాకంటెను తక్కువవాడు లేడు. నాకంటెను అధమవస్తువు లేదు" అని తిరుమలనంబి యుత్తర మిచ్చిరి. "అహా! వీరికెంత మనఃపరిపాకము! ఎంత నైచ్యాను సంధానము! నాకు పూజ్యులైన మామ ఇట్లనుచున్నారు. ఇట్లు

కదా ఉండవలయును'' అని యతిరాజులు తలచి ప్రసాదమును స్వీకరించి అచ్చటి విశేషములను చూచి ఈకొండ శ్రీవైకుంఠముగ తోచుచున్నది. ఇచ్చటి వృక్షములు, తీగలు, పక్షులు, మృగములు నిత్యసూరులై కనపడుచున్నారని కొండదిగుటకు కోరిరి. ''నాయనా! అట్లు దిగిపోరాదు. గొప్పదివ్యదేశమునకు పోయిన యెడల మూడుదినము లచ్చట నుండవలయును'' అని శ్రీశైల పూర్ణులు చెప్పగా అట్లే చేసెదనని యతిరాజులు అచ్చట మూడు దినము లుండిరి. పిమ్మట శ్రీశైలపూర్ణులతోడ కొండదిగి వారింట భుజించుచు ఒక్కసంవత్సరము శ్రీమద్రామాయణ కాలక్షేపము వినిరి. సర్వజ్ఞశిరోమణియగు వారు సంవత్సరము వినుటచేత రామాయణము యొక్క మాహాత్మ్యము విశదమగుచున్నదికదా! వారట్లు సుఖముగ వినుచుండిరి.

గోవిందభట్టరు శ్రీశైలపూర్ణులకు సకలకైంకర్యములను చేయుచుండిరి. వారొకనాడు పడుక వేసి, వేసినపిమ్మట ఆపడుకపై పరుండిరి. పిమ్మట శ్రీశైలపూర్ణులు పరుండిరి. రామానుజు లది చూచి గురుతల్పమును స్పృశించి కనుల కద్దుకొనవలసియుండగా వీడు అందు పరుండెనే అని కోపమురాగా శ్రీశైలపూర్ణుల కెరిగించిరి. వారికి కోపము వచ్చి "గోవిందా! అట్లు చేసితివా ?'' యనిరి. ఔనని వారనిరి. ''గురుతల్పశయనమున కేమిఫలము?'' అని వారడుగగా నరకమని గోవిందభట్ట రనిరి. మరియేల అట్లు చేయుచున్నావని వారడుగగా, ఆపడుకలో మిట్ట పల్లము లుండును. దుమ్ము పడియుండును. నాకు నరకము వచ్చిన వచ్చుగాక, నరకముకంటెను మరేమి రాదుగదా! మీకు సుఖముగ నిదురవచ్చిన చాలును అని గోవిందభట్టరు బదులు చెప్పిరి. శ్రీశైల పూర్ణులకు సంతోషమాయెను. ''ఆహా! వీనికుండు మనఃపరిపాకము నాకు లేదుగదా!'' యని యతిరాజులు సంతోషించిరి. వీడు నాకు

తమ్ముడుగదా అని మిక్కిలి ఆనందించిరి. యతిరాజులును ప్రాణులయందలి దయచేత తాము నరకమునకు బోవలసివచ్చునని యైన భావింపక గురువాక్యోల్లంఘనముచేసి తిరుమంత్రమును వెదజల్లిరికదా! "ఇతడు జ్ఞాని; గురుభక్తి కలవాడు" అని ఊరివారు పొగడవలయునని కొందరు గురుశుశ్రూష చేయునట్లు గాక ఇతడు నిజమైనభక్తితో చేయుచున్నాడు. వీని నింకను పరీక్షింపవలయునని రామానుజులు తలచిరి. గోవిందభట్టరు స్నానమునకు పోవుచుండగా మార్గమున నొక సర్పము పరుండియుండెను. అది కప్పలకై కంచెలో నాలుక చాచగా దానినాలుకకు ఒకముల్లు గుచ్చుకొనెను. నాలుకను లోపలికి ఈడ్చుకొనుటకు వీలుగాక అది శ్రమపడుచుండెను. గోవిందభట్టరు దీనినిచూచి పాము నాలుకలోని ముల్లుతీసి రక్తము తుడిచి విడిచిపెట్టిరి. రామానుజులు దీనినిచూచి ఇంటికి పోయి గోవిందభట్టరు రాగా "గోవిందా! ఇంత ఆలస్య" మేమని యడిగిరి. వారు సంగతి చెప్పిరి. పరమదుష్టజంతువు శ్రమపడుచుండగా దానిబాధ తీర్చెను. ఇతని మనస్సెంతమృదువో! ఇక సాధుజంతువుల విషయమున ఈతని చిత్తవృత్తి యెట్లుండునో చెప్పవలెనా? ఏమి యీతని మనఃపరిపాకము అని రామానుజులు అనుకొనిరి. శ్రీశైలపూర్ణుల యొద్ద రామానుజులు రామాయణమును వినిన పిమ్మట వారు "యతిరాజా! రామాయణమును వింటివి. స్వామిని సేవించితివి. మిగుల సంతోష మాయెను. నీకేమి కావలయునో అడుగుము, ఇచ్చెదను" అనిరి. రామానుజులు గోవిందభట్టరు యొక్క ఆచార్యభక్తిని చూచి మిగుల సంతోషించి తమతోడ పిలుచుకొనిపోవదలచి "నేనడిగినది ఈయవలయునను తలపు మీకుండెనేని ఈ గోవిందభట్టరును నాకొసగు" డని తిరుమలనంబి నడిగిరి. గోవిందభట్టరు గుణముల నెఱింగి వానిని కృతార్థుని

గావించుటకు పిలచుచున్నారని యెంచి "అట్లే ఇచ్చెదను, కాని విడిచ్చుట బహుదినములుగ నుండుటచేత మరల నాయొద్దకే వచ్చును. కాన ఉదకధారాపూర్వకముగ నిచ్చెదను" అని చెప్పి శ్రీశైలపూర్ణులట్లే గోవిందభట్టరును దాన మొసగి, తమఇరువురు పుత్రులనుకూడ పిలిచి "యతిరాజులు మహాజ్ఞాత. మీరు వారివలన కడతేరుడు" అని చెప్పి పంపిరి. వారు రామానుజుల నాశ్రయించి సకలార్థములు గ్రహించిరి. రామానుజులు ప్రయాణమై పోవునపుడు "యతిరాజా! నీవు ఒక్కని నడిగితివి. నేనొక్కని నిచ్చెదను" అని చెప్పి శ్రీశైలపూర్ణులు పిళ్ళాన్ అను తమకనిష్ఠపుత్రుని బహుమానముగ నిచ్చిరి. యతిరాజులు ఒకరి నడిగి తీసుకొని, మరియొకని శ్రీశైలపూర్ణు లీయగా నంగీకరించి ప్రయాణమై కాంచీపురికి వచ్చిరి. తిరుమలనంబి యతిరాజులకు గోవిందభట్టరును మాత్రము ఇచ్చెనని కొన్నిగ్రంథములలోను, పిళ్ళాన్ అను తన చిన్నకొడుకునకు బాల్యమునుండియు యతిరాజుల యందు దృష్టికాన వానిని కూడ ఇచ్చిరని కొన్నిగ్రంథములలో వ్రాయబడినది.

గోవిందభట్టరు శ్రీశైలపూర్ణుల విషయమున భక్తికలవాడు. కనుకనే నరకబాధనైన సహించి వారికి సుఖముగ నిద్రవచ్చు మార్గము నాలోచించిరి. గురుపాదసేవ లేనందున దుఃఖముతో నాతడు నానాటికి కృశించిపోవుచుండగా రామానుజులు గమనించి "ఓహో! ఇతడు దాక్షిణ్యముచేత వచ్చెనని తలంచి "గోవిందా! నీవు గురువును వదలినందున చింతచే చిక్కిపోవుచున్నావు. పోయి వారిని సేవించిరమ్ము" అని చెప్పిరి. గోవిందభట్టరు సంతోషముతో తిరుమల కరిగి తిరుమలనంబి వాకిట నిలిచెను. అచటివారు గోవిందభట్టరురాక తిరుమలనంబికి చెప్పగా "ఉదకధారాపూర్వకముగ యతిరాజులకు దానమీయగా మరల ఏలవచ్చినాడు ?

వాడు పరమభాగ్రింతుడు, బ్రాహ్మణుడు'' అని శ్రీశైలపూర్ణు లనిరి. వారిభార్యకు జాలి కలిగి భర్తయొద్దకేగి ''అయ్యో! వానిని లోపలికి పిలిచి భుజింపుమని మంచిమాటలు చెప్పి నెమ్మదిగ పంపరాదా ? వాకిటి నుండియే తరుమవలెనా'' యని పలికెను. గోవు మనదై యుండినపుడు దానికి కసవు, తవుడు పెట్టి కాపాడుదుము. అమ్మినపిమ్మట మరలవచ్చి కసవున నోరుంచెనేని రోకలియెత్తి కొందుము గాని కసవు వేయుదుమా ? అట్లేవానికి మనసంబంధము తీరిపోయినది. యతిరాజు సొత్తాయెను. ఇంటిలోపలికి రాగూడదు అని శ్రీశైలపూర్ణులు భార్యతోజెప్పి వానిని వెంటనే బ్రాహ్మణుడని శిష్యులతో నుడివెను. యతిరాజే శరణమని అతనికి తోచవలయు నను తాత్పర్యముతో వా రట్లనిరి. ఈసంగతి శిష్యులు గోవింద భట్టునకు ఎఱిగించగా ''సరి. మామ వదలెను. ఇక యతిరాజే శరణ'' మని తలంచి వారు గురుమందిరమునకు నమస్కరించి తిరుమల విడిచి కాంచీపురికి వచ్చిరి. ''గోవిందా! చూచి వచ్చితివా !'' అని యతిరాజు లడుగగా అమ్మినపశువునకు కసవువేయుదురా యనిరి. మీరే శరణము అనిచెప్పి గోవిందభట్టరు వారిపాదముల బడెను. రామానుజులకు సంతోష మయ్యెను. అచ్చటినుండి శ్రీరంగనాథుని ధ్యానించుచు బయలుదేరి పోయిరి.

యతిరాజులు తన్నుతోడ్కొనిపుచ్చి వెళ్లినపిమ్మట అష్టసహస్ర గ్రామములో యజ్ఞేశ్వరుడు మిగుల చింతతో నుండెను. వీనిని విడువరాదని తలంచి మార్గమధ్యమగుటచేత యతిరాజులు వారి యింట దిగిరి. వారిచే సత్కరింపబడి శ్రీరంగముచేరి రంగనాథుని సేవించిరి. తల్లిదండ్రులు పుత్రుని ప్రీతితో అడుగునట్లు రంగ నాథుడు రంగనాయకి, యతిరాజులను జూచి ''నాతండ్రీ! యతీంద్రా! మన్నాథా! వెళ్లి తిరువంగడముడయానును సేవించి తివా ? నీతోడ వచ్చినవారితోడ వచ్చితివా'' అని అడుగగా తమ

అనుగ్రహమున వచ్చితి నని చెప్పి యతిరాజులు మఠముచేరి శిష్యులకు కాలక్షేపము చెప్పుచుండిరి. యతిరాజులు గోవిందభట్టరును పిలుచుకొనివచ్చి ప్రవచనము సేయుచుండగా అచ్చటనుండిన కొందరు గోవిందభట్టరుయొక్క జ్ఞానభక్త్యాదులను గూర్చి "అహా! మీకున్న గురుభక్తి యెట్టిది ? మీరెట్లు గురుశుశ్రూషగావించు చున్నారు. ఇట్లెవరికిని కలుగదు. మీప్రవచనశక్తి, మీగ్రహణ శక్తి ఎంతగొప్పవి" అని స్తుతించిరి. మీరు మెచ్చినంత యోగ్యత నా కేమియున్నది ? అంతయు భగవత్కటాక్షము. మంచివారు గాన స్తుతించెదరు అని అనవలసియుండగా గోవిందభట్టరు "అవును. మీరనుచున్నది వాస్తవము. ఈస్తోత్రమునాకు మిక్కిలి తగును. మీరు నన్ను ఇంతకన్నఅధికముగనే స్తుతింపవచ్చును. నేను పొందవచ్చును" అని పల్కిరి. రామానుజులీసంగతితెలిసి గోవిందభట్టరును ఏకాంతమున బిలిచి "ఏమిరా! పదుగురు మెచ్చగా నాకేమియు తెలియదని చెప్పవలదా! ఆత్మప్రశంస చేసికొన వచ్చునా ?" అనిరి. అది నాస్తోత్రముగాదు; మీస్తోత్రము. కొంచెము గమనింపుడు. నేనట్టివాడను, ఇట్టివాడ నని స్తుతించు కొన్నను, వారు స్తుతించినను ఆయోగ్యత మీవలననేగదా లభించి నది. కములనయనభట్టరు పుత్రుడని వారు స్తుతించలేదుగదా! ప్రశంసించుటకు కారణము ఆచార్యుడేగదా! నాకు యోగ్యత లేదనిన తమకటాక్షము లేదనికదా అర్థమగును. వారు నిజమును స్తుతించిరి. నేనును స్తుతించుకొంటిని. యతిరాజులకృపకు పాత్రుడ నంటిని. మరలమరల చెప్పెదను. అట్టితమకృప దేవతలకైనని లభించునా ? నాకు లభించినది– అని గోవిందభట్టరనిరి. యతిరాజు మీద నేమియుతోచక మిన్నకుండిరి. మఱియొకదినము గోవింద భట్టరు స్నానముచేయుటకు ముందు దానియింటివాకిట తిరుగు చుండిరి. అట్లు పొద్దెక్కువరకు తిరుగుచుండి పిమ్మట

స్నానము చేసివచ్చిరి. ఎల్లవారును స్నానమాచరించి వెళ్ళగా గోవిందభట్టు రెచ్చట యని యతిరాజు లడిగిరి. ఆయన దాని యింటివాకిట తిరుగుచున్నాడని వారనిరి. గోవిందభట్టరు రాగా "గోవిందా! స్నానమునకు పోక దాసియింటివాకిట నిలిచితివా" యని యతిరాజు లడుగగా ఔనని వారనిరి. ఒకడు దాసియింట బడి అల్లాడుచుండగా ఓరీ! నీవు నిర్ధనుడవు. ధనికులైన వారినే వారు కడగంటచూతురు. నీవేలఅల్లాడెదవని మరియొక డడిగెను. నాకు ఆసుఖము లభించునని పోలేదు. ధనికులు, రసికులు జాలక్రమమున వారికటాక్షమునకు పాత్రు లగుదురు. నేనందుకు ఉండలేదు. కొందరు బండిలో పోవునపుడు దాసి యింటిగోడను జూచి ఆనందింతురు. నేనును అట్లే చూచినచాలునని యున్నాను అని వా డనెను. శంకరాచార్యులుచేసిన అమరుక శృంగారరస శ్లోకార్థ మిది. గోవిందభట్టరు మీద నుడివినట్లు దాసియింట నిలచిన చాలునని తలంచి నిలిచిరా ? ఎంతమాత్రముగాదు. ఎందుకు నిలచితి వని యతిరాజు లడుగగా మీవిషయమై కొందరుకవులు శ్లోకములను, పాటలను రచించియున్నారు. రాత్రి దాసియింట పరుండిన పాఠకులు మీకల్యాణగుణములను సుఖముగను, సుస్వరముగను, తాళబద్ధముగను పాడుచుండిరి. వానిని విడిచి పోవ మనసొప్పక నిలిచితిని అని గోవిందభట్ట రనిరి. యతిరాజుల యెడ గోవిందభట్టరున కున్న భక్తి యట్టిది.

ఇట్లుండగా గోవిందభట్టరుభార్య రజస్వల యాయెను. నిషేకముచేసికొమ్మని వారితల్లివచ్చి పిలువ యతిరాజులను విడిచి క్షణముండలేనని యతడు చెప్పెను. ఊరివారికి యతిరాజులుగాని, ఆమె కేమిభయము ? కాన పుత్రునిబంపుమని యడిగెను. విషయ సుఖానుభవము చీకటియందే జరుగవలెనని వేదముచెప్పుచున్నది. దేవతలసన్నిధాన ముండుటంబట్టి వెలుతురులో ననుభవించరాదు.

"గోవిందా! చీకటినిజూచి సుఖ మనుభవింపుము'' అని యతిరాజులు చెప్పి బంపిరి. ముహూర్తమై రెండునెల లాయెను. గోవిందభట్టరు భార్యను స్పృశించలేదు. వారాసంగతి యతిరాజుల కెఱిగించగా "ఏమిరా ? గోవిందా :'' యని వా రడిగిరి. చీకటిజూచి యనుభవింపు మని యంటినిగదా! చీకటి నా కగుపడలేదు అని గోవిందభట్ట రనెను. దీపమునార్పరాదా యని యతిరాజు లడుగగా అది సరియే. తాము నాకుపదేశించినవిధముగా భగవంతుని ధ్యానించు చున్నాను. ఆయన ముప్పదిమూడుకోట్లదేవతలతో కోటిసూర్యు లుదయించినట్లుగా వెలుగుచున్నాడు. ఇక చీకటి యెక్కడిది ? అని గోవిందభట్ట రనెను. ఇక నంతర్యామి నెట్లు తీసివేయనగు ననుకొని ఈయనను త్రిప్పుటకు శక్యముగాదు అని యతిరాజులు చెప్పిరి. ''యతిరాజా! నాకు చీకటిలేదు. గృహస్థాశ్రమిగ నున్నాను. ఇది తగదు. కాన సన్న్యాస మనుగ్రహింపుడని గోవిందభట్టరు పలుమా రడుగ నారంభించగా యతిరాజు లట్లే యిచ్చిరి. సన్న్యాసము పునర్జన్మముతో సమాన మగుటచేత యతి రాజులు తమపేరును అనగా 'మన్నాథ' లేక ''ఎంబెరుమానారు'' అని పెట్టిరి. తిరుకోట్టియ్యూరునంబివలెనే యతిరాజులు గోవింద భట్టరు విషయమున సంతోషించి ''యెంబెరుమానా'' రనిరి. ''యతిరాజా! మీపేరును భరించజాలను. వేరు పేరుపెట్టుడు'' అని గోవిందభట్ట రడుగగా పెట్టినది తీయుటకు కాదుగాని, ఆపేరు యొక్క మధ్యాక్షరము లెత్తివైచి ఆద్యంతాక్షరములగు ఎంబ్-ఆర్ అనువానినిజేర్చి 'ఎంబార్' అని పెట్టిరి. సాధారణముగ భోజనము లేకయో, భిక్ష మెత్తుటకో, ఎల్లవారును తనకు నమస్కరింప వలయు ననియో, భార్యతో జగడమాడియో సన్న్యాసము తీసికొందురు.

నకర్మణా మనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥

అను 4అధ్యా 4శ్లోకమున అట్టిసన్యాసి ఉభయభ్రష్టు డగుననియు-

కర్మేన్ద్రియాణి సంయమ్య య అస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే ॥

అను 3అధ్యా. 6వశ్లోకమున కర్మేంద్రియముల నణచి మనసులో విషయములను ధ్యానించువాడు మిథ్యాచారుడనియు చెప్పబడెను. గోవిందభట్టు రట్టి సన్న్యాసముగాక జ్ఞానభక్తి వైరాగ్యములను పూర్ణముగ పొంది తగిన అధికారియై సన్న్యాసము పొందెను. వీరికి సన్న్యాసము నిచ్చినవారు సామాన్యులు గారు. సాక్షాద్యతిసార్వభౌములు.

ఒకనాడు కొందరు శ్రీవైష్ణవులు శ్రీరంగమునకు వచ్చి ఎంబెరుమానారు మఠ మెచ్చటయని వీథిని పోవుచున్న వారి నడుగగా వారు ఏ యెంబెరుమానారు మఠమని ప్రశ్నించిరి. ఎంబెరుమానారని ఇద్దరు, ముగ్గు రున్నారా ? ఒక్కరినే మేము వింటిమి. ఏ యెంబెరుమానా రనగా రామానుజాచార్యులవారని ప్రసిద్ధి చెందిన ఎంబెరుమానారు నడిగితిమి అని వా రనిరి. అదిగో పొండి అని వీథివారు రామానుజుల మఠమును జూపిరి. పోయెదముగాని, ఏ యెంబెరుమానారని యంటిరే. ఆసంగతి యేమి ? అని వచ్చినవా రనిరి. పేరరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్ అని యొక రున్నా రని వీథివా రనిరి. అటులా ? ఆయన కాదు అని వచ్చినవారు వెళ్లిరి. ఆవిషయము ఆ పేరరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానారునకు తెలిసెను. "ఆహా! ఎంత అపచారము గలిగెను ? ఆత్మస్వరూప నాశనము జరుగునే. వచ్చినవారు సూటిగ ఎంబెరుమానారుల సన్నిధికి పోవుటకు లేకపోయెనే" అని చింతించి తమమఠమును పడగొట్టించి రామానుజుల మఠమునకు శీఘ్రముగ వచ్చి సేవించిరి. సంగతి యేమని యతిరాజు లడుగగా ఆయన

విషయముతెల్పి నరకయాతనల ననుభవించి ఎనుబదినాలుగులక్షల జాతులలో పుట్టి అందందు స్తన్యపానముచేసి జననమరణయాతన ననుపొంది తుదకు మనుష్యుడనై జన్మించితిని. జన్మము సార్థకము కావలదా ? సర్వేశ్వరుడు, నేను ఒక్కటే యనుమతమున పుట్టితిని. వాదమున నోడితిని. నాభాగ్యము! కృతకృత్యుడనైతిని. అధమయోనులనుండి క్రమముగా మనుష్యజన్మ మెత్తి తమ కటాక్షముచేత కృతార్థుడను కాగా మరల నాశన మగుటయా ? ఎంతటి గొప్ప యపరాధము జరిగినది. నేను తమప్రతినిధిగా నున్నాననికదా అర్థమగుచున్నది ? కాన నాకు ప్రత్యేకమంగ మఠము వలదు. నే నిందరు శిష్యులకు క్రింద అధమాధమ శిష్యుడనై కైంకర్యము సల్పుచుండెదను అని చెప్పగా యతిరాజులు సమ్మతించిరి. వా రచ్చటనే యుండిరి. పూర్వము యజ్ఞమూర్తిగా నుండిన పేరరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్ అనువారు అనేక వృక్షములలో కల్పవృక్షము శ్రేష్ఠమైనట్లు శ్రీవైష్ణవకోటిలో శ్రేష్ఠులై కైంకర్యము చేయుచుండిరి.

యామునాచార్యుల మనోరథమును ఈడేర్చినబాగుగనుంటు నని కూరత్తాళ్వారు మొదలగువారు యతిరాజులతో చెప్పిరి. బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయుటకు బోధాయనవృత్తి అను గ్రంథసాహాయ్యము కావలయునని యతిరాజులు తలంచిరి. వ్యాఖ్యానము నాకేల యని తలపరా దనియు, దానికై యేర్పడిన గ్రంథములను వెదకి విశేషములు గ్రహింప వలయుననియు రామానుజులు దారిచూపిరి. అది శారదాపీఠమున నున్నదని తెలిసి యతిరాజు లచ్చటికి పోయి అటనున్న సకలవిద్వాంసులను జయించిరి. సరస్వతీదేవి సంతోషించి స్వయముగవచ్చి పుస్తకము నిచ్చి వెళ్లెను. వారా పుస్తకమును తీసికొని కూరత్తాళ్వారుతోడ శ్రీరంగమునకు బయలుదేరి పోగా అచటివిద్వాంసు లోర్వలేక

పోయిరి. అట్టి అపూర్వగ్రంథమును తీసికొని పోయెనని విద్వాంసులకు కినుక హెచ్చెను. ఒకడు వచ్చి అందరిని జయించి వెళ్లెను. అతనికి మనకుతెలియని విషయము లెన్నో తెలియును; భగవదనుగ్రహమని యెంచక వానిని చంపుద మనుకొనిరి. వా రా రాత్రియే దొంగతనముగ వచ్చి పుస్తకము నపహరించుకొని పోయిరి. యతిరాజులు ఆపుస్తకము తెరువనే లేదు. శ్రీరంగమునకు వెళ్లి చూడవలయునని తలంచియుండిరి. ఇంతలో గ్రంథ చౌర్యము జరిగెను. ఏమిచేయ నగును? అసూయచేత వారు తీసికొనిపోయిరి. తీసికొనిపోయిన వారు మరల నిత్తురా? అది దొరకునా? దొరకుస్థలమున వా రుంచుదురా? యని కూరత్తాళ్వారుతో యతిరాజు లనిరి. "స్వామీ! మీరు నాయొద్ద పుస్తకము నిచ్చితిరిగదా! దానియం దేమియున్నదో యని చూచితిని. జ్ఞాపకమున్నది. వల్లించెదను. కటాక్షింపుడు" అని కూరత్తాళ్వారనిరి. ఇట్లనుట అపచార మగునని యెంచి- మీకటాక్షముచేత నాకు విషయమంతయు జ్ఞప్తిలో నున్న దనిరి. యతిరాజులు పరమానంద మొంది చెప్పుమనగా కూరత్తాళ్వారు ఆగ్రంథమంతయు కడవరకు ఒప్పజెప్పిరి. యతిరాజులు వినిరి. పిమ్మట గ్రంథము నారంభించిరి. యతిరాజులు చెప్పుచుండగా కూరత్తాళ్వారు వ్రాయుచుండిరి. నీవు వ్రాయునపుడు తప్పేమైన తోచినయెడల చెప్పుము. అట్లేవ్రాయకుమని యతిరాజు లనిరి. ఒకచోట రామానుజులు తప్పు చెప్పిరి. ఇచ్చట అర్థము పొసగలేదని కూరత్తాళ్వారనిరి. "ఏమిరా! కొన్ని సంగతులను గని నిన్ను మెచ్చుకొనగా గర్వపడెదవా? నేచెప్పునది చెప్పినట్లు వ్రాయుము" అని యతిరాజు లనగా నాకట్లు ఆజ్ఞలేదు. వ్రాయనని కూరత్తాళ్వారు పల్కిరి. అటులైన క్రిందపెట్టుము అని యతిరాజు లనగా కూరత్తాళ్వారు పొత్తము క్రిందపెట్టి వెళ్లిరి. అతడట్లు వెళ్లగనే రామానుజులు

పుస్తకము పరిశీలించగా తాను చెప్పినది తప్పుగనే యుండెను. పరబ్రహ్మమును తెలియు ననువాడు తెలియనివాడే. తెలియు ననువాడే తెలిసినవాడు. ఇది వేదవాక్యము. పరబ్రహ్మ మెక్కడ ? నే నెక్కడ ? నారదాదులకును అందలేదే అని తలంచవలెను. ఒకపండితుడు రాజసన్మానమును పొందగోరి భాగవతము జెప్పెద నని వచ్చెను. వినుట కిపుడు తీరికలేదు. నిదానింపు మని చెప్పి రాజు పండితునకు భోజనపుఖర్చుల నిచ్చుచుండెను. వినుడు, వినుడని పండితు డప్పుడప్పుడు రాజు నడుగుచుండెను. రాజు వినలేదు. రాజేమి అడుగునో అని పండితుడు భాగవతమును లెస్సగ చదువుచుండెను. ఆపండితుడట్లు చదివి, చదివి దీనియర్థము గ్రహించుటకు శుకునకే చెల్లును అని రాజుతో చెప్పెను. పండితుడు భాగవతముసంగతి నపుడే తెలిసెనని రాజు తలంచెను. రామానుజు లీసంగతిని దలచి కూరత్తాళ్వారును పిలిపించి ఆలింగనము చేసికొని మంచిమాటలాడి "ఇట్టి బుద్ధిమంతుని అధికప్రసంగి యంటినే అపచారను" అని తలంచి మరల వ్రాయుమనగా కూరత్తాళ్వారు వ్రాసిరి. వారట్లు ఒక్కనుతముచేతను కదలించుటకు శక్యముగాని భాష్యమును వ్రాసి ఆచంద్రార్కము చెడకుండునట్లు భూమండల మున నిలిపిరి. యామునుల మూ డభిప్రాయములలో ఒకటి నెరవేరెను అని వ్రాసియుంచు డనిరి.

ఇట్లు భాష్యమునువ్రాసి శ్రీరంగమున నుండునపుడు మరల సంచారముచేసి రావలయునని తోచి రామానుజులు రంగనాథుని యొద్దకేగి అనుమతి పొంది చోళపాండ్యదేశముల కరిగి దివ్యదేశ ములను సేవించి జయింపవలసినవారిని జయించి అన్యమతము లను ధ్వంసముగావించుచు వెడలునపుడు తిరుక్కురుంగుడి కరిగి ప్రవచనము సేయుచుండిరి. అపుడొక శ్రీవైష్ణవుడువచ్చి నమస్క రించి ఉపదేశింపు డనెను. యతిరాజులు వారిని సమీపమునకు

పిలిచి స్వహస్తముతో పుండ్రధారణముచేసి యుపదేశించిరి. ఆయనవెడలిన పిమ్మట యతిరాజులు భగవత్సన్నిధి కేగగా యీాయన పెట్టిన పుండ్రమే స్వామిముఖమున నుండెను. యతి రాజులు స్వామియే తమయొద్దకువచ్చి వెళ్లిరని తెలిసి శరణాగతిగద్య మును చేసిరి. ఇది వడగలవారి మతము. యతిరాజులు స్వామి సన్నిధికి పోగా స్వామి దిగివచ్చి ఆసన మిచ్చిరి. ఈయన భయ పడగా "వలదు; వలదు, నేను మత్స్యకూర్మాద్యవతారముల నెత్తు దును. దుష్టనిగ్రహ శిష్టపరిపాలనముల సేయుదును. నీవు వేదము నెట్లుత్రిప్పితివిరా ? నేనట్లు చేయలేదుగదా" అనిరి. "స్వామీ! నీపేరు చెప్పి, అష్టాక్షరీమంత్రముచేత నేనట్లు చేసితినని యతిరాజు లనగా "ఎల్లవారికిని మంత్రము నుపదేశించినట్లే అనగా శిష్యుడై వచ్చినవాని కెట్లుపదేశింతువో అట్లే నాకును చెప్పుము" అని స్వామి యడిగెను. స్వామి ఆసనమున గూర్చుండబెట్టగా యతిరాజులు యామునులను స్మరించి వారు కూర్చుండినట్లు తలంచి మంత్రము నుపదేశించిరి. వైష్ణవనంబి అని స్వామికి పేరుపెట్టిరి. యతిరాజుల నపుడు బ్రహ్మరథమున గూర్చుండబెట్టి ఊరేగించిరి. ఇది తెంగలవారి మతము.

అటుపిమ్మట యతిరాజు లనేక దివ్యదేశములకు పోయి అనేకకార్యములు సల్పుచు నరుగునపుడు మరల సరస్వతీపీఠము నకు పోయి శారదాలయమున ప్రవచనము చేయుచుండగా సరస్వతీదేవి విగ్రహమునుండి వెడలి సన్నిధి తలుపులు తెరచుకొని వచ్చి "యతిరాజా! కప్యాసం పుండరీక" మను వేదవాక్యము నకు అర్థము చెప్పుమని అడిగెను. యతిరాజులు అద్భుతముగా నర్థము జెప్పిరి. సరస్వతీదేవి ఆయర్థము విని "నాయనా! ఒక వాక్యమున కిట్లు దివ్యముగ అర్థము జెప్పితివే. వేదమున కంతయు నిట్లే చెప్పిన బాగుగనుండును" అనెను. అట్లే చేసితి నని

యతిరాజు లనగా సరస్వతి దానిని తెమ్మనెను. యతిరాజులు తామువ్రాసిన భాష్యము నీయగా సరస్వతి దానిని శిరమున నుంచుకొని "ఇది శ్రీభాష్యము. నీవు శ్రీభాష్యకారుడవు అని శ్రీతోడచెప్పవలయును" అని అనుగ్రహించెను. ఒక హయగ్రీవ విగ్రహము నిచ్చి దాని నారాధింపు మనెను. వా రదిమొదలు ఆవిగ్రహము నారాధించుచుండిరి. పిమ్మట వా రాస్థలము విడిచి పోగానే అచ్చటి విద్వాంసులు యతిరాజులకు కనులు, కాళ్లు పోవలయుననియు, బుద్ధిచెడి పిచ్చిపట్టవలయుననియు అభిచారిక హోమము చేసిరి. కృత్తి అనునది చేష్టలుచేయుచు యతిరాజుల యొద్దకు రాగా వా రాసంగతి తెలిసి మంత్రరత్న, తిరుమంత్రము లను జపించిరి. శ్రీకృష్ణమూర్తి ద్వారకలో నుండగా కాశీరాజు అట్లే హోమము చేసి పంపెను. అపుడు కృష్ణమూర్తి సొగటా లాడుచుండి లేవకయే చక్రమునంపగా వచ్చినది పారిపోయి తన్నంపిన కాశీరాజునే చంపెను. యతిరాజులును ఇట్లే వచ్చినదానిని త్రిప్పి పంపిరి. కాని ప్రయోగించినవారిని చంపవల దనిరి. సరస్వతీపీఠ మండలి విద్వాంసుల కందరికి పిచ్చిపట్టెను. వారు తినరానిది తినుచు, వచింపరానిది వచించుచు, ధరించిన వస్త్రములను చింపి కొని వస్త్రహీనులై తిరుగుచుండిరి. వీరెల్లరు రాజవిద్వాంసు లగుటచేత రాజునకు చింత గలిగెను. పిమ్మట నారాజు యతి రాజుల పాదములపైబడి ప్రార్థించగా అసూయలేని వా రగుటచేత ఆమహానుభావుడు– "రాజా! వారు ముందటివలె నుందురు" అని చెప్పిరి. విద్వాంసు లందరు పిచ్చి తొలగగా మంచివస్త్రములు ధరించి ఉల్లాసముతో రాజదర్శనము చేసిరి.

యతిరాజు లారాజుచేత పూజితుడై కాశీక్షేత్రమున కరిగి గంగాస్నాన మాచరించి అచటివారి ననుగ్రహించి జగన్నాథమున నకు పోయిరి. ఆ పురుషోత్తమక్షేత్రములోనిపూజ పొంచ

రాత్రిగనువిధానమునకు తగినదిగా లేకుండుటను జూచి యతి రాజులు అచ్చటి యర్చకులను బిలిచి మీపూజావిధానము సరిగా లేదు. నేనుచెప్పినరీతిగా చేయుడు అని చెప్పిరి. పరంపరగ వచ్చుచున్న మార్గమునువీడి మరియొకవిధముగ జేయుట వారికి తెలియలేదు. శ్రీరంగమునుండి అర్చకులను బిలిపించెద మని యతిరాజు లనగా ఆ అర్చకులలో నొకడు జగన్నాథునిసన్నిధిలో ప్రాయోపవేశము చేసి "స్వామీ! మాగతి యెట్లుచేసెదవో, మేము చేయుచున్న పూజను నీవు సమ్మతించి యున్నావు. రామానుజు లను ఇచటనుండి ముందు పంపెదవా ? లేదా ? లేకున్న మేమంద రము నాలుకలు పెఱికికొని చనిపోయెద" మని మొరపెట్టుకొనెను. నన్ను పూజించువారలు బ్రహ్మదులు. నా కీ పూజయా కావలెను? అని స్వామి తలంచి రేపటినుండి స్వామిని సరిగా ఆరాధింపవలె నని నిశ్చయించియుండిన యతిరాజులకు స్వప్నమున ప్రత్య క్షమై "వారేమో అనాదిగ పూజించుచున్నారు. నీవు వారి వృత్తిని చెఱపకుము" అని చెప్పిరి. రామానుజులు స్వామి అభిప్రాయ మును వినలేదు. ఈపూజావిధానమును నేను గమనించినట్లు మరొక రును గమనింతురు. కాబట్టి ఈవిధమును మార్చి తీఱవలయునని తలంచిరి. ఆయూరిరాజును, జనులను సరిపరచి అందరిని అంగీక రింపజేసి శ్రీరంగమునకు లేఖ వ్రాసిరి. "స్వామియగు నేను చెప్పి నను వినలేదు. వీని నీయూర నుంచరాదు" అని జగన్నాథుడు తలంచెను. పూజ సరిగానున్నను, లేకున్నను భక్తియున్నచో స్వామి ప్రీతుడగును. శ్రీరంగమునకు సమీపమున నరసింహ స్వామి సన్నిధి యున్నది. అచ్చటి యర్చకుడు అపండితుడు. "వాసుదేవోఽమరప్రభుః" అను చోట విభాగించి నామములుచెప్పి పూజించునపుడు 'వాసుదేవాయ నమః, మరప్రభవే నమః' అను చుండెను. అది 'మరప్రభు' శబ్దముగాదు. 'అమరప్రభు' శబ్ద

మని అతనికి తెలియలేదు. దీనిని మరియొక అసూయాపరుడైన విద్వాంసుడు చూచి రాజునకు తెలుపగా రాజతనిని తోసివేసెను. అతడు కుటుంబి; భక్తిగలవాడు. బుద్ధిపూర్వకముగ చేయలేదు. స్వామిని వేడగా స్వామి ప్రసన్నుడాయెను. చరాచరప్రపంచమునకు నేను ప్రభువగుచుండగా నురవులకు (చెట్లకు) కానా ? అట్లే చెప్పవలయును. అతడు భక్తిమంతుడు అని రాజునకు కలలో చెప్పెను. రాజు ముందు వానిని తోసి యితనినే యుంచెను. ఇది నిజముగ జరిగినసంగతి. కాన జగన్నాథుడు అర్చకుల పూజ నంగీకరించిరి. యతిరాజులను పొమ్మనిన పోడని తలచి పరుండియుండగా తనయోగమాయచేత తెల్లవారునప్పటికి శిష్యులతో వారిని శ్రీకూర్మమునకు చేర్చిరి.

శ్రీకూర్మములో స్వామి కొండలో రాతిరూపమున నున్నారు. యతిరాజులు సన్నిధికి పోయిరి. ఆస్వామికి శివలింగమని పేరు. విష్ణువులేనిచోట భుజింపరాదని యతిరాజులు ఉపవాసము చేయుగా స్వామి స్వప్నమున వచ్చి "యతిరాజా! నిరాహారివైయుండవలదు. ఈ యూరివారు నన్నీవిధముగ శివలింగము చేసిరి. నేను శంఖచక్రగదాదులతో నున్నాను. గమనింపుము. తెలియగలదు. నీవు స్నానముచేసి, నన్నును స్నానముచేయించి ఊర్ధ్వపుండ్రములనుంచి వైష్ణవస్వామి నొనర్పుము" అని చెప్పిరి. యతిరాజులు భగవదాజ్ఞానుసారము అట్లుచేయగా అప్పటినుండియు ఆక్షేత్రము విష్ణుక్షేత్ర మాయెను. అన్నిగ్రంథములందు యతిరాజులు శ్రీకూర్మమున కరిగి సేవించిరనిమాత్ర ముండును. విశేషముగనుండు గ్రంథములందు మాత్రము పదిశ్లోకములు శ్రీకూర్మమున జరిగిన సంగతి విస్తారముగ వ్రాసినవి.

రామానుజు లట్లు దివ్యదేశములు సేవించుచు మరల వేంకటాచలమునకు వచ్చిరి. అచట స్వామి సుబ్రహ్మణ్యుడనియు,

విష్ణువనియు వివాదము జరుగుచుండెను. ఉండనిండు. శివస్థల మనుచుండుటచేత శివుని ఆయుధములును, విష్ణు వనుటచేత విష్ణు దేవుని ఆయుధములును రాత్రి తలుపులు వేయునపుడు సన్నిధిలో నుంచవలయును. తెల్లవారినపిమ్మట తలుపులు తెఱవవలెను. ఏయాయుధములు చేతనుండిన ఆస్వామియని నిర్ధారించుదము అని యతిరాజులు వారిని సమాధానపరచిరి. ఇరుపక్షములవారును సమ్మతించి యతిరాజులు చెప్పినట్లు చేసి భటులను కావలిపెట్టిరి. వీరొకబీగము, వారొకబీగము వేసికొని తమచేశ నుంచుకొనిరి. "ఓస్వామీ! నీకేదియిష్టమున్న దానిని ధరింపుమని యతిరాజు లారాత్రి నిష్కళముగ వరుండిరి. స్వామీ! చక్రమునుధరింపుమని ఇతరవైష్ణవులును, శూలము దాల్పుమని శైవులును స్తోత్రములు చేసిరి. "ఈశ్వరా! యతిరాజులుచెప్పిన యుక్తి బాగుగ నున్నది. ఈశ్వరు డేరూపము జూపిన నారూపువాడే యని తెలియవలయు ననిరి. కటాక్షింపుమని ప్రార్థించుచుండిరి. తెల్లవారిన పిమ్మట సన్నిధితలుపులు తెఱవగా స్వామి శంఖచక్రములు ధరించి యుండెను. పునఃవ్యవహార మున్నదా ? న్యాయాధిపతి తీర్పు చెప్పగా ప్రతివాదులు పోకుండ నిలుతురా ? వారిని వేరుగ పొమ్మనవలయునా ? శంఖచక్రములను జూచి శైవులెల్లరు ఉండుచోటు తెలియక పోయిరి. స్వామి యతిరాజులకు ప్రియము చేయ శంఖచక్రములు దాల్చి దర్శన మిచ్చెననియు, తన్ను దాసు విష్ణువని స్థాపించుకొనె ననియు కొన్నిగ్రంథములు; వైష్ణవు లును, శైవులును అల్లాడుచున్నారు, స్వామి మంచివాడు, ఏమి చేయునో ? అబ్బా! అయ్యో! అనిన మోసపోవును. లేక యేమి యును చేయకుండిన నెట్లు అని యతిరాజులు తలంచి తననిజ స్వరూపమెత్తి అనగా ఆదిశేషుడై పర్వతగుహలో ప్రవేశించి శంఖచక్రము లెత్తి ధరింపజేసి పోయిరని కొన్ని గ్రంథములు.

యతిరాజులు స్వామికి శంఖచక్రము లిచ్చి "నీవు విష్ణు" వనగా "నీవు గురుడ"వని స్వామి యనెను. యతిరాజులు స్వామికి వక్షఃస్థలమున లక్ష్మి నుంచిరి. భార్య నిచ్చినందున వారు స్వామికి మామగా రగుచున్నారు. తిరువేంగడముడయాను యతిరాజుల శిష్యు డాయెను. యతిరాజు లిట్లు తిరువేంగడముడయానును విష్ణుని గావించి భూప్రదక్షిణము చేసికొని శ్రీరంగముచేరి రంగనాథుని సేవించి తమమఠమున ప్రవేశించిరి.

కూరమనుగ్రామము కాంచీపురికి సమీపమున నున్నది. అచ్చటనుండువారు కూరత్తాళ్వారు. వారు తమయూరికిపోయి అన్నదానము చేయుచుండిరి. రాత్రి పండ్రెండు గంటలవరకు అన్నదానముచేసి అటుపిమ్మట మఠముతలుపులు మూసిరి. ఆశబ్దమును పెరుందేవితాయారు విని అదేమని వరదరాజస్వామి నడుగగా ఆయనసంగతిచెప్పెను. అట్టిఅన్నప్రదాతనుచూడగోరెదననితాయారడిగెను. స్వామి తిరుక్కచ్చినంబిని పిలిచి పెరుందేవి చూడగోరుచున్నదిగాన కూరాత్తాళ్వారును పిలుచుకొనిర మ్మనెను. తిరుక్కచ్చినంబి కూరత్తాళ్వారున కీసంగతి చెప్పి రమ్మని పిలువగా "నే నధముడను. నన్ను చూడగోరిరా ? వారి కడకు వెళ్లి దూరమున నుండియే వారిని నే సేవించెదను. నే నెట్టిపదార్థమును ? తాము పెద్దలు. వచ్చి పిలుచుచున్నారు. ఐనను రాను" అని వారనిరి. "మిక్కిలి భక్తిమంతుడు; వేదవేద్యుడైన స్వామిని చూచుటకు సిగ్గుపడుచున్నాడు" అని తిరుక్కచ్చినంబి తెలుపగా పెరుందేవి తాయారు సంతోషించెను. కూరత్తాళ్వారుకు వైరాగ్యము కలిగి తన సర్వస్వమును దాన మొసగి భార్యయగు ఆండాళమ్మను పిలుచుకొని శ్రీరంగమునకు బయలుదేఱెను. భర్త శరీరము గాపాడుట భార్య విధియగుటచే ఆండాళమ్మ ఒకనవరత్నఖచితమైన స్వర్ణపాత్రను తీసికొని ఇదిదాహము తీసికొనుటకు ఉపయోగించును

లేక ఆపత్సమయమున విక్రయమున కుండును అని తలంచెను. ఆమె యట్లు తలచి పాత్రనెత్తుకొని పోవుచుండగా భయముగ నుండెను. మార్గమున దొంగలభయమా అని ఆమె పలుమారు భర్త నడుగ నాకేమియు తోచుటలేదు, నీదగ్గర నేదైన నున్నదా యని వారనిరి. పతివ్రత యగుటచేత ఆమె నిజము చెప్పెను. దానిని నిటుతెమ్మని కూరత్తాళ్వా రడుగగా భర్త పాత్రను పదిల పరచుట కడుగుచున్నాడని భావించి ఆమె యిచ్చెను. కూరత్తాళ్వారు దానిని పారవేసి ఇక భయములేదని భార్యతో జెప్పి శ్రీరంగము జేరిరి. ధనముండువరకు మద ముండును. అది పోగా మద మెక్కడిది ? ఆమెతెచ్చిన యాపాత్ర యుండినను దానిని విక్రయించి భుజించవచ్చును. అదియును పోయెను. కాన కూరత్తాళ్వారు ఉంఛవృత్తిచేసికొని గురువగు యతిరాజులకు కైంకర్యము సల్పుచుండిరి. ఇట్లు జరుగుచుండగా నొకనాడు విశేషముగ వర్షము వచ్చెను. అందుచే కూరత్తాళ్వారు ఉంఛవృత్తికి పోలేదు. పస్తుండిరి. రాత్రివేళ ఆకలిచే అటునిటు పొరలుచుండిరి. ఇంతటిసాధువగు వీరు నిరాహారులై యున్నారే యని కూరత్తాళ్వారుభార్య చింతించెను. ఆనాటిరాత్రి రంగనాథునకు ప్రసాద రాజ మనబడు అక్కారవడిసె (అనగా చక్కెరపొంగలి) ఆరగింపు అగుచుండెను. "రంగనాథా! నీభక్తుడు పస్తు పరుండియుండగా నీ వారగించుచున్నావా" అని ఆండాళమ్మ అనుకొనెను. మేళతాళములతోడ ప్రసాదమును తీసికొనిపోయి కూరత్తాళ్వారున కొసగుడని రంగనాథుడు ఉత్తమసంబి అను వారికి స్వప్నమున దర్శనమిచ్చి ఆజ్ఞాపించగా ఆ నంబి భగవదాజ్ఞానుసారము వెళ్లి కూరత్తాళ్వారునకు ప్రసాదమిచ్చిరి. వారు సంగతి యేమని యడుగగా భగవత్సంకల్ప మని నంబి యనిరి. స్వామి యుత్తరు వాయెనా ? రంగనాథుని అవ్యాజకృప! మీకు శ్రమ గల్గినది అని వారా

ప్రసాదమును గైకొని భుజించి భార్యకు నిచ్చిరి. వారికి సంతోషము అక్కారవడిసె లభించెనని గాదు.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

అను భగవద్గీత 9అధ్యా. 22శ్లోకమట్లు భక్తుల యోగక్షేమ చింత వారిదిగదా! నేను నేడు పస్తుండిన నేమి? అందులకై అధికారినిలేపి ప్రసాదమును పంపిరే. నేనింతటి కృపకు పాత్రుడనా అని సంతోషించిరి. నీ వేమైన చెప్పి పంపితివా అని కూరత్తాళ్వారు భార్య నడుగగా లేదు, మీకు చెప్పకుండ అట్లు చేయుదునా? నామనసున నిట్లు తలంచితి నని ఆమె చెప్పెను. "ఎందుకు స్వామికింత శ్రమ యిచ్చితివి? ఒకనా డుపవాస ముండిన నేమి?" అని కూరత్తాళ్వారు భార్యను కోపించిరి. "స్వామీ! నేను పతివ్రతను గాన అట్లనుకొంటిని. నీ వింత చేయవలయునా" అని ఆమె తనలో తలంచెను. పిమ్మట వారు నిద్రించిరి. "మీరు ఆహారము లేకుండ ఉండి నాప్రసాదము స్వీకరింపవలయునని యెంచియే మీకు ఆటంకము గలిగించితిని. ఉపవాసముండి యీప్రసాదము స్వీకరించుటవలన లాభ మేమనగా పాయసమును స్వీకరించి దశరథుని భార్యలు నలుగురు పుత్రులను బడసినట్లు మీ రిరువురు పుత్రరత్నములను బడయుగలరు" అని రంగనాథుడు స్వప్నమున చెప్పెను. కూరత్తాళ్వారు భార్యను లేపి "నిన్ను కోపించితిని గదా! ఇపుడు స్వామి చెప్పగా విషయము తెలిసెను. స్వామి సంకల్పమువల్లనే అట్లు జరిగెనట! అక్కారవడిసెయొక్క ప్రభావముచేత మన కిరువురు పుత్రరత్నములు కలుగుదురట" అని చెప్పిరి. భార్యాభర్త లిరువురు సంతోషించిరి. ఆండాళమ్మ గర్భము దాల్చెను. కలియుగపు 4163 సంవత్సరము గడచిన నాలవసంవత్సరములో శాలివాహన శతాబ్దము 9083పోనా 84వ

సంవత్సరములో శుభకృత్ వైశాఖపూర్ణిమాతిథి అనూరాధయందు లవకుశులవలె పరాశరమహర్షి యంశమునను, వేదవ్యాసమహర్షి యంశమునను ఇరువురు పుత్రులు గల్గిరి. యతిరాజులకు వారి జననము తెలిసి పరమానందభరితులై అంతరంగశిష్యుడైన ఎంబారు తోడ వచ్చి బిడ్డలను తెమ్మని చెప్పగా ఎంబారు ద్వయమంత్రము ననుసంధించుచు బిడ్డలను తెచ్చి యిచ్చిరి. అదేమి ? ద్వయవాసన కొట్టుచున్నది ? ఏమిచేసితివని యతిరాజు లనగా బిడ్డలను దెచ్చుచు ద్వయమంత్రానుసంధానము చేసితి నని వారనిరి. మీ తిరువాక్కుతో నామకరణము చేయుడని వారు కోరగా "శ్రీపరా శరుని పేరుగ పెద్దబిడ్డకు శ్రీపరాశరభట్టరనియు, వ్యాసుని పేరుగ వ్యాసభట్టరనియు, శ్రీరామభట్టరు లేక శ్రీరామదేశికన్ అని చిన్న బిడ్డకును పేరు లుంచిరి. చూచినవారు ఏమియందమని పొగడున ట్లుండుటచేత రాముడని పేరుంచిరి. యామునుల రెండవ అభిప్రాయము నెరవేరెనని వ్రాసి యుంచుమనిరి. గోవింద భట్టరగు ఎంబారుకు తమ్ముడు బాలగోవిందన్ లేక శిరియగోవింద ప్పెరుమాళ్ అనువారు. ఆయన కొక కుమారుడు గల్గెను. యతి రాజు లాబిడ్డకు పరాంకుశనంబియని నమ్మాళ్వారుల పేరుంచి యామునుల మూడవయభిప్రాయము నెరవేర్చిరి. ఇట్లు ప్రసన్నా మృతము తెంగలగురుపరంపరలో నున్నది.

యతిరాజులు శ్రీరంగములో మఠమున తిరువాయిమొళి యర్థమును ఆలోచించుచు ఏమి యానంద మనుకొనుచు తిరుగు చుండగా పుళ్ళాన్ వారిసమీపమునకు వచ్చి ఈపాశురార్థము నిట్లు అనుసంధించుచున్నారా అని యడిగెను. పాశురమును, దాని యర్థ మును జెప్పెను. యతిరాజులు యోచించుచుండినదియు పుళ్ళాన్ చెప్పినదియు ఒకటిగనే యుండినందున వారు "ఓరీ ! తలుపు మూసికొనిరమ్ము, నీ కెట్లు తెలిసెరా ?" అనిరి. మీయనుగ్రహమని

పిళ్లాన్ చెప్పెను. "కాదు; నాథమునిసంబంధముచేత కలిగెను. నాథమునిశిష్యులు ఉయ్యకొండార్లు. వారికి మణక్కాల్‌నంబి (శ్రీరామమిశ్రులు), వారికి తిరుమలనంబి శిష్యులు. నీవుతిరుమల నంబి పుత్రుడవు. విద్యావంశమున జేరినవాడవు. నీవు నాపుత్రుడవు. సన్యాసికి పుత్రుడుండునా అనిన జ్ఞానపుత్రుడవు. నమ్మాళ్వారి నాభికమలముక్రిందనుండు అర్థములు నీకు నాథముని అనుగ్రహముచేత తెలిసెను. నమ్మాళ్వారి తిరువాయ్‌మొళికి ఆరాయిరప్పడి వ్రాయుము. శ్రీభాష్యమున కెంత గౌరవమో దానికి అంత గౌరవముండును. శ్రీభాష్యమున కేది మంగళాచరణమో అదియే దీనికిని అగును" అని యతిరాజు లనిరి. వారు భాష్యమును వ్రాయగా చూచి ఆనందించి తిరుక్కురుగుప్పైపిరాన్ అని నమ్మాళ్వారి పేరు పెట్టిరి. ఇది వడగలవారి మతము. అటు పిమ్మట యామునాచార్యులవారి మూడవ యభిప్రాయము పూర్తి యాయె నని వ్రాసియుంచు మనిరి.

కూరత్తాళ్వారు కుమారులలో నొకరికి పరాశరభట్టరని పేరుంచిరికదా! ఆబిడ్డ వృద్ధికి వచ్చునని రంగనాథు డతనిని పుత్రునిగా స్వీకరించెను. శ్రీరంగనాథుని గర్భగృహములో నుండు స్తంభములకు నవరత్న ఖచితమైన బంగారు ఉయ్యాల కట్టి అందా బిడ్డనుంచిరి. ఆబిడ్డకు పరమశైశవమున పాలుపోయుచుండిరి. పిమ్మట రంగనాథునికి అరగింపు కాగానే షడ్రసోపేతాన్నమును పెట్టుచుండిరి. బిడ్డకు నడువశక్తి రాగానే స్వామికి అరగింపు అగుటకు ముందే ప్రసాదమున చేయినుంచి యెత్తుకొని భుజించెను. అర్చకులాప్రసాదమును స్వామికి అరగింపు చేయలేదు. ఇట్లు రెండుదినములు జరుగగా వారు అరగింపుసమయమున బిడ్డ నావలకు బంపిరి. అక్కారవడిసె యను నాప్రసాదమును స్వీకరించలేదని రంగనాథుడు రాజుస్వప్నమున చెప్పగా, రేపటినుండి

బిడ్డ ముందు భుజించవలయును. పిమ్మట స్వామికి నివేదనము కావలయును అని యారాజు ఏర్పాటు చేసెను. భట్టరు యొక్క మాహాత్మ్యములో నిది యొకటి. యతిరాజు లొకనాడు ఒక శ్లోకమును వ్రాసికొని సన్నిధికి వచ్చి బిడ్డచేతి కీయగా ఆబిడ్డ దానిని చదివెను. యతిరాజు ఎల్లవారిని పిలిచి ఆసంగతి తెలిపి ఇతడు పురోభివృద్ధికి రాబోవుచున్నాడని చెప్పిరి. ఒకనాడు కూరత్తాళ్వారు కాలక్షేపము చెప్పుచుండగా "అణోరణీయాన్ మహతో మహీయాన్" అనగా స్వామి అణువుకు అణువై, మహత్తుకు మహత్తై యున్నాడను సంగతి వచ్చెను. ఇదేమి పరస్పరవిరుద్ధముగ నున్నదని బిడ్డ యడిగెను. కూరత్తాళ్వారు రంగనాథుని కృప యని తలంచి "బిడ్డా: నీకు ఉపనయనము కాలేదు. ఈ సంగతులను వినకుము; చెప్పకుము" అనెను. "చెప్పను గాని, అదెట్లు సంభవము ?" అని భట్టరడిగెను. శిరియాచ్చాన్ పేరరుళాళప్పెరుమాళెంబెరుమానారు శరీరతః అణుత్వమును, జ్ఞానతః మహత్వమును కలిగియుండగా స్వామికి అణుత్వమహత్వము లుండవా ? ఇక అడుగకు మని కూరత్తాళ్వారనిరి. ఒకనాడు సర్వజ్ఞభట్టరను విద్వాంసుడు జయభేరితో వచ్చెను. భట్టరు వీథిలో ఆడుకొనుచుండి "ఓయీ! నిలువుము" అని పల్లకిని నిలిపి పట్టుకొని "సర్వజ్ఞ భట్టరనుమన్నావే ? నీకు అన్నియును తెలియునా" ? యనెను. ఔనని అత డనెను. భట్టరు క్రిందనుండిన ఇసుకను పిడికెడెత్తుకొని ఇందెంత ? అని యడుగగా అతడు యోచించుచుండెను. "ఓరీ! నీకు సర్వజ్ఞభట్టరను పే రెవరెచ్చిరి ?" అని బాలుడడిగెను. "బిడ్డా! యెంతయున్నదో నీవే చెప్పు" మని సర్వజ్ఞభట్టరు అడుగగా "ఒకపిడికెడు ఉన్నదనరాదా ? దీనికి యుక్తి తెలియలేదా ?" అని భట్టరనెను. సర్వజ్ఞభట్టరు మిగుల ఆనందించి "సర్వజ్ఞభట్టరు నేనుకాను; నీవేను" అని మెచ్చుకొని ఈబిడ్డ బుద్ధిశాలి; యుక్తిశాలి

అని తలచి యెత్తుకొని ముద్దుపెట్టుకొని పల్లకిలో కూర్చుండబెట్టుకొని వారింటికి పిలుచుకొనిపోయి విడచిపెట్టి "ఇతడు సర్వజ్ఞుడు. కనుకనే ఒకపిడికెడుమన్నుతో నన్ను ఓడించెను. ఈతని బైట విడువకుడు, దృష్టిదోషము తగులును" అని కూరత్తాళ్వారుతో చెప్పి ప్రశంసించి ఆశీర్వదించి బిడ్డయే ఇట్లు చేసెనే అని యాయూరు విడచి వెళ్లిపోయెను. భట్టరుకు ఉపనయనమైన పిదప వేదాధ్యయనమునకై గురునొద్దకు బంపిరి. ఆయన రెండవ దినము అధ్యయనమునకు పోయి వెంటనే మరల వచ్చెను. ఏమిరా, వచ్చితి వని కూరత్తాళ్వా రడుగగా నిన్నటిదే చెప్పుచున్నా రనెను. "నీకు నిన్న చెప్పినది వచ్చినదా? అటులైన చెప్పుము" అని వా రనగా భట్టరు చెప్పెను. కూరత్తాళ్వారు ఆశ్చర్యపడిరి. భట్టరిట్లు వేదశాస్త్రములు నేర్చిరి. ఈ పరాశరభట్టరు విష్ణుసహస్రనామ భాష్యము చేసిరి. స్వామి సహస్రనామములలో ఒక్కొక్క నామమునకు అనేక అర్థములు చేసిరి. భట్టరు పెద్దవారైన పిమ్మట భక్తిచేత స్వామివిషయమున మర్యాదగా నుండిరి. ఒకనాడు తెరకుమరుగున నుండగా మమ్ము చూడ నేమని తోచుచున్నదని స్వామి అడిగెను. మహాలక్ష్మీనారాయణులని తోచుచున్నదని భట్ట రనెను. అట్లనకుము. తల్లిదండ్రు లనుము. లేకున్న అందరితో సమానుల మగుదుమే. మేము స్వీకరించిన దెందుకు? అని రంగ నాథు డనెను. ఇట్లని ఒకగ్రంథమున నున్నది. భట్టరుకు యౌవ నము రాగా పేదవాడగు కూరత్తాళ్వారు మహాపూర్ణులవంశజులను మాచిన్నవానికి మీకన్య నిచ్చెదరా యని యడిగెను. కూరత్తాళ్వారు స్వామియొక్కయు, రామానుజులయొక్కయు కటాక్షమునకు పాత్రుడు, కాని దరిద్రుడు అను రెండుకారణములను తలచి వారు ఎట్లు పోవుటకును లేక యిచ్చెదము, ఈయము అని తెగ చెప్పక యోచించుచుండిరి. కూరత్తాళ్వారు చింతతో పరుండగా

రంగనాథుడు స్వప్నమున ప్రత్యక్షమై "నీబిడ్డకు నీవా కర్తవు ? నేనున్నాను. నీవా పెండ్లిచేయబోవుచున్నావు ? నీవు సుఖముగ పరుండుము" అని చెప్పెను. "స్వామి చెప్పెను సరి" యని కూరత్తాళ్వారు నిశ్చింతగా నిదురించెను. కూరత్తాళ్వారు కన్య నడుగగా యోచించినవారి స్వప్నమున స్వామి ప్రత్యక్షమై భట్టరు కూరత్తాళ్వారు బిడ్డకాదు; నాబిడ్డ. వానికి మీకన్య నిచ్చెదరా ? యని యడుగగా 'యిచ్చెద మిచ్చెద' మనిరి. మరునాడే వివాహము జరిగెను. పునఃప్రవచనము జరుగుచుండెను.

యతిరాజులు సన్యాసికదా! సన్యాసులు సకల బంధువులను విడువవలసియుండగా వారు తమ మేనల్లుడైన మొదలియాండానును మాత్రము వదలలేదు. ఈయనను తప్ప తక్కినవారిని విడిచితి ననిరి. అట్లు చేయవచ్చునా యని శిష్యు లడిగిరి. తిరుక్కొట్యూరునంబి తిరుమంత్రోపదేశము సేయుటకై పిలచినపుడు దండపవిత్రములతోడ రమ్మనిరి. ఇతరు లుండరా దనిరి. నేను, కూరత్తాళ్వారు, మొదలియాండానులతోడ పోగా చూచి 'యిదే' మనిరి. మీరుచెప్పినట్లే వచ్చితిని. వీరు నాకు దండపవిత్రములు అని చెప్పితిని. అందు కాయన సమ్మతించెను. సన్యాసమును గైకొన్నతోడనే దండమును విడుతురా ? మొదలియాండాను నాకు దండస్థానీయుడు. కాన వానిని వదలుటకు లేదని యతిరాజు బదులు చెప్పిరి. వారట్టిశిష్యుల నుంచుకొని శ్రీరంగమున డెబ్బదినాల్గు సింహాసనాధిపతులతోడ నుండిరి.

శ్రీరంగసమీపమున ఒరయూరు ఉన్నది. అచట చాణూరుని వలె నొక మల్లుడు ధనుర్దాసుడు లేక విల్లిదాసుడు అనువాడుండెను. హేమాంబ లేక హెన్నాచ్చి యను నొకస్త్రీ వానికి అభిమానపాత్రిగా నుండెను. వాడు దానియందు మిగుల అనురాగము కలిగియుండెను. సర్వదా దాని ముఖావలోకనము సేయుచుండెను.

శ్రీరంగమున ఉత్సవము రాగా హేమాంబ సేవింపవలయునని బయలుదేరెను. విల్లిదాసుడు రంగనాథుని సేవింపగోరకున్నను హేమాంబను చూచుచుండుటకై బయలుదేరెను. విల్లిదాసుడు హేమాంబకు అభిముఖముగ నిలిచి వెనుకకు నడచుచుండెను. కొందరు శ్రీవైష్ణవు లాసంగతి యతిరాజులతో చెప్పిరి. అంత లయించి యున్నాడుకదా వానినిత్రిప్పెదను, చూచెదరా! యని యతిరాజు లనగా వీలుకాదని వైష్ణవు లనిరి. వానిని పిలువుడని రామానుజు లనగా వైష్ణవులు వానిని పిలచిరి. నేను అధముడను; నన్ను పిలిచిరి. రా ననరాదని విల్లిదాసుడు పోయెను. "ఓరీ! లోకమున నెందరో కామాతురు లుందురు. రహస్యముగ శుశ్రూష చేయుదురు గాని ఇట్టి మోహముండునా? యని యతిరాజు లనగా నేను కామాతురుడను గాను. బ్రహ్మసృష్టిలో దానికున్నట్టి యందమైన కన్నులుండవు. ఆయందమునే చూచుచున్నాను" అని విల్లిదాసు డనెను. అంతకంటెను అందముగల కనులను జూపినట్లైన దానిని జూచుట మానెదవా? యని యతిరాజు లడుగగా అట్లే చేసెదనని వా డనెను. పిమ్మట యతిరాజులు వాని చేయిపట్టుకొనిపోయి రఘువంశభాగ్యమైన రంగనాథుని జూపి ఆకర్ణాంతవిశాలములై కృపారసముతో గూడిన స్వామి లోచనములను చూపి వీనినే చూచుచుండుమని చెప్పి మనసును త్రిప్పగా, అత డా కనులను మరచెను. వేశ్యాలోచనలోలుడయిన విల్లిదాసునికి కరుణాసముద్రులైన యతిరాజులు రంగనాథుని కనులుచూపి అందు మనసు తగులునట్లు చేసి వేశ్యకనులను మరచునట్లు చేయగా ఈనేత్రములతో సమానములైన నేత్రములు లేవని వా డనెను. "ఓరీ! ఈలోచనములను చూచుచుండి నీకు తృప్తియైనపుడు మఠమునకు రమ్ము" అని యతిరాజులు వానితో చెప్పి వాడు కడతేరెనని సంతోషముతో మఠమునకు పోయిరి. విల్లిదాసుడు

స్వామిని సేవించుచుండి ఇట్టి కనులను చూపినవారిని ఆశ్రయింప వలయునని తలచి మఠమునకు వచ్చి నిత్యకైంకర్యనిరతు డాయెను. హేమాంబ నిలచి నిలచి విల్లిదాసుడు రాకుండుటను చూచి వానిసంగతిని విని ఆహా! అతడు మారునని స్వప్నమందైన తలపలేదుకదా! అట్టి యితని మనసును త్రిప్పిరి. ఏమిచేసిరో యని తలచి యతిరాజుల సన్నిధికి వచ్చి శరణాగతిచేసెను. "సరి మీఇరువురి మనసులు మారినవి. ఇద్దరును దంపతులై వాకిట కొచియుండుడు" అని రామానుజులు ఉత్తరువు చేయగా వారట్లే యుండిరి. వారు సర్వసంగపరిత్యాగము చేసి రామానుజుల పాద ములను సేవించుచు నిత్యకైంకర్యము సల్పుచుండిరి. మఠము లోనివా రందరికి అసూయ పుట్టెను. ఏమిజాతి యని దూషించు టకు ఆరంభించిరి. యతిరాజులు ఊరకుండిరి.

ఇట్లుండగా తీర్థవారి వచ్చెను. యతిరాజులు స్నానమునకు పోవుచు దండస్థానీయుడైన మొదలియాండాను చేయి పట్టుకొని పోయిరి. వచ్చునపుడు విల్లిదాసుని చేయి పట్టుకొని మఠమునకు వచ్చి చేరిరి. అట్లే యారాధన, సాపాటు జరిపిరి. అయ్యో! వీనిని పట్టుకొనిరే. స్నానమునకు ముందైనను అట్లుచేసియుండరాదా? యని శిష్యు లనిరి. "విద్యాధనకులమదములు మన మొదలి యాండానునకు గలవు. వీ డీమూడు మదములను త్రోసినవాడు కనుక ఆమూడు మదము లుండువానిని స్పృశించుటకు ఇష్టము లేదు" అని యతిరాజు లనిరి. విల్లిదాసునికిని, ఇతరశిష్యులకును ఉండు భేదమును రామానుజులు విశదపరచిరి. రాత్రిపూట రహస్యముగ ఒక్కొక్కరి అంగవస్త్రమునను ఒక కౌపీనమంత వస్త్ర మును చింపునట్లు రామానుజులు అంతరంగ శిష్యులతో చెప్పి ఏర్పాటు చేసిరి. ఆకార్య మట్లే జరిగెను. ఒక్కొక్కరు తమ అంగ వస్త్రమును చూచుకొని నీవు చింపితివి, నీవు చింపితివి అని ఒకరిపై

నొకరు దోషారోపణము చేసి, అవాచ్యములు పలుకుచు జగడములు వేసికొనిరి. వారియోగ్యత అట్లు బయటపడెను. పిమ్మట రామాను జులు వారిని సమాధానపరచిరి. మరియొకనాటి రాత్రి యతి రాజులు విల్లిదాసునితో ఏకాంతముగ మాటలాడుచుండి వీరిభార్య నగలను దొంగిలించి తీసికొనిరండని శిష్యుల కాజ్ఞాపించి, మీరు వచ్చువరకు వీనిని విడువ ననిరి. వారట్లే పోయి హేమాంబ నిదు రించగా కుడిప్రక్క నగలను తీయుచుండిరి. కొన్నినగలు తీయు గనే ఆమె కన్నుతెరచి చూచి వీరు వైష్ణవులు, ఎందుకొరకో నగలను తీసికొనుచున్నారు అని తలచి కనులను బాగుగ మూసి కొనెను. ఆమె నిద్రపోవుచున్నదని వారు అన్నినగలను తీసిరి. ఎడమప్రక్క నగలను తీయవలయునే అని వారు యోచించు చుండగా అప్రక్కనున్న నగలుసైతము వారు తీసికొనవలయు నను తలపుతో ఆమె అటుప్రక్కకు తిరిగెను. “ఓరీ ! ఈమెకు మెల కువవచ్చినది. లేచినచో నె” ట్లని వారు వెళ్లిరి. పొద్దాయె నిక పొమ్మని చెప్పి యతిరాజులు విల్లిదాసుని పంపి తెచ్చిన నగలను యుంచి పెట్టిరి. విల్లిదాసుడు ఇంటికి పోయి చూడగా తలుపు తెరచియుండెను. ఏమే! ఒకప్రక్కనగలను మాత్రము వేసికొంటి వని విల్లిదాసు డడుగగా రెండుప్రక్కలను వేసికొంటిని. శ్రీవైష్ణ వులు వచ్చి యెందులకో ఒకప్రక్కనగలను తీసికొనిరి. ఈనగ లను కూడ తీసికొందురని ఇట్లు తిరిగితిని, వారు వెళ్లిపోయిరి అని యామెచెప్పెను. ఎందుకట్లు తిరిగితివి. ఒకప్రక్కనగలు సార్థకములైనవి. మరియొకప్రక్కవానికి అట్టిఅదృష్టము కల్గ లేదు. కడకు ఈపార్శ్వపునగల కిట్టి దౌర్భాగ్యము పట్టెను అని విల్లిదాసుడు భార్యను తిట్టెను. మీపాదసాక్షిగా, యతిరాజుల పాద సాక్షిగ చెప్పుచున్నాను. నేను మంచిమనసుతోనే పొరలితిని. గాఢనిద్ర పోవునట్లే తోపించితిని. వారు వెళ్లిపోయిరి అని యామె

బదులు చెప్పెను. యతిరాజుల ఆజ్ఞానుసారముగ విల్లిదాసు నింటి వాకిట నిలచి వినుచుండిన శిష్యులు యతిరాజులకు వారి సంభాషణ చెప్పిరి. "లోకమునం దెవ్వడైనను దొంగతనము జరిగినదని వినిన తోడనే, ఓసీ! ఎందులకు అరవకుంటివి అని భార్యను తిట్టి రక్షకభటులకడ కరిగి నగలు పోయెనని వ్రాయించి అవి లభించు విధము చూచుకొనును. మిగుల విలువగల నగలను శ్రీవైష్ణవులు తీసుకొనలేదని అల్లాడుచున్నాడు. వీడా! మీరా! హెచ్చు? గుణమే పెద్దగాని, జాతిగాదు. ఏ జాతియైన నేమి? భగవత్సంబంధ ముండ వలెను. భగవన్నామము కులము నిచ్చును అని తిరుమంగై యాళ్వారు వాక్యము. బ్రాహ్మణుడు, కుక్కమాంసమును తిను చండాలుడు అను వీరిలో భక్తిలేని బ్రాహ్మణుని సేవింపను, భక్తి గల చండాలుని సేవించెద నని ప్రహ్లాదుని వాక్యము-" అని యతి రాజు లనిరి. విల్లిదాసుమీద అసూయపడువారికి బుద్ధివచ్చుటకై నాడు మాత్రమే కాక స్నానముచేసినపు డంతయును యతిరాజులు వానిచేయి పట్టుకొనుచుండిరి. ఏమో సంభ్రమమున వాని చేయి పట్టుకొనిరి; మేమందరమును వాదించగా గెలిపిరి అని వా రెంచుదు రని ప్రతిదినమును అట్లుచేయుచు "వీడు కల్యాణగుణశాలి; వీని వలె మరొకడు లేడు" అని తార్కాణగా చూపి పరమానుగ్రహము నెఱపిరి. ఇక మొదలియాండాను ఏమి చేయును? మొదలి యాండానుకు విద్యాధనకులమదములు పోయినవా యని పరీక్షించుటకై వారిని పెరియనంబిగారి కూతురైన అత్తుళాయమ్మ ఇంటికి తళియ మొదలగు పరిచారములు చేయబంపి వారి మనో నిశ్చయ మెరిగి పిమ్మట చరమశ్లోకము నుపదేశించిరని ఇదివరలో వ్రాయబడెను. అట్లు కొన్ని గ్రంథములు. మూడు మదములు గల మొదలియాండాను కంటెను మూడు మదములు లేని విల్లి దాసుడు అధికుడని యతిరాజు చెప్పగా సన్నెట్లు పరీక్షింపగోరెదరో

అట్లు పరీక్షింపుడని అత డనెను. అపుడు పరీక్షించుటకై అత్తుళా యమ్మ ఇంటికి బంపిరని కొన్నిగ్రంథములు. యతిరాజులు విల్లి దాసుని పిలిచి నీగుణ మరయుటకు తెమ్మంటిని, తీసుకొనుమని నగల నిచ్చిరి.

మహాపూర్ణులు మారనేర్నంబికి బ్రహ్మమేధ సంస్కారము చేయగా వర్ణాంతరునికి ఇట్లుచేయవచ్చునా యని వారి నెల్లవారును వెలివేసిరి. కక్ష లేర్పడెను. యతిరాజు లీసంగతి తెలిసి ఆచార్యుల నుద్దేశించి మిగుల పెద్దగనుండు మీరేల ఇట్లు చేసితి ? రనిరి. నీవు విషయము నెరుగుటకు అడుగుచున్నావా ? ఊరివా రనుచున్నారని అడుగుచున్నావా ? యని మహాపూర్ణు లడుగగా–

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥

అను భగ. 3అధ్యా. 21 శ్లోకములోవలె పెద్దలమార్గము నే తదితరులు అనుసరింతు రని యతిరాజు లనిరి. భర్తయొక్క బాధను భార్యయు, తండ్రియొక్క బాధను పుత్రుడు తీసికొనరు. గురువగు యామునుల రాచవ్రణమును తన కీయలేదని అతడు గురువుకంటెను అధికముగ బాధపడెను. తుద కా వ్రణమును ప్రార్థించి తీసికొని యామునుల అనుగ్రహపాత్రు డాయెను. శూద్రుడని యెంచరాదు. యామునులే యాజ్ఞాపించిరి. చక్రవర్తి తిరుమగన్ (శ్రీరాముడు) జటాయువునకు చరమకైంకర్యము చేయలేదా ? ఇతడు జ్ఞాని. అంతకంటెను తక్కువైనవాడా ? ధర్మపుత్రుడు విదురునికి చేయలేదా ? అత డే జాతివాడు ? ఈయన అంతకంటెను తగ్గెనా ? కావున జ్ఞానభక్త్యాదులను చూడ వలదా ? ఇదంతయు ముఖ్యమా ? కులం తరుం=కులము నిచ్చును అని చెప్పబడలేదా ? శ్వపచు డైనను సరియని ప్రహ్లాదు డనలేదా?

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాంగతిమ్ ॥

అను భగ. 9అధ్యా. 32శ్లోకము:నందువలె ఇతరప్రియో జనము తలపక నన్ను భజించువాడు ఆచారహీనుడై యుండినను వానిని సాధువనియే తలపవలయును. వాని మనోనిశ్చయము బాగుగ నున్నది కదా! యని చెప్పబడెను. ఇదంతయు నీవు చదివియుండలేదా ? నీకును సందేహమా ? యని మహాపూర్ణులు ఉదాహరణపూర్వకముగ చెప్పగా మీరు సెలవిచ్చినది నామనను నకు బాగుగ పట్టినది. స్వామి అట్లు చేసి చూపెను. మీరు అనుష్ఠించితిరి అని చెప్పి యతిరాజులు ఊరివారిని సమాధాన పరచిరి. నోరుండువారికి బోధింపవచ్చును. మూగకు చెప్పుట కష్టమని కొందరనిరి. ఒకమూగవాడు యతిరాజుల మఠమువద్ద నుండగా వారు వానిని మఠములోనికి పిలుచుకొనిపోయి తలుపు మూసికొనిరి. ఇదేమి తలుపుమూసికొనిరి, మూగవానితో సంజ్ఞ చేయుటకు వీరికి తెలియునా యని కూరత్తాళ్వారు మొదలగువారు అనుకొనిరి. నా శరీరమే గతి యని నమ్ముము అని యతిరాజులు సంజ్ఞ చేయగా మూగవాడు దివ్యమంగళమైన గురువిగ్రహమే రక్షకమని మనః పూర్వకముగ నమ్మి స్మరించుచుండెను. అతడు తలుపు తెరచుకొని బైటకు వచ్చునపుడు మాట్లాడుచు వచ్చెను. అతనితో మాట్లాడుటకు ఇతరులవల్ల గాలేదు. యతిరాజులకే సందేహము. గురు శరీరమే రక్షకమని వాడు నమ్మెను. మహావాగ్ధోరణి కలవాడాయెను. గురుశరీర మంతముఖ్యమా ? ఆసంగతి ఇదివరలో తిరువరంగప్పెరుమాళరయర్ చెప్పియుండిరి. తిరుక్కోట్టియ్యూరు నంబిని సైతము అడిగి సంగతి తెలిసి శిష్యులకు చెప్పనగును. వారి నడుగక ఇపుడే చెప్పిన వారు నన్ను దలతురు. నా కపచారము కలుగును అని సంగతి నెరుగుటకై యతిరాజులు తిరుక్కోట్టియ్యూరునంబిని చూడగోరి యచ్చటికి పోయిరి. వారి దర్శనము కాలేదు. వారు ధ్యానమున నున్నారని తెలిపిరి. ధ్యానానంతరము

నంబిగారు దర్శన మీయగా "ధ్యానమనిరే! అదియేమి ? మేమును చేయవలదా ? తెలియపరచుడు" అని యతిరాజు లడిగిరి. తనకు భగవత్స్వరూపమును జూపిన ఆచార్యుని దలచుటే ధ్యానము. ఆచార్యునికథలే శ్రవణము. వారి నామమే జపము. పరమునకు అదియే ముఖ్యము అని తిరుక్కోట్యూరునంబి చెప్పగా యతిరాజు లాసంగతి గ్రహించి శ్రీరంగమునకు వచ్చి యెల్లవారికి ఉపదేశించిరి. యతిరాజుల దర్శనము, సద్గుణశ్రవణము, పాదసేవ, కైంకర్యాచరణములచేత లోకములోని జను లెల్లరును వైకుంఠము నకు పోవుచుండిరి. యతీంద్రులతో సంబంధము గలవారు నరకమున బడియుండు తమవారితోడ వైకుంఠమునకు బోయిరి. పితృదేవతలు నటనము చేసిరి. మనవాడు ఆశ్రయించెను, కాపాడును అని పితృపితామహులు సంతోషించిరి. మహానుభావుడును, వైష్ణవాగ్రేసరుడును అగు రుక్మాంగదునివల్ల జనులు వైకుంఠము నకు బోయినట్లు లక్ష్మణాచార్యుల సంబంధులు పోయిరి. కర్మ జ్ఞానభక్తులచేత కడతేరవలయునని తలచియుండిన జనులు యతిరాజులచేత ప్రపత్తి ముఖ్యమని తెలిసిరి. విరజానదిలో స్నానమాచరించి విరజకు ఉత్తరదిక్కునందుగల వైకుంఠము చేరిరి. ఈలోకమున కలికి శక్తి లేకపోయెను. ఆలోకమున యమునికి పనిలేకపోయెను. "పొలిక, పొలిక, పొలిక" అను పాశురార్థము జనుల కిపుడు నిశ్చయ మాయెను. మోక్షమునకు బోవువారు అర్చిరాది మార్గమున బోవుదురు. సాధారణముగ ఆమార్గమున జనసంచారమే యుండదు. ఏలన_

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥

భగ. 7అధ్యా. 19శ్లోకమట్లు అనేక జన్మపుణ్యపరిపాకమున గదా అట్లు పోవలయును. ఆమార్గము జనులతో నిండిపోయెను.

యమునికి పనిలేకపోయెను. భటులను తొలగించివేసెను. తాను గూడ ఉద్యోగమున నుండుట వ్యర్థమని తోచెను. కార్యస్థానమునే తీసివేయవలయునని తోచెను. రామానుజులవారు వైష్ణవసిద్ధాంతమును స్థాపన చేయుచు భూప్రదక్షిణము చేయుటే ఇందుకు కారణము. గాన యముడు సత్యలోకమునకు పోయి "బ్రహ్మదేవా! భూలోకమున యతిరాజు లవతరించెను. మితిలేని శిష్యు లేర్పడిరి. కర్మజ్ఞానభక్తులతో కార్యము లేదని ప్రపత్తిలో దిగిరి. ఆసాధనములలో నయిన తప్పుపట్టవచ్చును.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

భగ. 2అధ్యా. 40శ్లోకమువలె అకామ్యకర్మము చేయుచున్నారు. మంత్రలోప, తంత్రలోపము లుండినను యోచనలేదని స్వామిచెప్పెను. కామ్యకర్మము చేసిననేకదా బాగుగ చేయలేదని తప్పులెన్నవచ్చును ? ఇతరసాధనములు సాధనములు గావు. నీవే గతి యనుచున్నారు. స్వామి వారిని చేర్చుకొనుచున్నాడు. ఇక నాపని వదలుకొందునా" యని బ్రహ్మతో చెప్పుకొనెను. అట్లుకాదు. ప్రకృతిగౌరవమేమి? లోకవ్యవహారముచెడునే యనిబ్రహ్మదేవుడు, యముడు, పరమశివుడు ఇంద్రాదిదేవతలతోడ శ్రీరంగనాథుని యొద్దకు పోయి "స్వామీ ! విజ్ఞాపన మొకటి. మీ పరమానుగ్రహపాత్రుడైన రామానుజు డను సన్యాసి మీరు అర్జునునికి ఉపదేశించిన చరమోపాయమును ఎల్లవారికి చెప్పుచున్నాడు. కర్మజ్ఞానభక్తులు లేనివారు మోక్షమునకు పోవుచున్నారు. యతిరాజా ! అందురు, శరణ మందురు, మోక్షమునకు పోవుదురు. ఇందులకు ఆయన నేమన నగును ? మీవలననే తప్పు... ఇపు డీ యమునికి ఉద్యోగమునుకల్పించిన బాగుగనుండు"నని చెప్పిరి. "యతిరాజుల వలన అట్లాయెనా ? ఇట్లు కూడ ప్రవచన ముండునా ? ఆశ్చర్యము!

నాకు లీలావిభూతి, నిత్యవిభూతి యని విభూతులు రెండు గలవు. నిత్యవిభూతిలో అందరు సములే. అది సత్త్వగుణముతో చేరినది. లీలావిభూతిలో భక్తుడు, అభక్తుడు అను భేదము గలదు. ఇది త్రిగుణములతో చేరినది. సీతయుని, రుక్మిణియని, పెండ్లియని ఇచ్చట గలదు. నిత్యవిభూతిలో ఆడుటకు లేదు. ధర్మము తగ్గి అధర్మము హెచ్చిన అవతరింతు నంటిని. ఇక ఈవిభూతి యొక్క డేది ? రామానుజుడు తుదమొదలు చెరచెనే. లీలకు, భోగమునకు అని రెండు విభూతులు అనాదిగ నున్నవి. అది నిత్యము, ఇది అనిత్యము. యతిరాజు తన సామర్థ్యముచేత రెండును ఒకటి చేసెను. ఇక నన్నెవరు అడుగువారు ? బ్రహ్మదులు, ఇంద్రా దులు, సనకాదులు సులభ మనక దుర్లభమను స్థానమును సులభము చేసెనే ! స్మరింపనుకూడ వలనుపడని స్థానమును రామానుజ శిష్యులు పొందిరే! ఇక కొన్నిదినములు ఇట్లు నడచిన లీలావిభూతి పోవును. సాత్త్వికు, రాజస, తామస జనులలో సాత్త్వికులు ఎప్పుడును చెడరు. రాజసతామసులు యమలోకమునకు వచ్చునట్లు చేసెదను. ఆకార్యస్థానమును ఎత్తవలదు'' అని శ్రీరంగనాథు డనెను. ఈసంధిలో క్రిమికంఠుడను రాజును స్వామి యేర్పరచెను. సృష్టింపబడిన ఆరాజు యమునికి సఖుడు, మహాద్రోహి, భగవద్ద్వేషి. యమలోకమునకై సృష్టింపబడిన ఆరాజు ఏమి చేసెను ? ఎట్లు చెరచెను ? అనగా వాడు వేదాంతవిచారము సేయ నారంభించి శైవమతమున అధికాసక్తు డాయెను. అందరును శైవులుగ కావలయును; లేకున్న శిరశ్ఛేద మగునని ఆజ్ఞాపించెను. ''శివాత్పరతరం నాస్తి'' అని యెల్లవారితో చెప్పి చేవ్రాలుచేయు చనుచుండెను. చేయకున్న దెబ్బలు కొట్టించుచుండెను. మనకేమి విద్యయా ? శాస్త్రవిచారమా ? సద్యఃఫలమును చూడవలయునని కొందరును, భయముచేత కొందరును చేవ్రాలు చేసిరి.

"నాలూరాన్ లేక చతుర్గ్రామాధిపతి యనుసతడు అరాజుకు మంత్రిగా నుండెను. అతడు కూరత్తాళ్వారునకు శిష్యుడై యుండెను. వాడు చేవ్రాలు చేయవలసి రాగా, కూరత్తాళ్వారు ముందు చేసిన బాగుగ నుండును. నేను క్రింద చేయవచ్చును అని ప్రాచీనకర్మముచేత అనుకొని క్రిమికంఠు నుద్దేశించి మహా పూర్ణులు, యతిరాజులు ఉన్నారు, వారు చేవ్రాలు చేసినకదా? అనామధేయులు చేసిననేమి ? చేయకున్న నేమి ? అని బోధించెను. ఆరాజు శూరులును, త్వరగలవారును అగు దూతలను బంపి కొట్టియో, భయపెట్టియో వారిరువురను తెండని పంపెను. "మన్నాథుల (ఎంబెరుమానారుల) మఠ మెచ్చట ? మన్నాథు లెవరు ? ఎచ్చట నున్నారు ?" అని దూతలు వచ్చిరి. దూతల వేషమును, త్వరను చూచి రామానుజసిద్ధాంతము పోవు కాలము వచ్చెనని తలచి శిష్యులు లోపలకుపోయి చెప్పిరి. యతిరాజులు స్నానమునకు పోవుచుండిరి. ఇపుడీ దూతలు యమదూతలను బోలియున్నారు. యతిరాజులను చూచిన హింసింతురు. వారు చేవ్రాలు చేసిన కార్యము చెడును. చేయకున్న సంకటము కలుగును. వారిని సకలసంకటముల నుండి తొలగింపవలయును. అట్టి వాడేకదా! శిష్యుడగును అని తలచి కూరత్తాళ్వారు యతిరాజులతో చెప్పక వారిత్రిదండకాషాయములు ధరించి "నేనే మన్నాథుడ" నని బయటికి వచ్చిరి. 'రండి' యని వారు పిలచుకొని పోవుచుండిరి. అంత గురుభక్తితో పోవుచున్నాడే యని పూర్ణాచార్యులును వారి తోడ పోయిరి. ఉడయవరులు సంగతి విని "సరి; వాడు నాకాషాయ మును ధరించెను" అని వారి తెల్లనివస్త్రమును ధరించిరి. రాజ భయమునకై ఊరువిడువ దలచి స్వామితో చెప్పగా "నాయనా! నీదివ్యమంగళవిగ్రహమును కాపాడుకొ"మ్మని రంగనాథు డనెను. యతిరాజు శిష్యులతోడ శ్రీరంగమును విడచి పడమరగా పోయిరి.

రాజు ఇరువురిని పిలిపించెను. ఈయన యతిరాజు; కూరేశు డుండవలదా ? యని రాజదూతలు సందేహించి కొందరు వారిని పిలుచుకొనిపోగా మరికొందరు సంగతితెలిసి తరమిరి. శిష్యులు రామానుజులతో చెప్పగా వారు క్రిందనుండిన మన్నునెత్తి మంత్రించి శిష్యుల కిచ్చి చల్లుమనిరి. వారట్లే రాజభటులపై చల్లగా వజ్రాయుధమువలె బాధించెను. వారు పారిపోయిరి. యతిరాజులు శిష్యవర్గముతోడ పోవునపుడు మొదటిదినమే ఒకస్వామి వారినుండి తప్పిపోయెను. ఆయన అందందు పోవుచుండగా ఆయడవిప్రదేశ మున కొందరు వేటకాం డ్రుండిరి. ఆశ్రీవైష్ణవస్వామి అచ్చటికి రాగా మీరెవరని ఆవేటకాం డ్రడిగిరి. నాది శ్రీరంగ మని ఆస్వామి చెప్పగా అచ్చట యతిరాజులకు క్షేమమా యని వా రడిగిరి. యతి రాజులు శ్రీరంగమున లేరు. చోళుని భయముచేశ మారువేషముతో నెచ్చటికో పోయిరి. వారెచ్చట నున్నారో తెలియకున్నది. నేను వెదకుచు వచ్చితిని అని యాస్వామి చెప్పెను. వేటకాం డ్రామాట విని యతిరాజును కనుగొన్న తర్వాతనే భుజింపవలయునని వ్రతముపూని ఆరుదినములు పస్తుండిరి. యతిరాజులు శిష్యుల తోడ ఆరుదినములు నిరాహారులై, శ్రాంతులై గాలివానలో తల దాచుకొన తావులేక పోవుచుండి ఆరవనాటిరాత్రి వేటగాండ్రసమీప మునకు వచ్చి చేరిరి. ఆయంధకారసమయమున కొండక్రింద నిప్పుమంట అణగి యణగి మండుచుండగా నచ్చట నెవరో మనుష్యు లుందురనియు, మార్గమేదియో వారి నడుగుద మనియు తలచి యతిరాజు శిష్యులతో నచటికి వెళ్లిరి. "మీ రెవరు ? ఎందుండి వచ్చితిరి ? ఎందులకు వచ్చితిరి?'' అని వా రడుగగా "శ్రీరంగ మున నుండువారము. కష్టకాలము. భగవత్సంకల్పమున శ్రీరం గముపీడి వచ్చితిమి'' అని శ్రీవైష్ణవు లనిరి. 'శ్రీరంగములో రామానుజాచార్యులకు క్షేమమా' అని వేటకాం డ్రడిగిరి. "వారిని

మీరడుగుటకు కారణమేమి ? మీరు అడవులలో నివసించు మను జులు. బంధువు లట్లు వారికుశల మడుగుచున్నారే ? ఆయనతో మీకుగల సంబంధ మేమి ?" అని వైష్ణవు లడుగగా "తిరుమల నల్లాన్‌అనువారు యతిరాజుల శిష్యుడు. వారు తనభృత్యులైనమాకు ఎంబెరుమానారు చరణారవిందములే మీకు రక్షక మని ఉపదేశించి యుండిరి. ఆకారణము చేతనే మేము యతిరాజులపట్ల భక్తిగలిగి యున్నాము" అనిరి. వారిని చూడవలయునా ? సంతోషించు దురా యని వైష్ణవు లడుగగా ఔనని వారనిరి. ఈయనయేయని చూపగా వారు "త్వమేవ శరణ" మ్మని యతిరాజుల పాదముల బడిరి. వారు వెళ్లి క్రొత్తవస్త్రములు, కందమూలాదులు తెచ్చి యిచ్చిరి. నిప్పు రాజబెట్టిరి. ఇంతసేపు మేఘము వర్షించినది. ఇపుడు నల్లాన్ అనువారు అమృతవర్షమును కురియించుచున్నా డని ప్రశంసించిరి. శ్రీరంగమున నుండువారు యతిరాజులను గూర్చి చింతించుచుందురని వేటగాని నొకనిని బిలిచి వానితోడ నొకస్వామిని బంపి క్షేమసమాచారము తెలుపు మనిరి. కోసుదూర ములో మాయజమాను డున్నాడు. తా మచ్చుటికి దయచేయ వలయునని చెప్పి వారిని తిరుమలనల్లానింటికి పిలుచుకొనిపోయి గుమపని చెప్పుచుందునే ఆ"మన్నాథన్" ఈయన అని వానిభార్య కెరిగించిరి. వేటకు పోయియున్నారు వత్తురు ఉండుడని అతని భార్య చెప్పెను. నల్లాన్ తనవారితోవచ్చి గురునిరాక నెరింగి సేవించి "నేను లేనని ఊరకున్నారా ? వారిభోజనమున కేర్పాట్లు గావించితిరా, లేదా? యని, యింటనుండువారి నడిగి మనయింటికి వచ్చి వస్తుండుటయా ? మహావైష్ణవులు. వారు ముందుగ భుజించి ననే మనము భుజింపనగును. సమీపగ్రామమున 'కట్టళైవారి' యను బ్రాహ్మణగృహ మున్నది. వారు బీదవారు. బియ్యము, పప్పు, నెయ్యి, చక్కెర మొదలగు ద్రవ్యముల నిచ్చి దివ్యభోజ

ము చేయుంపు మనుకు" అని వారిని పంపిరి. నల్లాన్ భార్య మంచిది. కాన యథేష్టముగ సామగ్రిని పంపెను. ఇక మే ముండరాదు. మీరు భుజింపుడని వేటకాండ్రు వెళ్లిరి. రాముడు లోకోద్ధరణార్థము మాతాపితృపరిపాలన మను వ్యాజము పెట్టుకొని అడవికి పోయినట్లే యతిరాజులు భయవ్యాజమున వెళ్లిరి. ఆదంప తుల భాగ్యముచేత ఏడవనాటిరాత్రికి అచ్చట జేరిరి. కట్టళైవారి అను బ్రాహ్మణునిభార్య చేలాంచలాంబ లేక తలప్పమ్మాళ్ అను నామె. ఆమెభర్త భుజించెను, ఆమె భుజింప లేదు. మీరెల్లరును భుజింపవలయును. నాభాగ్యము! నే డెవరిముఖము చూచితినో మీకందరికి తళియ చేసిపెట్టుభాగ్యము లభించెను. శీఘ్రముగ చేసెదను అని యామె యతిరాజులతో, వచ్చిన స్వాములతో పలెను. వలదు. మే మీరాత్రి భుజింప నెంచలేదు. ఆదరణతో పలికిన ఆపలుకే చాలును.

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥
గీత. 17అధ్యా. 20శ్లో

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥
గీత. 17అధ్యా. 21శ్లో

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్ ॥
గీత. 17అధ్యా. 22

అను ఈశ్లోకములందు సాత్త్విక, రాజస, తామసదానముల సంగతి వరుసగా చెప్పబడినది. అందు 22వ శ్లోకమున కాలుచాచు కొని ఆడించుచు, వచ్చినబ్రాహ్మణుని చూడకయే, ఏదియైన నిచ్చి వెంటనే ఈపీడను వదలించుకొనవలెనని తలచి చేయుదానము

తామస మని చెప్పబడినది. ఎంతచేసినను ఆదరణలేకున్న విషము వలె తోచును. దానమును పరిగ్రహించినవారు దుఃఖించుచు పోవుదురు. వచ్చినవారిని కూర్చుండబెట్టి నమస్కరించి నావలన కావలసినదేమి అని అడిగి తెలిసికొని నాశక్తికొలది నిచ్చెదను. గైకొనుడని పదుగు రిచ్చిన మీకార్యము నెరవేరును అని ప్రీతితో నిచ్చిన దానము స్వల్పమైనను గైకొన్నవారు తృప్తు లగుదురు. "అమ్మా! నీవును అట్లే ప్రియముతో బిలిచితివి. మేము తృప్తి చెందితిమి." అని స్వాములు చెప్పిరి. మేముచేసిన పుణ్యమో, మా పెద్దలుచేసిన పుణ్యమో శ్రీవైష్ణవులు మీరిచ్చటికి వచ్చితిరి. భుజింప కున్నను ఇచ్చట శయనించుటయే విశేషము అని చేలాంచలాంబ కొంగుపిరాట్టి చెప్పెను. యథేష్టముగ భోజనపదార్థములు వచ్చి యున్నవి. నేనును భుజింపలేదు. వీరెల్లరును నిరాహారులుగనే తోచుచున్నారు. ప్రార్థించినను వలదనుచున్నారు. కారణము మాత్రము తెలియకున్నది. ఈమె కులమేమో; ఈమె యెవ తెయో అని వారు యోచించుచున్నట్లు తోచుచున్నది అని ఆమె భావించి స్వాముల నుద్దేశించి "మీరు సందేహింపబనిలేదు. నేను యతిరాజుల శిష్యురాలిని. అట్లుగాకున్న నీయడవిలో కుగ్రామ మున నున్న స్త్రీనగు నేను మీకొరకు పాకము చేయ తలపెట్టు దునా ?" అని చెప్పెను. ఇది గొప్పసంగతి. నీవు వేటగాండ్రున్న స్థలమున నున్నావు. నీకు యతిరాజులదర్శన మెట్లు లభించెను ? అని వా రడుగగా యతిరాజులు వినుచుండిరి. మాయూరిలో పండ్రెండుసంవత్సరములు వర్షము లేకపోగా కరవు సంభవించి మేము శ్రీరంగమునకు వచ్చియుంటిమి. నేను మిద్దెమీదనుండగా యతిరాజులు భిక్షకు పోవుచుండిరి. మహానుభావుడని క్రిందికి దిగి వచ్చి భిక్షమిడి నమస్కరించి నిలిచితిని. ఎందుకు నిలచియున్నా వని వా రడిగిరి. మీకడ భయమేల! మిమ్ము నాతండ్రి యనియో,

మాముగా రనియో భావింపవచ్చును. నామనసున నున్న సంశయము నెన్నిదినములు దాచెదను ? మీరన్ననో భిక్షమెత్తుచున్నారు. రాజాధిరాజులు మీపాదముల బడుచున్నారు. రంగనాథుని సేవకై కాచియుండునట్లు తమసన్నిధిలో కాచియుందురు. ఇందుకు కారణ మెరుగ గోరుచున్నాను అని నేను వారి నడిగితిని. "సంశయాత్మా వినశ్యతి" అని గీతలో చెప్పియున్నది. నీవట్లు సందియము నుంచుకొనక అడిగితివి గాన చెప్పెదను వినుము. నాయొద్ద నొకమంత్రరత్న మున్నది. దానిని నేను వచ్చినవారి కొసగుదును. ఆగొప్పసొత్తునకై వారు కనిపెట్టుకొని యుందురు అని యతిరాజులు చెప్పిరి. నాకామంత్రము నుపదేశింపు డని నేను వారిని ప్రార్థించగా వారు నా కామంత్రము నుపదేశించిరి. ఈపె భక్తి గలది. సమర్థురాలు అని వారు సంతోషించి వెళ్లిరి. మరియొకనాడు వారు పోవుచుండగా మంత్రము మరచితిని. మరల నుపదేశింపుడని నేను కోరితిని. వారు ఉపదేశించిరి. గురుతుగ పాదుకలనిం డని నే నడుగగా రాముడు భరతున కిచ్చినట్లు తమపాదుకలు వారు నా కిచ్చిరి. పిమ్మట నేను నాభర్తతోడ మాయూరికి పోయితిని. వర్షములు కురిసినవి. మే మిచ్చట బ్రదుకుచున్నాము. మరల గురువులను దర్శింపనే లేదు అని చెప్పి యతిరాజుల అనుగ్రహమును స్మరించి దుఃఖించెను. "అమ్మా! నీవు యతిరాజుల శిష్యురాలవు. వారిపాదుకల నారాధించు మహావైష్ణవివి గాన తళియ చేయుము అని స్వాము లనిరి. ఈమాటలు వినుచుండిన యతిరాజులకు సంగతియంతయు స్మృతికి వచ్చెను. ఆమె ఆచారమును పరీక్షింపుడని యతిరాజులాజ్ఞాపించగా శిష్యులు గమనించుచుండిరి. ఆమె స్నాన మొనర్చి మడివస్త్రము ధరించి పాదుకలను తిరువారాధన గృహమునందుంచి ద్వయమంత్రమును, గురుపరంపరను అనుసంధించి

దుకలను గడిగి ఆజలమును శిరముపై ప్రోక్షించుకొని అర్ఘ్య
ద్యాదులతో పూజించెను. అటుపిమ్మట తళియ చేసెను. శిష్య
ంగతి యతిరాజుల కెఱిగించిరి. ఆరగించుటకు రావచ్చునని
పె ప్రీతితో బిలువగా పాదుకలను జూడవలయునని వారు
రి. అక్షతలతోడ ఆమె పాదుకలను తేగా యతిరాజులు
చిరి. మంత్రము జ్ఞాపకమున్నదా ? ఉండినచో చెప్పుమని
తిరాజు లడుగగా రహస్యమే, ఎట్లు చెప్పుదు ? నని ఆమె పలి
. చెవిలో చెప్పుమని యతిరాజు లనిరి. ఇంత పరీక్షింపవల
నా ? భుజించిన భుజింపుడు, లేకున్న పొండు అని ఆమె
నా ? వా రెటులైనను ఆరగింపవలయునని తలంచి మంత్ర
ను చెప్పెను. అటులైన వీరిలో యతిరాజులను చూపుమని వా
గగా ఆమె చేత నొకదీపము నుంచుకొని ఒక్కొక్కరి పాద
ను, పాదుకలను చూచుచు మీరు కారు, మీరు కారు అనుచు
చుచుండెను. హనుమంతుడు సీతాన్వేషణమునకై రావణుని
తఃపురమున ప్రవేశించి స్త్రీలను పరీక్షించి చూచినట్లు ఈమె
ను కార్యార్థమై చూచెను. మనసు చలించక దృఢవ్రతురాలై
వపాదదర్శనము కార్యము అగునని చూచెను. అట్లు చూచుచు
నపుడు యతిరాజుల పాదమును, పాదుకను చూచి మీరే
రాజులు. నేనంత గుర్తులేకున్నానా ? అపుడు కాషాయము,
డు ధవళాంబరము ధరించితిరి. దండము లేదు. అనగా
మ్మా! నేనే పాదుకల నిచ్చినవాడను. మంత్రము చెప్పిన
డను. శ్రీరంగమునుండి ఒకానొక కారణముచే వచ్చితిని.
మహాభక్తిశాలినివి. నీవు శిష్యురాలవే. పరమానుగ్రహ పాత్రు
వు" అని యతిరాజు లనిరి. ఎల్లరును భుజించిరి. ఈమె భక్తి
నకు విరుద్ధము. స్త్రీకి గురుభక్తితో పతిభక్తి యుండవలెను.
తి వీరల నాశ్రయించి కృతార్థుడు కాగూడదా యని తలంచి

చేలాంచలాంబ శ్రీవైష్ణవులు భుజించిన శేషము నెత్తుకొని ఎంగిలి యని తెలియకుండచేసి పాదోదకముతో భర్తకడకు తీసికొనిపోయి ఆయన కొసగి క్రింద పరుండెను.

భర్త : భుజించితివా ?

భార్య : లేదు.

భర్త : ఎందుచేత ?

భార్య : గురువులు వచ్చిరి. వంట చేసితిని. అందరకు పెట్టితిని.

భర్త : నీవేల భుజించలేదు ?

భార్య : గురు వారగించలేదు.

భర్త : ఎందువలన ?

భార్య : నీవు శిష్యురాలవేగాని, నీభర్త శిష్యుడుగాడు. కావున భుజింప నొల్లను అని వా రనిరి.

భర్త : భుజింతువుగాని లెమ్ము.

భార్య : గురు వారగించకుండ నేనెట్లు భుజింతును ? మీరు వైష్ణవులైన ఆయన ఆరగించెదరు.

భర్త : అట్లైన వైష్ణవుడ నయ్యెదను.

భార్య : వైష్ణవుడ నయ్యెద నని ప్రతిజ్ఞ చేయుడు అని యిట్లు భార్య చెప్పగా బ్రాహ్మణు డనేకశపథములు చేసెను.

ఆమరునా డాతడు యతిరాజుల నాశ్రయింపగా . వారితనికి పంచసంస్కారములు చేసిరి. గోవిందదాసుడని పే రుంచిరి. నే నిచ్చట నీ శ్వేతవస్త్రములతోనుండిన యోచనలేదు. ఇంకను అనేకకార్యములు చేయవలసియుండును. సన్యాసియని తెలిసిననే బాగుగ నుండును అని చెప్పి యతిరాజులు త్రిదండ కాషాయ కమండలువులను శిష్యులద్వారా తెప్పించుకొనిరి. పైవానిని భగవత్సన్నిధిలో తీసికొనవలెను. మునుపు వరదుడిచ్చినవి పోయినవి.

అడవిలో మరల సొంతముగ గైకొనవచ్చునా యనిన యతిరాజులు తమఆరాధనలో నుండిన వరదరాజుసన్నిధిలో త్రిదండము, కాషాయములను ఉంచి గైకొనిరి. ఇట్టిభక్తిగలశిష్యురాలిని మరల చూచి అనుగ్రహించితినే, యిది యొకప్రయోజనము అని తలంచి యతిరాజులు శ్రీరంగమును, శ్రీరంగనాథుని నెడబాసిన దుఃఖము మరచిరి. యతిరాజు లాదంపతులచేత పూజింపబడుచు నాలుగైదు దినము లచ్చటనుండి కాషాయత్రిదండకమండలువులను సంపాదించుకొని ఆబ్రాహ్మణుని శ్రీవైష్ణవునిగ చేసి పడమటిదిక్కుగా పయనమై పోయిరి.

యతిరాజులు వహ్నిపుష్కరిణి లేక నెరుపుకోళము అను గ్రామమునకు పోయి మూడుదినము లుండిరి. మిథిలకు పోయి కొన్నిదినములుండి శాలగ్రామమునకు వెళ్లిరి. ఆయూరివారు పరమాద్వైతులు. అచట విష్ణ్వాలయము కలదు; భుజింపవచ్చును గాని మాట్లాడువారు లేకుండిరి. గ్రామములోనివారు మాయావాదులు. పరబ్రహ్మ మొకటియే సత్యము. మాయచేత తక్కినవి తోచును అందురు. వీరు ద్వైతులు. భగవంతుడు అవాప్తసమస్త కాముడు, ఆత్మ జననమరణములలోబడి అల్లాడు వాడు, వీడు వానితో సమాను డగునా? అందురు. అద్వైతులు వీరినిజూచి అసూయనొంది మాట్లాడకుండిరి. యతిరాజులు వారిని జూచి ఇచ్చట ననేకు లున్నారు. వీరు మనమతమును జెఱుపుదురు. వీరిని శిష్యుల గావించుకొనవలయును. వాదించవలెనన్న వీరంత తెలిసినవారు గారు. యజ్ఞమూర్తివలె మిగుల తెలిసినవారిని సులభముగ దిద్దవచ్చును. మూగవాని వలె ఏమియు తెలియనివారికి శ్రమపడి తెలియజేయవచ్చును. ఏమియు తెలియక పండితులమని విర్రవీగువారికి తెలుపుటకు బ్రహ్మకుకూడ శక్యముగాదు. ఎటులైనను వీరిమనసును శుద్ధపరచవలయును. శిష్యులుగా చేసికొన

పలయును అని తలచిరి. వారిని పిలచి మీబుద్ధి చెడియున్నదని చెప్పినచో వారు విందురా ? కావున యతిరాజులు ఆయూరివారు ఏతీర్థమున స్నానపానముల చేయుదురో దానిని తెలిసికొని, మొదలియాండానును మిగుల తగ్గించినందున ఇతరశిష్యులకు వారియందు కొంత గౌరవముతగ్గగా ఆయనను గౌరవపరచ వలయునని తలచి వారిని పిలిచి ఈ యూరివారు స్నానమొనర్చు నపుడు నీ వానీటియందు నీకాలును జారవిడచి గట్టున కూర్చుండుము అని యాజ్ఞాపించిరి. మహాగురుభక్తి గలవాడగుటచేత ఏదోకారణముండునని తలచి కారణము నడుగకయే మొదలియాండాను గుర్వాజ్ఞను నిర్వర్తించెను. కొట్టువచ్చుచుండినవారు రజోగుణతమోగుణములు పోగా యతిరాజుల విషయమున భక్తి కలవారైరి. స్త్రీలు, పురుషులు, బిడ్డలు స్నానము చేసిరి. వారు మొదలియాండానును పిచ్చివాడని తలచిరి. వారి పాదతీర్థప్రభావముచేత ఎల్లవారికిని స్వమతదీక్ష పోయి యతిరాజుల మతమున చేరవలయునని తోచెను. "త్వమేవశరణమ్మను" అని వారెల్లరును యతిరాజుల పాదముల బడిరి.

> శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
> స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

అను భగవద్గీత 3అధ్యా. 35శ్లోకమునందు స్వమతమును విడువరాదని చెప్పియున్నది. మీరు మీమతమును విడువవచ్చునాయని యతిరాజు లడుగగా అజ్ఞానముచేత కదా అది స్వధర్మమనుకొంటిమి. జీవాత్మ, పరమాత్మ భేదము లనుటయు, ఒకటి అనుటయు రెండు పక్షములైనచో స్వధర్మము, పరధర్మము అనుకొనవచ్చును. అద్వైత మమనది తెలియక తోచుచున్నదే గాని వాస్తవము గాదు. మేము భ్రాంతులము. మాది స్వధర్మము గాదు. మమ్మ శిక్షించి మీదీక్షలో చేర్చుకొని పంచసంస్కారాదులు

చేసి చేర్చుకొనుడు అని వారనిరి. అయోగ్యులు యోగ్యులైరి. కాన యతిరాజులాయూరికి సాలగ్రామమని పేరుంచిరి. యతిరాజులాయూరిలో నుండిన ఆంధ్రపూర్ణులు లేక వడుగనంబి అనువారిని విశేషముగ కటాక్షించిరి. శరణాగతిచేసిన వడుగనంబిని తమఅంతరంగశిష్యులలో చేర్చికొని వారితోడ సింగర్ కోవెలకు పోయిరి. అచ్చట నరసింహస్వామి యుగ్రుడైయుండెను. క్రిమికంఠుడు రాజుగా నుండిననేమి ? శివుడే గొప్పయని వ్రాయుమని నిర్బంధింపవచ్చునా ? శివునికి మీదవస్తువున్నదా ? లేదా ? యని విచారించుటకు వాడా, మనమా ? అట్టివాడింకను బ్రతికియుండెనేని సంకటపెట్టును. అట్టివాడు పోవలసినదే అని యతిరాజులకు తోచగా కోప మొదవి ఆక్రిమికంఠుని మరణమునకై నృకంఠీరవునిసన్నిధిలో, అగ్నిగుండములో ఆభిచారికహోమము చేసిరి. అచ్చటనుండి తొండనూర్ లేక భక్తగ్రామమునకు పోయిరి. వీరి యనుగ్రహమును సంపాదించిన తొండనూరునంబి అచ్చటనుండిరి. వారి ననుగ్రహింప నచ్చటికిపోయి వారిచేత ఉపచరింపబడుచుండిరి. ఆయూరిరాజగు విట్ఠలదేవరాజు కొమార్తెను పిశాచము పట్టెను. తొండనూరునంబికి ఉంఛవృత్తియే జీవనము. ఆయన రాజగృహమునకు బోయెను. రాణి యతనిని జూచి "స్వామీ! బిడ్డ పిశాచముచేత నల్లాడుచున్నది. దానిని విడిపించువా రెవరైన నున్నారా ?" యని యడుగగా అమ్మా! సర్వలోకగురుడు వచ్చియున్నారు. వారికి మంత్రతంత్రము లన్నియు తెలియును. మీయదృష్టముచేతనే వారీయూరికి విచ్చేసిరి. వారిచ్చటికివచ్చిన పిశాచము పోవునని నంబి చెప్పెను. రాజు బౌద్ధమతస్థుడగుటచేత సమయ మెఱిగి యతిరాజుల సంగతి చెప్పవలయునని రాణి చూచుచుండెను. ఒకనాడు వారియింట ఏదోవిశేషము కాగా రాజు స్వాచార్యులను భోజనమునకు పిలిచెను

అంగహీనుడగుట నెట్లుండెనో రాముని వారు చెప్పిపంపిరి. ఈరాజొక సారి ఢిల్లీశ్వరునితో యుద్ధముచేసి సంకటముతో విముక్తుడై వచ్చి యుండెను. కృష్ణమూర్తి నామముగదియగు దుక్మితో యుద్ధముచేసి వానిని చంపుటకు సరాటుగ ఒకచెంప గొరిగెను. వానిపై దయదలచి విడిచిపెట్టినయెడల నాచెల్లెలిని జూచి యీకృష్ణుని విడిచితినిగాని, లేకున్న విడిచియుందునా? యని వాడు లేనిపోని డంబములు పలుకును. అందుకే స్వామి గుడ్డిగ అకార్య మొనర్చెను. ఢిల్లీ శ్వరుడు పైతము గుడ్డిగ నుండుటకై విట్ఠలదేవరాజు వ్రేలిని ఛేదించెను. 'అవయవలోప ముండినవానియింట భుజింపరాదని శాస్త్రము' ఆకారణముచేత మునుపు భోజనమునకు వచ్చి యుంటిమి. ఇప్పుడట్లు వచ్చుటకు గాదు. వ్రేలిని స్మరించుకొనుము అని గురువులు చెప్పిపంపిరి. అంగహీనుడగువానియింట భుజింపరాదని తలంచువారిని ఆదరింపనేల? విడువవలయునని రాణి చెప్పగా "ఔను, అందరికిని అన్నవస్త్రములిచ్చి కాపాడుచున్నాను. నా వలననేగదా వారికి గౌరవము? ఇపుడే వారిని విడిచితిని. కాని మంచియో, చెడ్డయో దేనికైనను ఆచార్యు డుండవలదా!" అని రాజనెను. ఆచార్యుని తెలిపెదను. యతిరాజులు వచ్చియున్నారు. ఆయన నాశ్రయించిన కడతేరుదు రని రాణి పల్కెను. రాజం దుల కంగీకరింపగా రాణి తొండనూరునంబితో చెప్పెను. ఆయన యతిరాజులకు తెల్పగా వా రచ్చటికి రామనిరి. మీ రట్లనరాదు. ఆపద్ధర్మము. వాని కూతును పట్టియున్న దయ్యమును తోలినచో వాడు వశు డగును. అందువలన మంచిజరుగును. ఈరాజు క్రిమి కంఠునికంటెను పెద్దరాజు. మనలను ఒకటి, రెండుదినము లుంచు కొని పొమ్మనునట్లుండిన పోకుండవచ్చును. కాని అతడు తనగురు వుల సంపదని పరిత్యజించెను. అతనియాపద తొలగించినయెడల చెప్పినట్లు వినును. విష్ణ్వాలయములను స్థాపించవచ్చును.

పునరుద్ధారములు చేయవచ్చును. ఎందరినో సరిపరచవచ్చును అని తొండవారునంబి మొదలగువారు చెప్పిరి. అయిన నేమి చేయవలయుననని యతిరాజు లనగా పిలిచినదే చాలునని రండి యని వారనిరి. మేమట్లు రామని యతిరాజు లనగా మాకై రండి యని వారనిరి. యతిరాజులు శ్రీవైష్ణవుల శాసన మని తలచి సమ్మతించి అచటికిపోయి రాజపుత్రికశిరమున తమపాదములుంచి శ్రీపాదతీర్థము నిచ్చిరి. బ్రహ్మరక్షస్సు పోయెను. దివ్యవిమానము వచ్చెను. రాజకుమారికి చిత్తభ్రమ పోయి చేష్టలు మానెను. ఆమె చీరకట్టుకొనగా కనకాభిషేకమైనట్లు తోచెను. దుష్టగ్రహబాధ తొలగిన రోహిణీనక్షత్రము ప్రకాశించినట్లు ప్రకాశించెను. ఇక నాగురువులను విడిచితిని; మీకు శిష్యుడ నైతిని. మీరేమి చేసినను చేయుడు అని రాజనగా యతిరాజులు అతనికి విష్ణువర్ధనుడు అని పేరుంచిరి. పంచసంస్కార మొనర్చిరి. ఎల్లవారును మాకు, మావంశస్థులకు, ఈయూరికి మీరే గురువులని వచ్చి పాదముల బడిరి. అందరికిని పంచసంస్కారము లాయెను. యతిరాజులు సకలప్రాణులచేతను ఉపచరింపబడుచు కొంతకాల మచ్చట నుండిరి.

విట్ఠలదేవరాజుయొక్క పండ్రెండువేలమంది గురువులు "మాశిష్యుని లాగుకొంటివా ? మాతో వాదము సల్పుము" అని యతిరాజుల మీదికి వచ్చిరి. మీరుబౌద్ధులు; నేను మిమ్ము చూడను, తెరవేయుడు అని చెప్పి యతిరాజులు ఒకముఖము చాలదని నిజరూపము వహించి వేయిముఖములతో వాదించి జయించిరి. విసపుగాలి సోకి వారు మృతినొందుదు రనియు, భయపడుదు రనియు వారట్లు తెరవేయించిరి. కొందరు యతిరాజుల పాదముల బడగా వారిని క్షమించి విడిచిపెట్టిరి. విట్ఠలదేవరాజు యతీంద్ర చరణారవిందములందు పరమభక్తి గలవా డయ్యెను. యతిరాజులు కొంతకాల మచ్చటనుండి సింగర్ కోవెలకు వచ్చిరి.

యతిరాజులకు తిరుమణి అయిపోగా శాస్త్రోక్తమృత్తిక కావల యునే అని చింతించిరి. యతిరాజు చింతించిన ప్రపంచమే చింతించినట్లగునుగదా! ఆరాత్రి యాదవశైలమణి (తిరునారాయణస్వామి) స్వప్నమున ప్రత్యక్షమై "యతిరాజా! యదుగిరిలో మంచిస్థలమున యథేచ్ఛముగ మన్ను దొరకును. ఎత్తికొనుము. అది శ్వేతద్వీపమందలి మృత్తిక. గరుడుడు దాని నిచ్చట వేసెను. గైకొనుము. నన్నును ప్రతిష్ఠింపుము. నాకు తండ్రి వగుము" అని చెప్పెను. యతిరాజులు మరునాడే లేచిపోయి వెదుకగా భగవంతుడున్నచోటు తెలియలేదు. అయ్యో! స్వామి సత్యకాముడు, సత్యసంకల్పుడు. అబద్ధము చెప్పడు. మరి దొరకలేదే అని చింతాక్రాంతులై పరుండియుండగా స్వామి మరల ప్రత్యక్షమై "నాయనా! కల్యాణతీర్థముగట్టులో దక్షిణముప్రక్క కొండ క్రిందుగా చంపకవృక్షము లధికముగ నున్నవి. అచట తులసీ వనమున్నది. అందు పెద్దచెట్టున్నది. ఆచెట్టుక్రింద పుట్టలో మన్నాను. సత్యము, సత్య" మని చెప్పెను. యతిరాజు లట్లే వెళ్లి చూడగా కోటి సూర్యు లుదయించినట్లు స్వామి ప్రకాశించు చుండెను. 'ఈతావును పట్టణ మొనరింపుము' అని స్వామి చెప్పెను. యతిరాజు లట్లేచేసి ప్రాకారమండపగోపురములతో సలక్షణమైన కోవెలగట్టి దానికి శ్రీమన్నారాయణపురము లేక తిరునారాయణపురమని పేరుంచిరి. దానినే మేలుకోట యందురు. సంప్రోక్షణము కావలసి యుండుటచేత శ్రీరంగరాజభట్టరు లేక రాజభట్టరును చేయు మనిరి. మంత్రతంత్రలోపములు లేక చేయించిరి. సకలవిభవములును జరుగుచుండెను. సన్నిధికి పోయినవారే ఆవైభవములు సేవింతురు. ఎల్లవారును కడతేర వలదా? బ్రహ్మోత్సవములు చేయవలెను. ఈస్వామి శిల. ఉత్సవమూర్తులు లేరే యని యతిరాజులు చింతతో పరుండ

స్వామి స్వప్నమున ప్రసన్నుడై "ఢిల్లీశ్వరు నింటిలో నా ఉత్సవ విగ్రహ మున్నది. తీసికొనిరమ్ము." అని చెప్పిరి. యతిరాజులు డెబ్బదినల్గురు సింహాసనాధిపతులు, పండ్రెండువేలమంది యేకాంతులు, లక్ష సామాన్యశిష్యులు వెంట నేతేరగా వెడలి ఢిల్లీశ్వరునికి తమరాక నెఱిగించిరి. మూలవిగ్రహమును చేరవలెనని ఉత్సవ మూర్తుల కిష్టముండుటచేత స్వామి ఢిల్లీశ్వరుని ప్రేరేపించగా నతడు యతిరాజుల నెదుర్కొని 'నేను అన్యమతస్థుడను. ఏమిపని మీద తామిందరితోడ దయచేసితిరి ? చెప్పితిరేని చేసెద' నని నమస్కరించి చెప్పెను. "మాకేమి కావలెను ? మీయొద్ద మా యుత్సవవిగ్రహ మున్నది. అది కావలె"నని వారడుగగా "మేము దిగ్విజయకాలమున అనేకవిగ్రహములను తెచ్చియున్నాము. మా ఖజానాలో చూడుడు" అని ఢిల్లీశ్వరు డనెను. వారు వెదకి చూచి లేననగా "నేనేమి చేయుదును ? మీస్వామి యైనచో పిలువ రాదా ?" యని ఢిల్లీశ్వరు డనెను. యతిరాజు చింతతో పరుండగా "యతిరాజా! దుఃఖింపనేల ? మీరు పిలిచిన రానా ? మీస్వామిని కానా ? మాస్వామి యున్నాడు. పిలిచెదననరాదా ? నాయందు అంతనమ్మిక లేదా ?" అని స్వామి యనెను. "ఎక్కడనున్నావని పిలుతును" అని యతిరాజు లడుగగా "రాజపుత్రికదగ్గర సుఖముగ నున్నాను. ఆమె శయనగృహముకడకు వచ్చి పిలువుము" అని స్వామి స్వప్నమున చెప్పెను. యతిరాజు లీసంగతి రాజు కెఱిగింపగా "నేనును వచ్చెదను. నాతోవచ్చి చూడు" డని అత డనెను. యతిరాజు ఢిల్లీశ్వరునితోడ అంతఃపురమునకు పోగా ఆవైభవమును చూడవలెనని ఊరివారికి తోచెను. అందరి కది వేడుకగా నుండెను.

"రామప్రియా! రమ్ము" అని యతిరాజు పిలిచెను. అంతట గొప్పప్రకాశ ముకలుగగా పీతాంబరము ధరించినవాడును,

కస్తూరీతిలకోజ్జ్వలుడును, సుందరమూర్తియు, పెండ్లికుమారునియు ట్లుండువాడును, ఇట్టి వాడని వర్ణించుటకు తరముగాని రూపము గలవాడును అగు స్వామి కాళ్లగజ్జెలు గల్లు గల్లు మన మెరయు చుండగా నడచివచ్చి యతిరాజు తొడపై గూర్చుండెను. విగ్రహ మెపుడు నడచివచ్చెనో అపుడు మాట్లాడి యుండునని యెల్ల వారును తలంచిరి. యతిరాజు లానందసాగరమున మునింగిరి. "ఆహా! పుట్టలోనుండిన తిరునారాయణుడు నాచే ప్రతిష్ఠింప బడవలయునని తలచి నాస్వప్నములో ప్రత్యక్షమై తానుండు చోటు తెలిపెను. నిత్యోత్సవములు జరుగుచున్నవి. ఉత్సవ మూర్తులు కావలెనని తలపగా ఢిల్లీశ్వరుని ప్రేరేపించి నాకు మర్యాద చేయించెను. తానుండుచోటు చెప్పి నన్ను రప్పించి నాడు. మానమును కాపాడినాడు. గౌరవము గల్గించినాడు" అని సంతోషముచే రోమాంచము గలుగగా స్వామిని గాఢాలింగనము చేసికొని "శెల్వపిళ్లా" లేక 'సంపత్కుమారా' అని పిలిచిరి. ఊరి వారును, ఢిల్లీశ్వరుడును స్వామికి యతిరాజపుత్రుడని పేరు పెట్టిరి. రాజు శరణాగతి చేసెను. అనేకవిధముల పూజించి ప్రపంచమున వీరివలె నెవ్వరును లేరని ఆశ్చర్యపడి విగ్రహము నిచ్చెను. యతిరాజులు స్వామిని తీసికొని పోగా నేనావిగ్రహము నెంతకాలముగనో చెంతనుంచుకొని యున్నాను. ఆవిగ్రహమును విడిచియుండలేను అని రాజుకూతురు దుఃఖించెను. విగ్రహమును తీసికొనిరండి యని రాజు పరివారమును బంపగా "నీవు ప్రభుడవు. ఇచ్చితివి. మరల గైకొనరాదు. నే నీయవలసిన న్యాయము లేదు. నీవు న్యాయాధిపతివి. ఇట్లడుగ రాదు" అని యతి రాజులు చెప్పి పంపిరి. బలాత్కారముగ తెమ్మని ఢిల్లీశ్వరుడు దూతల నంపగా యతిరాజులు మొదలగువారు భయపడి కాపాడు డని ఆప్రదేశమునన్నున్న పంచములను అడిగిరి. వా రెల్లవారిని

పొదలో దాగుడని పల్కి రాజభటులు రాగా ఇచ్చట నెవ్వరును లేరని చెప్పిరి. లోపలికి వెళ్లి చూచెదమని రాజభటు లనగా మా యూరిలోనికి మీరేల వచ్చెదరు ? పొండి. వారిచ్చటికి రారు అనగాదూతలు పోయిరి. "స్వామీ: మేము చండాలురము. స్వామిని, మిమ్ము కాపాడితిమి. స్వామి ఆలయములోనికి పోగానే చండా లురు ఊరిలోనికి రారాదు'' అని అందురేమో యని పంచము లనగా యతిరాజు ఎంతమాత్రము అట్లు జరుగదు. అపుడపుడు మీరు స్వామిని సేవించునట్లు చేసెదము. మీమేలు మఱవ మని యతిరాజు లనిరి. జ్ఞాపకముంచుడు. మేము కడతేరవలదా యని పంచములు విన్నవించిరి. రాజభటులుపోయి జరిగినసంగతి ఢిల్లీశ్వరున కెఱింగించిరి. యతిరాజులు తమజనముతోడ దాగి యుందురు. ఆయన కంతశక్తి యున్నది. మీరు పోయి వారిని కనుగొని హింసింపక మారాజకుమారిని పిలుచుకొనిపొండి యని వారితో చెప్పుడని ఢిల్లీశ్వరుడు భృత్యుల కాజ్ఞాపించెను. వారట్లే యతిరాజులతో జెప్పిరి. ఆరాజు మిగుల గౌరవించెను. స్త్రీహత్య గావించియే స్వామిని పిలుచుకొని పోవలయునా ? స్వామికెందరు భక్తు లుందురో యని యతిరాజు లందుకు సమ్మతించి అచ్చటికి పోయిరి. ఢిల్లీశ్వరుడు స్వామితోడ తనపుత్రికను బంపెను. స్వామి తనకు అల్లుడును, యతిరాజులు సంబంధియు అగుటకు రాజు మిక్కిలి సంతోషించెను. కౌమార్తెను, అల్లుని బంపునపుడు వారి సంరక్షణార్థమై తనకుమారుని చతురంగ బలసమేతముగ బంపి జాగ్రత్తగ విడిచిరమ్మని రాజు ఆజ్ఞాపించెను. వేదపారాయణము తోడను, అనేకవాద్యవిశేషములతోడను వారు బయలుదేరి వెళ్లిరి. 'ఎన్నివస్త్రములు కట్టి ఆభరణములు పెట్టినను స్వామి మాతో మాట్లా డెనా ? మీతో మాట్లాడెనే' యని యతిరాజులను గౌరవించుచు, స్తుతించుచు వారు వెళ్లిరి. స్వామిని, రాజకుమారిని నవరత్నఖచిత

మైన బంగారుపల్లకిలో కూర్చుండబెట్టి యువరాజు పరమభక్తితో పల్లకినిపట్టుకొని నడచుచుండెను. రాముడు సీతతో సంతోషముగా అయోధ్య కరిగినట్లు పత్నీయుతుడై స్వామి పోవుచుండగా నొక ప్రకాశముగల్గి రాజపుత్రి కనుపురు గయ్యెను. ఆమె స్వామిలో చేరెను. సాయుజ్య మనగా భేదములేక లోపలికి పోయి అనుభవించుట. ఎల్లవారును చూతురను తలంపుతో ఆమె స్వామిలోపల జేరెను. చతురంగసైన్యములును ఉన్నవి. ప్రేమించిన స్వామి పిలుచుకొనిపోయిన నేమి చేయవచ్చును ? యతిరాజులకును, ఎల్లవారికిని, ఆమెతమ్మునికిని ఆశ్చర్యము గలిగెను. ప్రియవడి వచ్చినదిగాన స్వామి సాయుజ్య మొసగెను. ఆభాగ్య మామెకు లభించెను అనుకొని రాజకుమారుడు స్వామిని ఊరికి పిలుచుకొని పోయి విడిచిపెట్టి మేమడుగడుగునకు వచ్చుచుండుటకును, ఈమె ఢిల్లీశ్వరుని కూతురని ఎల్లవారికిని తెలియుటకును ఈమెను అర్చారూపముతో స్థాపించవలయునని యతిరాజుల నడిగెను. యతిరాజులు సమ్మతించి అట్లుచేసిరి. రాజపుత్రుడు యతిరాజులయొద్ద సెలవుగైకొని ఊరికేగి తండ్రితో జరిగినసంగతి చెప్పెను. జగదీశ్వరుడు లభించెను. బిడ్డయెట్లు సుఖపడగోరునో అట్లు సుఖపడనిమ్ము. మంచిపని చేసితి వని రాజు కుమారుని మెచ్చుకొని కొమార్తె యొక్క, అల్లుని యొక్క ఆరాధనకై అమితద్రవ్య మొసంగి మనుష్యులన మీరే యని యతిరాజులను శ్లాఘించి వారి పాదములు గట్టిగ పట్టుకొని శరణాగతి చేసెను. ఢిల్లీశ్వరునకు కబీరని మరొకపుత్రు డుండెను. వాడు పెద్దవాడు. వా డీ సంగతి విన్ననాటినుండియు చెల్లెలైక్యమైనట్టి ఆస్వామిని సేవించవలెను. స్వామిని పిలుచుకొని పోయిరే. ఆస్వామిని పట్టుకొనవలయును. నాచెల్లెలికి భక్తియున్నదా? పూజలున్నవా ? యవనుని కూతురైన ఆమె స్వామిపైమనసుంచగా భక్తవత్సలుడు గ్రహించెనే. వసిష్ఠ

వాసుదేవాదులకు జ్ఞానభక్తి, గోపికలకు కామభక్తి. స్వామి దానికిని వశ్యుడాయెనే! అతడు మంచిస్వామి. ఆయనను సేవించవల యును అని తలంచి నారాయణపురమునకు వచ్చి యతిరాజులను దర్శించి మీరు రాగా మాస్వభావము మారెను. మిగులభక్తి గలి గెను. నేనేమి చేయుదును? అని అడిగెను. ఒక్కస్వామిని సేవించిన చాలదు. దివ్యదేశయాత్ర సల్పుము. మంచిగతి గల్గునని యతి రాజులు చెప్పిరి. అతడు యవనుడైనను దివ్యదేశసంచారము చేయుదలంచి అచ్చటచ్చట సేవలు దొరకునా యని యతిరాజుల నడిగెను. యతిరాజు నాజ్ఞయని చెప్పుమని యతిరాజు లనిరి. వా డనేకదివ్యదేశములను చూచుచుపోయి శ్రీరంగముచేరి స్వామిని సందర్శించి నిన్ను విడిచి పోజాలను. మోక్ష మిమ్మని స్వామి నడిగెను. నేను యోగ్యులకు మోక్షమిచ్చువాడను. పతితులకు మోక్షమిచ్చువాడు జగన్నాథుడు అని రంగనాథుడు చెప్పగా అత డట్లే జగన్నాథమునకు పోయి సన్నిధిప్రసాదముతో కాలము గడపుచుండెను. స్వామి యొకనాడు పరీక్షింపగోరి అతడు భుజించునపుడు శునకముగ వచ్చి రొట్టెను లాగుకొని పారిపోయెను. అతిథి, సన్యాసి, బ్రాహ్మణుడు ఇటువంటి రూపములతో పోలేదు. శునకరూపముతో వచ్చెనను అతడు పాత్రయందున నెయ్యితీసికొని శునకమా! ఆగుము. నెయ్యి తీసికొనుము. నేతిసంబంధము లేకుండిన కడుపునొప్పి కలుగును. అనుచు దానివెంబడి పోయెను.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శునిచైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః॥

అను భగవద్గీత 5అధ్యా. 18వశ్లోకమున బ్రాహ్మణుడు, చండాలుడు, గోవు, ఏనుగు, కుక్క వీరియందు స్వామియున్నాడు. కాన జ్ఞానులు సమముగ చూతురని చెప్పబడియున్నది. కబీరుకూడ అదేశకు వచ్చెను. శునకమునందు అంతర్యామియైన స్వామి

కష్టపడునని తలంచెను. ఇట్లుతలచి శునకమువెంట బహుదూరము పోయెను. అశునకము ఒకమంచిస్థలమున నిలిచి శంకచక్రగదా పాణియగు జగన్నాథుడుగ దర్శన మిచ్చెను. వానికి మోక్షము లభించెను.

యతిరాజుల అధ్యక్షతవలన తిరునారాయణస్వామికి ఉత్సవము లేర్పా టయ్యెను. "ఆహా! పంచములుగదా నన్ను కాపాడిరి. వారు లేకుండిన నేమైయుందును" అని తలంచి యతి రాజులు వారు ఆయుత్సవమున బలిపీఠమువరకు పోవచ్చుననియు, కల్యాణతీర్థమున స్నానము చేయవచ్చుననియు, ఆయూరికి కొత్తచట్ట మేర్పఱచిరి. వారు తైలము, బియ్యము స్వామి కిత్తురు. మూడుదినము లైన పిదప యథావిధిగ సంప్రోక్షణ మాచరించి మిగిలిన ఉత్సవములను ఉడయవరుల యాజ్ఞచేత అర్చకులు నిర్వర్తింతురు. పంచములు సహాయము చేసిరనియు, వారికి మర్యాద జరుగుచున్నదనియు కొన్నిగ్రంథములలో లేదు. లేకున్న ఇప్పటికిని అచ్చటివారికి ఆమర్యాద తప్పక జరుగు చుండునా ? కృతయుగమున సనత్కుమారుడు వైకుంఠరూపియైన నారాయణుని స్థాపించి పూజించుటచేత ఆదివ్యదేశమున కాయుగ మున నారాయణాద్రి యనిపేరు. త్రేతాయుగమున త్రిమూర్త్యం శమున దత్తాత్రేయుడు వేదశాస్త్రములను చేయుచుండగా నలుగురు వేదపురుషులు శిష్యులుగా వచ్చి చేరిరి. ఆయన శిష్యులతో పరిక్రా మించుచు ఈచోటికి వచ్చి స్వామిని పూజించెను. అందుచేత ఆప్రదేశమున కాయుగమున వేదాద్రియని పేరు. ద్వాపర యుగ మున యాదవుడైన శ్రీకృష్ణమూర్తి అచ్చటికి పోయి పూజించి నందున నాయుగమునం దాచోటికి యాదవాద్రి యని పేరు. కలియుగమున యతిరాజులు జీర్ణోద్ధారణము చేసిరి గాన ఈయుగ మునం దా దివ్యదేశమునకు యదుశైలమని పేరు. రామానుజుల

కృపచేత నాయడవి యూరాయెను. పద్మవనము అనుచోట నుండిన అనేకులు మతనాశము చేయ నారంభించగనే యతి రాజులు పోయి వాదించి వారిని శిష్యులనుగ చేసికొనిరి. యతి రాజులకు శ్రీరంగము సొంతము గాన విశేషమర్యాదలు జరిగెను. ఇచ్చట అట్లు జరిగెనా యనిన అంతకంటెను హెచ్చుగనే జరిగెను. శ్రీరంగమున అన్నియుండెను. ఇచ్చట ఏమియులేక యేర్పడినది గాన విశేష మర్యాదకు హేతువాయెను. యతిరాజులు బయలుదేరి పోగానే శ్రీరంగమును దొంగలు, సింహవ్యాఘ్రములు ఆక్రమించెను. రంగనాథునికి చింత కలిగెను. "బ్రహ్మ చెప్పగా రామానుజ సిద్ధాంతమును చెఱచి కొంతసహాయము చేయవలయుననుకొంటిని. యతిరాజును పంపుమని వరదు నడుగగా ఆయన పంప ననెను. మోసపుచ్చి ఆయనను రప్పించితిని. అట్టివానిని ఊరు వెడల గొట్టించితిని. నావలన సృష్టింపబడిన క్రిమికంఠునిచేత పాషండ మతము ఆరంభ మాయెను. నాభాగ్యము తిరునారాయణపురికి పోయెనే. క్రిమికంఠుని శీఘ్రముగ చంపవలయును" అని రంగ నాథుడు తలచి ఒకస్వామిని ప్రేరేపించెను. శ్రీరంగమునుండి తిరునారాయణ పురమునకు ఆవైష్ణవస్వామి వచ్చి యతిరాజులను సేవించగా చోళరాజు పిలువనంపగనే మహాపూర్ణులు కూరత్తాళ్వారు బయలుదేరి పోయిరే. సంగ తేమాయెను ? అని యతిరాజులు వచ్చినస్వామి నడిగిరి. "మీరు పోగానే మేము 'శివాత్పరతరం నాస్తి' అని యేర్పాటు చేసితిమి. మీ రేమనెదరు ? ఆక్షేపణకు సమాధానము లుండిన చెప్పుడు" అని వారడిగిరి. "శివుడు మా స్వామికి మనుమడు. తాత పెద్దయా ? మనుమడు పెద్దయా ?" బ్రహ్మ కుమారుడు శివుడు అతనిపుత్రుడు బ్రహ్మరుద్రాదులు పుత్రపౌత్రులుగ నుండగా-

మత్తః పరతరం నాన్యత్ కించిద స్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥

అను భగవద్గీత 7అధ్యా. 7శ్లోకమువలె ఆయనను మించిన వారు లేరు. గీతను మించినది లేదు. దానియందు "మత్తః పరతరం నాస్తి" యని స్వామియే చెప్పియున్నాడు. అట్లుండగా 'శివాత్పరతరం నాస్తి' యని చెప్పవచ్చునా ? అట్లు చెప్పుటకు కాదు. అది నిజమును గాదు అని వీరు చెప్పగా పుత్రుడు, పౌత్రుడు అనిన వినము. శివుడు పెద్దయా ? విష్ణువు పెద్దయా ? చెప్పుడు అని రాజు కోపముతో నడిగెను. "ఒకడు కాలుచాచగా మరియొకడు పురుషసూక్తమంత్రములతో ఆపాదమును కడిగెను. ఇంకొకడు భక్తితో ఆపాదజలమును శిరమున ధరించెను. వీరిలో నెవడు హెచ్చు ?" అని వారనగా "కాలుచాచినవాడు పెద్ద, కడిగినవాడు మధ్యస్థుడు, ఆజలమును ధరించినవాడు తక్కువవాడు" అని రాజనెను. "మాస్వామి కాలుచాచగా బ్రహ్మ కడిగెను. శివుడు శిరమున ధరించెను" అని వారనిరి. శివుడు శిరసున ఆజలము వేసికొనెనా ? ఎందుకొరకు వేసికొనెను ? ఏమి ప్రయోజనమును పొందెను ? అని రాజడిగెను. 3అధ్యా. 4నూ "నాన్మొగన్ తిరువందాది" 9వ పాశురార్థము.

"బ్రహ్మ తన అల్పత్వమును చూపుచు తనకమండలువులోని దివ్యతీర్థమును పురుషసూక్త మంత్రములతో స్తుతించి కాలకూటవిషము భుజించి నల్లనిగొంతుక కలవాడైయుండు శివునిమీద పడునట్లు కడిగెను. కర్మముచేసి అంతఃకరణశుద్ధిని పొంది, భగవచ్చరణారవింద ధ్యానము చేయవలయును. దివ్యరేఖలచేత అలంకరింపబడిన పాదమందలి నఖములు సూర్యోదయమైనట్లు ప్రకాశించును. సూర్యునికి మీది ప్రకాశము. సూర్యకాంతి యే అంధకారమును పోగొట్టదో ఆయంధకారమును పోగొట్టును. హృదయాకాశమున భగవచ్చరణారవిందము నుంచుకొనిన చీకటి పోవును అని భాగవతమున శుకుడు పరీక్షిన్మహారాజునకు చెప్పెను.

అట్టి ప్రభావముగల భగవత్పాదతీర్థమును శివుడు పరమభక్తితో ధరించెను. శివుడు శ్మశానవాసి. అతనితో చేరినవారు భూతప్రేతములు. 'శివం' అనిన మంగళమని యర్థము. నేను పేరునకు మాత్రము మంగళుడనుగ నున్నాను. భగవత్పాదతీర్థము పడిన యెడల ఆపేరు సార్థక మగును అని తలచి శివుడు శిరమున ధరించి పరమ మంగళు డాయెను. భగవంతుని తలచువారి మనసున మురికి అనగా కామక్రోధాదు లుండినను భగవత్పాద జలము ఆమాలిన్యమును కడిగివేయును. వారిపాపమును కొండను వజ్రాయుధమువలె పోగొట్టును. ఇట్టితీర్థమని బ్రహ్మ తలచి కడుగగా శివుడు ధరించెను అని వారు చెప్పగా రాజునకు మీద తోచలేదు. వాదముచేసి జయించలేము. నిర్బంధించి చేయించవలయును అని తలచి సరి; ఉండనిండు. మేమట్లు ఏర్పాటు చేసితిమి. చేవ్రాలు చేయుడు అని రాజనెను. 'శివా త్పరతరం నాస్తి' అని రాజనెను.'శివాత్పరతరంనాస్తి ద్రోణమస్తి తతః పరః'అని కూరత్తాళ్వారు వ్రాసిరి. శివ మనగా ఒకతూము. ద్రోణ మనగా రెండు తూములు. ఒకటికిపైగా రెండు ఉండునపుడు ఎట్లు లేదని చెప్పేదు నని కూరత్తాళ్వారు పరిహాసముగా వ్రాసిరి. రాజునకు కోపము వచ్చెను. వీరేదో శాస్త్రార్థము చెప్పుచున్నారు. వారిమతమున నున్నది అని తలచితిని. ''ఈరాజసభలో పరిహాసమా ? ఒక్క మరకాలుకంటెను అధికము లేదను మూఢుడనా! అధికప్రసంగము, వీరిద్దరికనులు పెరికివేయుడు'' అని రాజు ఆజ్ఞాపించగా దూతలు పట్టుకొనిపోయి పెరికిరి. ఇట్లు కొన్నిగ్రంథములలో నున్నది. రాజిట్లు చెప్పగనే ఇంతియేనా ? కనులుతీయు మంటివా ? సంతోషము. నీవు తీయకుండినను నేనే తీసికొనవలెనని తలచితిని. నీవు చేసినది అనుకూలమే. ఇట్టిపాపిని చూడరాదని తలచితిని అని చెప్పి కూరత్తాళ్వారు స్వయముగ నేత్రములను తీసికొనిరని యొక

గ్రంథము. శిష్యులు వారిరువురను శ్రీరంగమునకు పిలుచుకొని వచ్చుచుండగా బాధను సహించలేక మహాపూర్ణులకు మార్గమునందే చరమదశ వచ్చెను. శ్రీరంగమునకు పోయి చేరవలయునని శిష్యులు త్వరపడగా వలదు; నేనట్లుచేసిన ఇతరులును అచ్చటనే శరీరత్యాగము చేయవలయునని తలతురు. ఆచార్యభక్తి వారి చరణధ్యానము లుండిన చాలును. అదియే శ్రీరంగము అని చెప్పి యామునులను ధ్యానించుచు మహాపూర్ణులు పరమపదించిరి. వారి పుత్రుడు మొదలగువారు వారికి విధిప్రకారము సంస్కారము చేసిరి. కూరత్తాళ్వారుమాత్రము శ్రీరంగము చేరిరి అని శ్రీరంగము నుండివచ్చిన స్వామి చెప్పగా నాకొరకు ఆచార్యులు శిష్యుడు పోయిరే. నాకొఱకై సంకటపడిరే అని యతిరాజులు దుఃఖించి విశేషప్రవృత్తినిరతులై వేదవేదాంగపారంగతులగు పదివేలమంది స్వాములకు భోజనముపెట్టి వస్త్రాదులిచ్చి భగవదర్పణము చేసిరి. యతిరాజు లీమాట వినియును తోడనే శ్రీరంగమునకు పోవుటకు లేకపోయెను. పుత్రుడు తండ్రితో జగడములాడి నీముఖావలోకనము చేయనని పోవును. తండ్రి అట్లు చేయలేడు. రంగనాథుడు యతిరాజులకు తండ్రి. కనుకనే ఆయనను విడిచి త్వరగా వెళ్లిరి. చెల్వపిళ్ల కొడుకుగాన ఆయనను త్వరగా విడుచుటకు కాలేదు. కొడుకు తండ్రియొక్కరూపాంతరముగదా! కాన తండ్రికి తన మీదవలెనే పుత్రునిమీద ఆశయుండును. కాన నిచ్చట నొక యేర్పాటు చేసివచ్చెదనని శ్రీరంగమునుండివచ్చిన శ్రీవైష్ణవుని కూరత్తాళ్వారునొద్దకు పంపిరి. ఇట్లని కొన్నిగ్రంథములు; మరొకని పంపిరని మరికొన్నిగ్రంథములు. సిరియాండానును పంపిరని వడగలవారిమతము. మారుతి ఆండానును పంపిరని తెంగలవారి మతము. ఎవరినో ఒకరిని పంపిరి. దృష్టిపోయిన సృష్టిపోయినని ఒకసామెత. అనగా చచ్చినట్లే. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధాన' మ్మనిరి.

కనులుండిన వేదశాస్త్రములను చదువనగును. కూరత్తాళ్వారునకు కనులుపోయిన వని విని వారును పోయినట్లే యని యతిరాజులు దుఃఖించిరి. కూరత్తాళ్వారు తనయింటిలో కొడుకులు, కోడళ్ళు, భార్యతో నుండిరి. వారు సన్నిధికిపోగా ద్వారపాలకులు పోరా దనిరి. ఏలయని వారడుగగా మీరెవరితో చేరినవారు? రామానుజులతో చేరినవారని లోనికి విడువరాదని మారాజుగారి యాజ్ఞ అని వారనిరి. గురువును చేకొని స్వామిని వదలుదునా? స్వామినిచూచి గురువును విడుతునా యని కూరత్తాళ్వారు యోచించి సన్నిధిలోనికి పోయినయెడల గురువును విడిచితివా, పొమ్మ అని స్వామి అనును. ఈరంగనాథునిచేతనగు కార్యము యతిరాజుల చేత నగును. యతిరాజులచేత నగు కార్యము స్వామిచేతగాదు. రంగనాథా! రమ్మని యతిరాజు పిలిచిన స్వామి వచ్చును. కాన గురువే హెచ్చు అని తలంచి "అహం తు లక్ష్మణాచార్యస్య సంబంధీ నాత్ర సంశయః"_ నేను లక్ష్మణాచార్యుల సంబంధిని, అందుకు సందేహము లేదు అనిరి. అటులైన పోరాదు, పోరాదు పోరాదు అని వారు చెప్పగా సేవింప నక్కరలేదు; లేదు, లేదు అని వీరునుమమ్మారు చెప్పిరి. కూరత్తాళ్వారు ఆయూరువిడిచి అళగర్ సన్నిధియగు వృషభాద్రికి అందరిని పిలుచుకొని పోయిరి. కాని వారి మనసుమాత్రము శ్రీరంగమునందే యుండెను. "స్వామీ! నన్ను మరల శ్రీరంగము చేర్చుము. యతిరాజు క్షేమముగ రావలయును. నేనపుడు పోయెదను" అని ప్రార్థించుచుండిరి. ఇట్లు కొన్నిగ్రంథములు. శ్రీరంగమున నుండియే అట్లు ప్రార్థించు చుండి రని కొన్నిగ్రంథములు. యతిరాజు పంపినస్వామి శ్రీరంగమునకు వచ్చి కూరత్తాళ్వారునకు సమాధానము చెప్పిరని కొన్నిగ్రంథములు. వచ్చినస్వామి యతిరాజులసంగతి సాంగో పాంగముగ జెప్పగా వారు సుఖముగ నున్నారాయని కూరత్తాళ్వా

రడిగిరి. లేదు. మిగుల దుఃఖించుచున్నారు. పూర్ణాచార్యులు పోయి రనియు, మీకు కన్నులు పోయెనని వారిచింత. గురువుకు వచ్చినను, శిష్యునకు వచ్చినను భక్తివాత్సల్యములచేత తనకు వచ్చినట్లేయుండును. కూరత్తాళ్వారు ఈసంగతి విని కనులుపోయి నపుడు గూడ నేను దుఃఖించలేదే. అయ్యో! యతిరాజుల శరీరము నకు బాధకల్గిన ప్రపంచమునకు గల్గినట్టు లగునే. నాకన్నులు పోయిన నేమి ? అనిరి. రామునికి నాతలంపు గలదా అని సీతా దేవి హనుమంతు నడుగగా ఆయనకు ఆహారనిద్రలు లేవు. కృష్ణ పక్షమట్లున్నాడు అని హనుమంతు డనెను. "నాయనా! ఈ మాటలు విషముతోగూడిన అమృత మట్లున్నవి. నన్ను తలచు చున్నా రనగా అమృతముగ నున్నది. నాకై శరీరము కృశించిన దనగా విషమువలె నున్నది అనెను. అట్లే యతిరాజులు అప్రతి హతశ్రీగా నున్నారని సంతోషమును, దుఃఖించుచున్నారని దుఃఖమును కూరత్తాళ్వారు పొందిరి. సృష్టించినస్వామి నేనుండు వరకు యతిరాజులు ఉండవలెను. నాకు కన్నులు, ప్రాణము పోయినను పోవుగాక ! యతిరాజు అప్రతిహతశ్రీగా నుండునపుడు నేను వెళ్లవలెను. నాకదియే చాలును" అని చెప్పి యతిరాజులను చూచితిరా ? అని అడిగిరి. ఆయనయేగదా నన్ను పంపిరని స్వామి చెప్పగా ప్రవచనము జరుగుచున్నదా యని కూరత్తాళ్వా రనిరి. అదేమి వైభవము ? అని ఆస్వామి సంగతి యంతయు చెప్పి శ్రీరంగమున కంటెను ఒకింత అధికముగనే యున్నదని ఆ స్వామిచెప్పెను. "ఓరీ! ఈసంతోషవార్తను తెలిపిన వీరికి బహు మాన మిచ్చుటకై జోడుసాలువులను తెమ్మనిరి. సీతాదేవి రాముని యుంగరమును జూచి ఆయనను చూచినట్లే తలచి దానిని ముద్దుపెట్టుకొని ఆలింగనము చేసికొన్నట్లు యతిరాజులయొద్ద నుండి వచ్చిన స్వామిని యతిరాజులుగనే భావించి కూరత్తాళ్వారు

వారి కనేకములైన యుపచారములను చేసిరి. ఆస్వామి వెళ్లెను. క్రిమికంఠుడు శ్రీరంగముదప్ప చోళదేశములోని సకలవైష్ణవస్థలము లను నాశముచేసెను. శ్రీరంగమునకు పోయి నాశముచేయ వలెనని ప్రయాణ మాయెను. వైష్ణవకంటకుడు సైన్యములతో ప్రయాణమై శ్రీరంగమునకు సమీపమందున్న గ్రామమున నిలిచెను. వాని కారాత్రి గండమాల (గొంతులో వ్రణము) పుట్టి క్షణక్షణమునకు అధికమాయెను. దానిలో అనేకక్రిములు పుట్టెను. కడుపునొప్పి కలిగెను. దొంగ దొంగతనమును నవ్వుతు చేసి వెనుక దుఃఖించును. కర్మముచేయునపుడు నవ్వుతూ చేసి అనుభ వించునపుడు దుఃఖింతురు. అట్లే క్రిమికంఠుడు నవ్వుతుచేసి బాధపడుచు చచ్చెను. క్రిమికంఠుడు రేపువచ్చి నాశముచేయు నని స్వాములు భయపడుచుండిరి. వాడు చావగా ఉడయవరుల ప్రభావమువలన చచ్చె ననిరి. కొందరు స్వాములు యతిరాజుల కీసంగతి తెల్పుటకు వెడలిపోయి మహాపాపి, విశిష్టాద్వైతమును పాడుచేయవచ్చిన ఆమహాపాపి చచ్చెను అని చెప్పిరి. వీరి కేమిత్తునని యతిరాజులు యోచించి సొలువు కప్పుదునా? అది సరియైనదిగాదు అని తలంచి "చూచితిని సీతను" అని హనుమంతుడు చెప్పగా రాముడెట్లు అలింగనము చేసికొనెనో, రావణుడు పోయె నని విని సీత యెట్లు ఆశీర్వదించెనో అట్లు యతిరాజు లీమాటవిని నాకు మాత్రమే గాదు మన వైష్ణవసిద్ధాంతమునకే క్షేమము గలి గెను. ఇందుకు తగిన బహుమానము మీకేమి ఇత్తును అనిరి. రుక్మిణీదేవి తనకు భర్తనుగూర్చిన బ్రాహ్మణునికి ప్రీతిగా ఏమి యిచ్చుటకును లేక నమస్కార మర్పించెను. వీరును అట్లే సంతోష వార్త తెలిపినవారిని సమీపమునకు పిలిచి ద్వయమంత్రమును చెప్పిరి. రత్న మనిన నీమంత్రమే రత్నము. నాయొద్దనున్న రత్న మిది. మీ కుపదేశమై యుండును. అయినను మరలచెప్పెద

పని చెప్పిరి. వేదతీర్థమును ఈతీర్థము నొద్ద ఈసంతోషవార్త వింటినిగాన దీనికి నేటినుండి కల్యాణతీర్థమని పేరు అనిరి. పిమ్మట మూలవిగ్రహమును, ఉత్సవమూర్తులను సేవించి నేనిచ్చటికివచ్చి పండ్రెండుసంవత్సరము లాయెను. నిత్యోత్సవ, పక్షోత్సవము లాయెను. అనుజ్ఞ నిండని యడిగిరి. పిమ్మట కూరత్తాళ్వారు కోవెలలో అల్లాడుచున్నాడు. తామసించరాదని తలంచి ప్రయాణము చేసిరి. అక్రూరాగమనముచేత శ్రీకృష్ణమూర్తి బయలుదేరగా గోపికలు దుఃఖించినట్లు యతీంద్రులు బయలుదేరగా "యతీంద్రా! మీవియోగముచేత క్షణము నిలువజాలము. జలములోనుండు మత్స్యములను బయటవేసిన నిలుచునా" అని ఆయూరివా రనిరి.

చెల్వపిళ్ల యుండలేదా పొండి అని రామానుజులు అనగా మీరుతప్ప మాకేమియు వలదు. పాలు గొప్పవైనను మత్స్యము లందు ప్రాణముతో నిలువవు అనిరి. యతిరాజు లపుడు తమ అర్చావిగ్రహ మేర్పరచి ఈవిగ్రహము మీతో మాట్లాడునని చెప్పి శ్రీరంగమునకు పోగా మొదలియాండాన్ గొడుగు పట్టెను. ఎంబారు, వారితమ్ములు వింజామరలు వేసిరి. లోపల ప్రవేశించగా దుందుభి మొదలైన అష్టాదశవాద్యములు మోగెను. వేదపారాయణము జరిగెను. పెక్కువేలమంది యతిరాజులు వచ్చిరనియు, క్రిమికంఠుడు చచ్చెననియు సంతోషముగలవారై వైభవము జరిపిరి. పుష్పవర్షము గురియించిరి. యతిరాజులు తమతో జేరిన సకలపరివారముతోడ "రంగనాథా" యనుచు శ్రీరంగములో ప్రవేశించిరి. రంగనాథుని సన్నిధికిపోగా స్వామియును, తాయారును పుత్రునిజూచి సంతోషించునట్లు సంతోషించిరి. "రామానుజా: బహుకార్యములు సలిపి వచ్చితివి. నీవు వచ్చి చాల ప్రొద్దైనది, మఠమునకు పోవచ్చును. ఇతరభక్తులు సేవింపవలయును,

పొమ్మనిరి. యతిరాజు లొక్కసారి ఊరిని చుట్టివచ్చిరి. కొందరు తమ్ము సేవించుస్థితిలో నుందురు, కొందరు ఉండరు అని వారట్లు చేసిరి. రామునిజూచిన ప్రజలవలె స్త్రీలు, వృద్ధులు, బాలురు యతిరాజువచ్చి చేరి రని ఆనందించిరి. ముఖ్య శిష్యులైన కూరత్తాళ్వారును జూచి మఠమునకు పోవుద మని తలచి యతిరాజులు వారి యింటికి పోయిరి. కూరత్తాళ్వారుకు కన్నులు లేనందున యతిరాజులు వచ్చిరని ఇతరులుచెప్పగా పరమమంగళకర మగు వారిఆగమనమును కూరత్తాళ్వారు విని గబగబలేచి పాదములను సేవించిరి. యతీంద్రులు కూర్చుండగా ఆయన నిలిచియుండిరి. పండ్రెండేండ్లుగ అప్రతిహతశ్రీగా ఉండివచ్చిన గురువును జూచుటకు లేదే యని కూరత్తాళ్వారు దుఃఖించగా శిష్యుడు చింతపడుచున్నాడని యతిరాజులు సంకటపడిరి. "నాకన్నులు పోవుటకు కారణమున్నది. కర్మమది. జన్మాంతరకర్మము గాదు. ఈజన్మమున చేసినదే. నేను వైష్ణవదీక్షకు మునుపు శ్రీవైష్ణవులు ఊర్ధ్వపుండ్రములను ధరింపగా జూచి ఇదేమి వికార మని పరిహాసము చేసితిని. విష్ణునెడ అపచారపడవచ్చును గాని, వైష్ణవులయెడ అపచార మొనర్పవచ్చునా ? అదియును సాధారణమైన అపచారముగాదు. ఊర్ధ్వపుండ్రమునే చూచి పరిహసించితిని–" అని కూరత్తాళ్వా రనిరి. "నాకట్లు తోచలేదు. నీవు ముందు పరిహసించి యుండినను పిమ్మట మంత్రార్థమును తెలిసి గురుశుశ్రూష చేసి యున్నావు. అప్పటికిని పాపము పోకుండునా ? నా దౌర్భాగ్యమే అందుకు కారణము. ఇట్లు నిన్ను చూడవలసి వచ్చెను" అని యతిరాజు లనిరి. పిమ్మట కూరత్తాళ్వారునకు సమాధానము చెప్పి వారిచేయిపట్టుకొని మఠములో ప్రవేశించిరి. చిత్రకూటమునుండి కొందరువచ్చి స్వామిని స్థాపనముచేయు డనిరి. స్వామి యెచ్చట నున్నాడని యతిరాజు లనగా క్రిమికంఠుడు మూలవిగ్రహమును

దాచి ఉత్సవమూర్తిని సముద్రమున వేయదలచెను. తిల్లయను దాసి ఆసంగతితెలిసి వానియొద్దచేరి సరసముగ మాట్లాడుచుండెను. నీకేమికావలయునని వా డడుగగా ఈగోవిందరాజును నాకిచ్చిన వేడుకగా నుంచుకొనెద ననెను. వాడు దాని హావభావలీలావిలాసాదులకు లోనై మోహముచేత నిచ్చెను. వాడు మరల అడుగునని తలచి ఆదాసి యావిగ్రహమును అర్చకుల కిచ్చి ఈస్వామిని తిరుపతికి పంపు డనెను. ఆవిగ్రహ మచ్చట నున్నది- స్థాపింపు డని వచ్చినవారు చెప్పగా యతిరాజులు తిరుపతికిపోయి క్రింది తిరుపతిలో గోవిందరాజును స్థాపించిరి. తిల్లఅనుదాసి కాపాడినది గాన తిల్లగోవిందరాజులని స్వామికి పేరుంచి కొండకు పోయి స్వామిని సేవించి ఆళ్వారుల అర్చామూర్తులను స్థాపించి శ్రీరంగమునకు వచ్చి అనేకార్థములు శిష్యులకు జెప్పుచు సుఖముగ నుండిరి. కొందరు శిష్యుల నేర్పరచి కొన్ని అధికారములనిచ్చి వారికి ఒక పేరుంచి కోలాహలముగ నుండిరి. కాంచీపురస్వామికి వరదుడని పేరు. అడిగిన దిచ్చుటకు కంకణము కట్టుకొనియున్నాడు. మీకన్నులు పోయినవి. ఏమిచేయవచ్చును ?

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరన్తి తే ॥

అను 7అధ్యా. 14శ్లోకము, మరియు

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్ ॥

అను 9అధ్యా. 22శ్లోకమువలె అనన్యభావముతో తలంచవలెనని నాయొద్ద వినియుండలేదా ? వరదునిమీద స్తోత్రము రచింపుడు. కన్నులిచ్చును. క్రిమికంఠునిజూచిన కన్నులు వల్లదని తలంచితిరి. యతిరాజును చూడవలయునని తోచుట లేదా ?

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥

అను 13అధ్యా. 22ప్రశ్లోకమట్లు ప్రకృతి చెడ్డది. శరీరము వలదు అనిన యెడల కరణకళేబరముల సంబంధముచేతనేగదా శ్రవణమననాదులు చేయనగును. సత్కర్మములు చేయనగును. భార్య చెడ్డదనితలచి వలదనిన ఔపాసనాదులు సల్పవలదా ? అతిథ్యభ్యాగతులను ఆరాధించవలదా ? ఎంతవరకు దానితో కార్యమో అంతవరకు చేయించుకొనవలెను. బొత్తిగా వలదనరాదు అని స్వామి చెప్పియుండలేదా ? నాశిష్యుడవై యుండి కన్నులు పోయెనే. పూర్వమువలె చూచుటకు లేదాయెనే. కావున స్వామిని స్తుతింపుడు అని యతిరాజు కూరత్తాళ్వారుతో ననిరి. నేనేమి వ్రాయగలనని కూరత్తాళ్వారనగా గురుసన్నిధానమున నైచ్యాను సంధానము మంచిదే, విద్వాంసుడవు, మీకు తెలియదా ? స్తోత్రముచేయుడని యతిరాజు లనిరి. స్తుతించిన కన్నులిచ్చునా యని కూరత్తాళ్వా రనగా "ఏమీ ! సందేహమా ? స్తుతింపుడు. కన్నులిచ్చునో, లేదో తెలియు నని యతిరాజు లనిరి. స్వామీ! నీసమానులులేరు. ఇక పైవా రెక్కడిది ? భగవంతునిశక్తులు పలువిధములు. అవి స్వాభావికములు, మరియొకని అనుగ్రహముచే వచ్చినది గాదు అనునిట్టి యుపనిషదర్థములను చెప్పిరి. "స్వామీ ! జ్ఞానము, కర్మము లేదు. భక్తిలేదు. నేనిట్టివాడనని నన్ను కాపాడుటకు న్యాయములేదు. మీరు కరుణాసముద్రులు. కాన కాపాడుదురని వచ్చితిని. కర్మజ్ఞానభక్తులు లేక కడతేర నగునా ? యని అడిగెద వేమో! రామునికాలమున తృణము మొదలు వైకుంఠమునకు పోయెనే. అవి యేకర్మమును చేసెను ? నన్నును అట్టిజడవస్తువువలెనే కాపాడవలయు ననిరి. "స్వామీ! నీమాయయేమి ? మరణకాలమున అందరును చుట్టూ కూర్చుండి

యుందురు. కంటినీరుతో బంధువు లుందురు. అంత్యకాలము గాన నారాయణా అని స్మరింపుడు అని చెప్పక నాకేమి ఏర్పాటులు అందురు. స్నేహితుడు నేనెవరినో చెప్పు మనును. కాలపాశవశంగతుడై బదులుచెప్పలేని దశ రాబోవుచున్నది. నేనుపోయిన పుత్రునిగతి యేమి అనుకొనును. అనేకపాపములు చేసితిమే, యము డున్నాడే, ఏమార్గమున పోవుచున్నామో! నాకేమిగతి యని తోచదు'' అని కూరత్తాళ్వా రిట్లు వరదరాజస్తవ మొనర్చి స్వామి కర్పించిరి. "మీస్తోత్రము నంగీకరించితిని. మీరు నిస్పృహులు. నాజూకైన కాలము. ఏమి కావలయును ? నన్నుజూచుటకు కన్నులుగదా కావలెను ? దివ్యచక్షుస్సు నిచ్చెదను. దానితో సేవింపనగును'' అని స్వామి అంతర్ధాన మొందెను. తెల్లవారగనే యతిరాజులు, కూరేశులు వరదుని స్తుతించిరని విని, స్వామి వచ్చి యుండునే. మీకు కన్నులిచ్చెదనని చెప్పలేదా అని అడిగిరి. కూరేశులు ఈలోకమును చూచుటకు తగిన కన్ను లీయలేదు. దివ్యచక్షుస్సు నిచ్చెను. దానితో స్వామిని సదాచూడనగును. ''జ్ఞానాన్మోక్షం'' అని యున్నదిగదా! నాకన్నులు నిచ్చియేమి అని కూరత్తాళ్వారు చెప్పిరి. ఇచ్చట నుండియే స్వామిని రప్పించి స్తోత్రముచేయగా వరదుని కిష్టములేకున్నది. కానిమ్ము. కంచికి పోయి యడిగెదను అని యతిరాజులు కూరత్తాళ్వారును కంచికి పిలుచుకొనిపోయిరి. ఆయన యతిరాజులు లేనిసమయమున సన్నిధికిబోయి ''స్వామీ! నాలూరాన్ మిగుల చెడెను. నాశిష్యుడై చెడరాదు. నే నేలోకమునకు పోదునో ఆలోకమునకు రావలయును'' అని యడుగగా కరుణాసముద్రుడు వరదుడు అడిగిన కోరిక నిచ్చుటకు సిద్ధముగ నుండువాడుగాన స్తోత్రమును విని 'అట్లేకానీ'మ్మనెను. కూరత్తాళ్వారు వరముగైకొని రాగా సన్నిధికి రమ్మని యతిరాజులు పిలిచిరి. నేను పోయితిని. మన్నింపుడు.

నాలూరాన్ నేబోవు లోకమునకు రావలయుననని అడిగితిని అని కూరత్తాళ్వారు చెప్పిరి. అట్లుచేసితిరా యని యతిరాజులు కోపించగా నేను సదా స్వామిని చూచుచున్నానే. నాశిష్యుడు చెడరాదని అడిగితినని కూరత్తాళ్వారనిరి. శిష్యుడు తన్ను చూచుటకు వల్లకాదని తలచి "యేమి వరదరాజా! నేను రానిదే వరమీయనని చెప్పియుండరాదా! ఎవనికి జ్ఞానమున్నదో- వానికి మోక్షముగదా! ఈజ్ఞానచక్షుస్సు సరిపడదు. వేరుకన్ను లిచ్చిననే పోయెదను" అనెను. శిష్యుడైన కూరత్తాళ్వారుమీద యతిరాజులకు ఉండునట్లు శిష్యుడైన యతిరాజులందు వరదునికి కృప యుండదా ? "స్వామీ! వానిశిష్యునికై వాడడిగెను. నాశిష్యునికై నే నడుగుచున్నాను. నీశిష్యునికై నీవు కన్నులనిమ్ము" అని యతిరాజు లడుగగా స్వామి సమ్మతించెను. కూరత్తాళ్వారుకు కన్నులు రాగా స్వామిని ఆపాదమస్తకము సేవించి "ఆహా! ఏమి దివ్యసేవ! ఏమి దివ్యమంగళవిగ్రహ:" మనిరి. "నేను రాకుండినను, ఇంతజగడము వేయకుండినను కన్నులురావుగదా! బాగుగ సేవింపు" మని యతిరాజులనిరి. కూరత్తాళ్వారు తిరిగి చూడగా చంద్రోదయమైనట్లు సకలతాపపరిహార మాయెను. సూర్యుడు ప్రకాశించగా తలుపులు మూసికొందురు. చంద్రోదయమైనయెడల పైమిద్దెమీద పరుండుదురు. ఊర్ధ్వపుండ్రములు, త్రిదండము, యజ్ఞసూత్రము, పద్మనేత్రములతో గూడిన వారిని ఆనందముతో సేవించుచుండిరి. యతిరాజులు కూరత్తాళ్వారును పిలుచుకొని శ్రీరంగమునకు వచ్చి చేరిరి. యతిరాజులు మరియొకసారి దివ్యదేశయాత్ర చేయవలయునని తలచి ఆళ్వారు తిరునగరికి సమీపమున నుండు పుళియుంగుడి అనుగ్రామమునకు పోయి అచ్చట నొక ఇంటివాకిట నిలచియుండిన చిన్నదానిని చూచి అందమైన కన్నులు గల బాలికా! ఆళ్వారుతిరునగరి ఇచ్చటి కెంతదూరమున

నున్నదనిరి. అందుల కాబాలిక మీరు తిరువాయ్మొళిని సేవించి తిరా! అనెను. ఊరు ఎంతదూరమున నున్నదనగా తిరువాయ్మొళి ఆయెనా అనుచున్నావు ? అది తెలిసిన ఊరెట్లు తెలియునని యతిరాజు లడుగగా దీనికిని, అక్కడికిని పిలుచునంతదూరమున్న దని దానియందే చెప్పబడి యున్నదే తెలియదా యని ఆబాలిక పలికెను. నమ్మాళ్వారును పిమ్మట సేవింపవచ్చును అని తలచి ఇట్టి బిడ్డను కన్నవారిని చూడదలచి వారింటికి పిలుచుకొని పోయిరి. ఆబాలిక తల్లిని తళియ చేయుమని వరదునికి ఆరగింపు చేసి తాము ఆరగించి బాలికకు అనేక విషయములు ఉపదేశించిరి. దేవతలకును లభించని విషయములు మనఃపూర్వకముగ చెప్పిరి. పిమ్మట కురుకాపురికి పోయి నమ్మాళ్వారును, తిరుప్పుళిని సేవించి ప్రపన్నకుల కూటస్థుల మేలును దలచిరి. వారిపేరు సార్థకముగ నుండవలయునని తలచి నాకు పుత్రుడుండిన వారిపేరు పెట్టుదునే అనిరి. పుళ్ళాన్ అను తిరుమలనంబికొడుకు నేనున్నాడనే యనెను. మంచిది; రమ్ము అని పిలచి వారికి తిరుక్కురుగుపైప్పిరాన్ పుళ్ళాన్ అని నమ్మాళ్వారు పేరు పెట్టిరి. ఇంతకుముందే నమ్మా ళ్వారు పేరుఉంచిరనియు, ఇప్పుడు తిరువాయ్మొళికి ఆరాయి రప్పడి చేయించి నమ్మాళ్వారుల చరణారవిందములందు ఉంచిరని కొన్నిగ్రంథములు. ఇప్పుడు పేరుపెట్టి ఆరాయిరప్పడి చేయు మన్నట్లు కొన్నిగ్రంథములు. వారట్లు పోయి పోయి వారివారిని అనుగ్రహించి ఆయాస్వాములకు మంగళాశాసనము చేసి శ్రీరం గమునకు వచ్చి శిష్యులకు ఉపదేశించుచు మతమునందు సుఖముగ నుండిరి. సేతుశీతాచలమువరకు వారికి ఎదురు చెప్పువారు లేకుండిరి. అట్లు యతిరాజచంద్రులు ప్రకాశించుచుండిరి. డెబ్బది నలుగురు సింహాసనాధిపతులును, నలువురు భాష్యసింహాసనాధి పతులును, ఏడువందలమంది సన్యాసులును, పండ్రెండు

పందలమంది పరమైకాంతులును, ఇంకను అనేకశిష్యులును ఉండిరి. ఇట్టి విభవముతో శ్రీరంగమున నుండిరి. ఇందరు శిష్యులలో గొప్పవారి నేర్పరచి డెబ్బదినలుగురను సింహాసనాధిపతులుగ చేసిరి. వారిలో తిరుక్కురుగుప్పిరాన్ పుళ్ళాన్, నడాదూరాళ్వాన్, మొదలియాండాను, కిడాంబి ఆచ్చాను అనువారిని శ్రీభాష్య సింహాసనాధిపతులుగ చేసిరి. ఆనలుగురిలో తిరుక్కురుగుప్పిరాన్ పుళ్ళాన్ అనువారిని ఉభయవేదాంతములకు ఏర్పరచిరి. వారు అష్టోత్తరశతనామములచేత యతిరాజులను పూజించుచుండిరి. ఇట్లు మహామాహాత్మ్యము గల్ల శిష్యులతోడ వాసము చేయుచుండగా, భగవత్సంకల్పము చేత కూరత్తాళ్వారు ఏకాకిగ స్వామిసన్నిధికి పోయిరి. స్వామికి ఈయనయందు అనుతాపము, అనుగ్రహము. ఇతని ఆచార్య పారతంత్ర్యమేమి ! రామానుజులు నాకు ప్రాణము; వారి ముఖ్యశిష్యుడు రామానుజుని కాపాడెను అని స్వామికి ప్రీతి. కూరత్తాళ్వారు స్వామిని చూచి పరమపదము నిమ్మని అడిగిరి. ఇచ్చటనే యుండరాదా యని స్వామి యనగా, మిగుల శ్రాంతుడనైతిని. యతిరాజులను చూచి తృప్తిపొందితిని. లీలావిభూతిలోనుండి ఆయెను. పరమపదమునకు పిలుచుకొనుడు అనెను. స్వామి ఇందుకు సమ్మతింపగా కూరత్తాళ్వారు ఇంటికి పోయిరి. యతిరాజుల కీసంగతి తెలిసి, మిగుల చింతించిరి. వీరిని విడచి యెట్లుందును అని కూరత్తాళ్వారింటికిపోయి "సన్నిధికి పోతిరా, యేమడిగితిరి ? నాతో యోచించ్రి చేసితిరా ? అంత అవసర మేమి ? ఇట్లు చేయునగునా ?" యని యతిరాజు లనగా కూరత్తాళ్వారు పలుక కుండిరి. "ఏల అడిగితి"రని యతిరాజు లనగా "ఏమో భగవత్ప్రేరణచేత అడిగితిని, తమ చరణసంబంధముచేత వైకుంఠమునకు పోవుభాగ్యమును పొందితిని. నారపాటైన యెడల మన్నింపుడు" అనిరి. వీరిని

పోవలెననిన స్వామి ఉత్తరువునకును, వీరి మనోరథమునకును ఆటంక మగునని తలచి ''సరి; పోయెదరా'' అని ద్వయ మంత్రము చెప్పిరి. ''గొప్పవిషయములను పలువురు చెప్పవల యును. గాన ద్వయమును మరల చెప్పిరి. రంగనాథుని ఉత్త రువు ఆయెను. మీరు తృప్తిగ చెప్పినయెడల సుఖముగ పోయె దను'' అని కూరత్తాళ్వా రనగా నేను అప్రతిహతశ్రీగా నుండునపుడు పోయిన మీకు సంతోషము. వెనుక అయిన దుఃఖముకదా ? స్వామి ఉత్తరు విచ్చిరి. పొండియని యతిరాజు లనిరి. అట్లుకాదు. పొమ్మనవలయునని కూరత్తాళ్వా రనగా సుఖముగ పోయి అను భవింపుడని చెప్పి యతిరాజులు వారి యనుమతిపొంది మఠమున కేగిరి. ప్రవచనము లేదు, కూరత్తాళ్వారు మాటలే. స్వామి ఉత్తరు విచ్చిరి. ఇక అట్టిశిష్యుడు లభించునా ? అని కూరత్తాళ్వారు యొక్క కల్యాణగుణములను ఎత్తిచెప్ప నారంభించిరి. కూరత్తా ళ్వారు తమ బిడ్డలను పిలచి ఆబిడ్డలకు ఇట్లు చెప్పిరి. ''మీతల్లి మహాపతివ్రత. నామాటవిని గిన్నెను పారవేసెను. స్వామిని ప్రసాద మడిగెను. అట్టియామె మీతల్లి. నేను పోయెదను తల్లిమాటను వేదవాక్యముగ తలంపుడు. మీరు ఉచిత విహిత క్రియలను చేయుచుండుడు, కార్యములు తప్పినను యోచనలేదు. త్రికరణశుద్ధిగా శ్రీవైష్ణవుల కపచారము సేయకుడు. బిడ్డలారా! ఉభయవరుల చరణ సంబంధము, ఉభయవేదాంతముల సంబం ధము ఉండవలయును. వైష్ణవుడు అను అర్థము సరిగా నుండ వలయును. ఆసంప్రదాయమును కాపాడువారు శ్రీవైష్ణవులు. నామమాత్రముచేత కాదు. కర్మజ్ఞాన భక్తిమార్గములవలన ప్రయో జనము లేదు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను ప్రపత్తిని స్వామి ఏర్పరచిరి. దానినే వరదుడు చెప్పెను. దానిలో ఊడుపడితిమి. స్వామి కాపాడును అని నమ్మియుండు వైష్ణవులయెడ త్రివిధాప

చారములను చేయుకుడు. మనసున నొకటి తలచి, నోటితో నొకటి చెప్పుట, ఇంకొకరీతిగ చేయుట దురాత్ముల లక్షణము. మనసున తలచునదే నోటితోచెప్పుట, అటులే చేయుట మహాత్ముల లక్షణము. శ్రీవైష్ణవులు చెడవలెనని తలపరాదు. వారిని తిట్టరాదు; శరీరమును బాధించరాదు. ఏమియో తప్పితిమని తలపరాదు. ఉండువరకు తల్లిమాటను పైలోకమునకై వినవలయును. శ్రీవైష్ణవుల విషయమున అనుకూలురై యుండుడు అనిరి. వారికి చరమదశ వచ్చెనని ఇరువురు పుత్రులు జాగరూకులై యుండిరి. పుళ్ళపిళ్ళై ఆళ్వార్ అను ప్రధాన శిష్యుని తొడపై తలనుంచుకొనిరి. ఆండాళమ్మ తొడపై కాళ్ళనుంచుకొనిరి. కాశిలోనైనను, పుత్రసన్నిధిలోనైనను ప్రాణము విడుచుట హెచ్చు. భగవదనుగ్రహము ఉన్నదనుటకు గురుతు. అనాయాసమరణము కలుగవలయును. భోజనమెట్లు జరుగునని యోచించు నంతటి స్థితిలో నుండరాదు. ప్రాకృతవిషయములం దెంతమాత్రమును మనస్సును చొరనీయక, భగవంతుని పాదపద్మముల యందును, ఆచార్యుల తిరువడిగళ్లయందును మనస్సును నిశ్చలముగ నిలిపియుంచవలెను. నీయెడ భక్తియుండిన చాలును అని వాయుపురాణమున చెప్పిరి. అట్లే కూరత్తాళ్వారు ఒకవిషయమునను కొదువలేక భగవచ్చరణారవిందము, యతిరాజు చరణారవిందము మనసున దలచుచు శరీరమును విడిచి పరమపదమునకు పోయిరి. సంస్కారమును చేయించువారు యతిరాజు; చేయువారు భట్టరు. సకలసంస్కారములాయెను. సన్నిధికిపోగా "నాయనా! కన్నతండ్రి పోయెనని చింతించకుము. స్వీకారజనకుడనైన నేను ఉన్నాను. నేను పోవువాడను కాను" అని రంగనాథుడు భట్టరు నోదార్చెను.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి ॥

అను భగవద్గీత 2అధ్యా. 26వ శ్లోకమునందువలె పుట్టిన వానికి చావును, చచ్చినవానికి పుట్టుకయు నిశ్చయము. కూరత్తాళ్వారునకు ఏ కొదవయును లేదు. భగవంతుని యాజ్ఞచేత పోయెను అని యతిరాజులు పరాశరభట్టరునకు సమాధానము చెప్పి, వారిచేయిపట్టుకొని పోయిరి. ఎంబారును పిలచి "గోవిందా! నీ చేయి చాచుము. నాకు పిమ్మట శ్రీవైష్ణవ సిద్ధాంతమునకు తగునట్లుగా నీ వితనిని చేయుము; నీకు ఒప్పగించితిని" అని యతిరాజులు భట్టరును వారిచేతికి ఒప్పగించిరి. ఉడయవరుల చరితమున కూరత్తాళ్వారు చరిత్రము ఏల వ్రాయవలయును అనగా ఉడయవరుల చరిత్రమున కూరత్తాళ్వారు చరిత్రము ముఖ్యము. ఈచరిత్ర సంపత్తి నిచ్చును. దినదినమునకు ఐశ్వర్యము వృద్ధియగును. పుత్రపౌత్రధనధాన్య భాగ్యములు కలుగును. జ్ఞానము కలుగును. సకలపాపపరిహారమగును. మరల తల్లి గర్భమున పుట్టరు. మరల సంసారము లేకుండ చేయును.

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥

భగవద్గీత 11అధ్యా. 54 వశ్లోకమువలె సంపూర్ణ భగవదనుభవము కలుగును. ఇట్టి కూరత్తాళ్వారు చరిత్రమును భక్తితో చెప్పువారికిని, వినువారికిని, పారాయణము చేయువారికిని పైచెప్పబడిన లాభములు కలుగును.

యతిరాజులు మరల మరల యాత్రపోవుచుండగా వైష్ణవులు తిరుమలక్రింద నొకపెరుగునమ్ముదానిని జూచి పెరుగు నిచ్చెదవా యని యడిగిరి. తొండ్యూరుకొండిఅను ఆయాడుది వెల నడుగకయే మనఃపూర్వకముగ శ్రీవైష్ణవులకు పెరుగు నిచ్చెను. శ్రీవైష్ణవులు సంతోషముతో గైకొని క్రియ మేమని యడిగిరి. సంసారసంబంధము తొలగి మంచిగతికి నేను పోవునట్లు

చేయుడు. మిమ్ము చూడగా నాకట్లు తోచుచున్నది; మోక్ష మొ గుడు అని ఆకొండి యనెను. "నీకు మోక్షము కావలెనని తోచెను. నీవు పోదగుదువు. మోక్షమును నే నిచ్చుటకు కాదు. దానినిచ్చు వాడు కొండమీద నున్నాడు, వాని నడుగుము" అని యతిరాజు లనిరి. "ఆయన మాట్లాడడు. మీరు చీటివ్రాసి యిండని కొండి అడుగగా యతిరాజు వేంకటేశ్వరునికి జాబువ్రాసి ఇచ్చిరి. అంద రును ఇదేమని యోచనతో చూచుచుండిరి. కొండి స్వామిపుష్కరి ణిలో స్నానము చేసి ప్రదక్షిణముచేసి చీటిని సన్నిధిముం దుం చెను. ఇది యేమని అర్చకు డడుగగా యతిరాజు లిచ్చిరని కొండి చెప్పెను. ఆ చీటిని అర్చకు డీయగా స్వామివారు చేయిచాచి తీసికొనెను. వైష్ణవసిద్ధాంతప్రతిష్ఠాపనాచార్యులు నమ్మి చీటి నీయగా స్వామి గైకొని మోక్షమిచ్చితి ననగా ప్రకాశముతో విమా నము వచ్చెను. కొండి దానిలో కూర్చుండి పరమపదమునకు పోయెను. దీనికి కర్మజ్ఞానభక్తి ప్రపత్తు లున్నవా ? పెరుగు నిచ్చిన మోక్షమా ? యతిరాజు లిట్లు వ్రాసి ఇచ్చెనే! అని వేంక టేశ్వరుడు తలచెనా ? ఎంతమాత్రమట్లు తలంప లేదు. వైకుం ఠమునుండివచ్చి సకలము చేసినాడు. నన్నొకటి అడిగిన ఈయ వలయునని కాచియుంటిని. గొల్లది దొరకెను. మోక్ష మిచ్చితిని అని తలచిరి.

కాంచీపురమున నొకవైష్ణవుల యింట నొకమూగబిడ్డ పుట్టెను. ఆబిడ్డ వర్చస్సుతోను, సూక్ష్మబుద్ధితోను ఐదారేండ్లు పెరిగి ఒక నాడు కనబడకపోయెను. రెండేండ్లు కనబడకుండి మరియొక నాడు వీథిలో ఆడుకొనుచుండెను. బిడ్డ దొరికినదని యెల్లవారును ఆబిడ్డను చూడవచ్చుచుండిరి. మూగయైయుండిన బిడ్డ యెల్లవారి తోను బాగుగ మాటలాడగా "రెండేండ్లుగా కనబడకుంటివే ! అది యునుగాక మూగయై యుంటివే! ఇపు డెచ్చటనుండి వచ్చితివి ?

మాటలెట్లు వచ్చెను ?'' అని వారడిగిరి. నేను ఐయఃల్దేరి క్షీరసము ద్రముునకు పోయి శయనించియుండు స్వామిని సేవించుచుంటిని. స్వామి ఆదిశేషు నాజ్ఞాపించగా ఆయన శ్రీపెరుంబుదూరులో పుట్టిరి. ఆయననే రామానుజులని అచ్చటివా రనుకొనుచుండిరి అని ఆబిడ్డ చెప్పెను. వానితల్లిదండ్రులు పిలువగా అంతర్ధాన మాయెను. అది బిడ్డగాదు. రామానుజులమహిమను తెలుపుటకు వచ్చిన దేవత. పై రెండు గాథలచేత రామానుజులు సాక్షాత్ శేషాంశ మని తెలియుచున్నది. తిరువరంగత్తముదనార్ అనువారు రామానుజ నూత్తందాదిని చేసిరి. దానికి "ప్రపన్నగాయత్రి'' అనిపేరు శరణాగతులకు కావలసినది. దానిని చేర్చిననే నాలాయిరమని లెక్కయేర్పడును. అది రామానుజులమీది స్తోత్రము. దానిని రామానుజులు సమ్మతించవలదా ? అతిశయోక్తి అనిన నెట్లు ? అనగా యతిరాజులు ఆస్తోత్రము అధికముగా నున్నదేమో అని తలచి స్వామిమీద నయిన మంచిది; నామీద అట్లుండిన నెట్లు ? అని తలచి ఆగ్రంథమును తెప్పించి చదివి— "సరి; ఒప్పితిని. దీనిని పారాయణము చేయవచ్చును'' అనిరి. బహుదినము లైనందున రామానుజులకును పరమపదమునకు పోవలెనని తోచెను. వారు స్వామి సన్నిధికి పోయియుండి "స్వామీ ! నేను రావలదా? యనిరి. వలదని స్వామి చెప్పెను. అన్నికార్యము లాయె, నిక వచ్చెద నని యతిరాజు లనగా స్వామి రమ్మనెను. విల్లిదాసుడు ఏకాంతుడుగాన సంగతితెలిసి తనకు కలిగియుండిన సంశయము లన్నిటిని యతిరాజుల నడిగెను. అనేక యుక్తులతో ప్రమాణముల తోడయతిరాజులు సంశయపరిహారము చేసిరి. ధనుర్దాసుని సంశయ పరిహారార్థము సకలశిష్యుల నుంచుకొని శాస్త్రములను, విశేష విషయములను చెప్పిరి. ఇదివరకు ఇట్లు చెప్పలేదే ! గంగాప్రవాహమువలె చెప్పుచున్నారే, ఎందుచేతనని శిష్యు లడుగగా నాల్గవ

దినము వైకుంఠమునకు పోబోవుచున్నాను. పిమ్మట మీకీ సంగతులు దొరకవు అని చెప్పి యతిరాజులు పుంఖానుపుంఖముగ పల్కిరి. పిమ్మట ఆదినము ప్రాప్తించగా ఎంబారు తొడమీద శిరమును, వడుగనంబితొడమీద పాదముల నుంచుకొని, పెరియనంబి యొక్క పాదుకలను తెమ్మని ముందుంచుకొని సేవించుచు హృదయాకాశమున యామునులను స్మరించుచు మాఘశుక్ల దశమి శనివారము మధ్యాహ్నమున పరమపదించిరి. వేదముననుండు ఒక్కొక్క వాక్యమును విష్ణుపరముగ చేసిన మహానుభావుడు నూట ఇరవైఏండ్లు ఉండి పరమపదించెను. నూటఇరువది ఐదేండ్లు అని కొన్నిగ్రంథములు. భోగిరాజపదము నొందెను. వారు పోయిరే గతియెట్లు అనిన సర్వస్థలములందును అర్చావిగ్రహము లేర్పరచిరి. వానిలో భూతనగరము, శ్రీరంగము, యాదవాచలములందుండు విగ్రహములు ముఖ్యములు. ఆమూటిలో శ్రీపెరంబుదూరునందలిది ముఖ్యము. యతిరాజచంద్రుడు అస్తమించెనే అని దుఃఖించరాదు. వారికి బదులు ఒక్క రేర్పడిరి. రంగనాథుని చేత పుత్రుడుగా స్వీకరింపబడిన భట్టరు ఆస్థానమున నేర్పడిరి. భట్టరు యతిరాజుల పరమానుగ్రహపాత్రుడును, రంగనాథుని కొడుకును అగుటచేత యతిరాజులు ఉండినట్లే యుండిరి. వారు కల్యబ్దము నాలుగువేల నూట ఇరవైనాలుగవదైన శుభకృత్ వైశాఖమాస శుక్లపక్షమందలి అనూరాధా నక్షత్రమున పరాశరాంశమున జన్మించిరి.

## భట్టరుచరిత్రము

ఎంబారు ఉడయవరుల ఆజ్ఞమీద వైష్ణవసిద్ధాంత ప్రవచనమును భట్టరు వలన చేయించిరి. సేతుహిమాచల పర్యంతము వారు రామానుజులవలె శ్రీరంగములో ధర్మస్థాపనచేసియుండిరి. ఇట్లు వైష్ణవసిద్ధాంతము అప్రతిహతముగ ప్రకాశించుచుండగా

ఇదేమంచిసమయ మని ఎంబారు వైకుంఠము చేరిరి. కూరత్తా ళ్వారు పుత్రుడైన భట్టరు తనతండ్రి, యతిరాజులు, ఎంబారుల యొక్క అనుగ్రహముచేత ఉభయవేదాంతప్రవర్తకులై రంగ నాథుని సన్నిధిలో రామానుజసిద్ధాంతమును నిలుపుచుండగా ఒక వైష్ణవుడు దివ్యదేశయాత్రచేయుచు యదుగిరికిపోయి చెల్వ పిళ్లను సేవించి యాత్రాక్రమముగా శ్రీరంగమునకు వచ్చి చేరిరి. ఆయన భట్టరుగృహమునకు వచ్చి భుజించి మాట్లాడుచుండగా మీరెవరు? ఎచ్చటినుండి వచ్చుచున్నారని భట్ట రడిగిరి. యదు గిరినుండి వచ్చితినని ఆయనచెప్పగా విశేష మేమని భట్ట రడిగిరి. ఆయన తానుచూచిన సంగతులన్నియు చెప్పి నేను కొంచెము చదివినవాడనని పేరు. ఒక్కవిద్వాంసునైన నుతింప లేదు. మైసూరుప్రక్క శ్రీరంగపట్టణములో వేదాంతియను బ్రాహ్మణుడు సర్వజ్ఞు డున్నాడు. అత డద్వైతి. అతనికి సమాను డుండడు. అతడు జంశ్రీచేత ధనికుడైయున్నాడు. ప్రతిదినమును అనే కులకు అన్నదాన మొనర్చును. లక్ష్మిసరస్వతుల విలాసము వాని కున్నది- అదియొక రాజాస్థానమే. నేనట్టి మాయావాదిని దర్శించి వాదించితిని. వానిని జయించుట నావల్లకాలేదు. ఇట్టివా డొకడున్నాడని మీకు చెప్పుటకై వచ్చితిని అనెను. "ఆహా! ఉడయవరులు, కూరత్తాళ్వారు స్థాపించి పోగా నేను అప్రతిహత ముగ ప్రవచనము చేయుచుండగా ఈకాలమున నిట్టివా డున్నాడా" యని భట్ట రాశ్చర్యమొంది "అయ్యా! మీరు మరల నచ్చటికేగి నేనొక్కడ నున్నానని ఆయనతో చెప్పుడు- శ్రీరంగ పట్టణమున వేదాంతియున్నాడని నాతో చెప్పినట్లే శ్రీరంగమున భట్టరున్నాడని ఆయనతో చెప్పుడు. పిమ్మట చూత" మనిరి. ఆవైష్ణవుడు మరల తీర్థయాత్రచేయుచు యదుగిరికి పోయి పరిచయసుడగు వేదాంతితో శ్రీరంగమున భట్ట రున్నా డనెను.

నేనుండలేదా యని వేదాంతి యడుగగా వారు మీకంటెను హెచ్చయినవా రనెను. ఆయనకు యోచన కలిగెను. "అయ్యా! వారికి వేదాంతియని బిరుదు. వేదాంతమును వారే చెప్పవల యును. అతడు శ్రీవత్సచిహ్నుల తనయుడు. శ్రీరంగనాథుడు అతనిని పుత్రునిగా స్వీకరించెను. సకలశాస్త్రార్థములను తత్త్వ ముగ నెఱింగినవాడు, పరమవైష్ణవాగ్రేసరుడు. మీవంటివారలకు పైవాడు" అని వైష్ణవు డనెను. 'అతనితో వాదించుటకు కాదా ?' యని వేదాంతి యడుగగా వాదించవచ్చును. కాని తుద కపజయ మొందుదురు. సింహముతో పోరుటకు పోయిన ఏనుగుగతి యగు నని శ్రీవైష్ణవు డనెను. నేనుగూడ అపజయమొందుదునా యని వేదాంతి యడుగగా నేను మరుగుగా చెప్పితిని. వాదించుటకు పోయిన అంతియే. అదేమి! యెందరో మహానుభావు లున్నారే! యని అడుగుచున్నారు. కోపించరాదు. వారివలె బ్రహ్మసృష్టిలో నొక విద్వాంసు డుండడు. ప్రమాణపూర్వకముగ జెప్పుచున్నా నని వైష్ణవు డనెను. "ఈరీతిగ చెప్పుచున్నవాడు విద్వాంసుడు. ఇతడు పూర్వము నన్నుజూచి ఆశ్చర్య మొందినాడు. ఇపుడు ఆతడు మీకంటె నధికు డనుచున్నాడు. ప్రమాణముగ చెప్పు చున్నాడే. మనకాలమున నట్టివైష్ణవు డొక డున్నాడా ?" అని వేదాంతి అచ్చెరువొంది లోలోపల భీతిజెందెను. మరల ఆవైష్ణ వుడు శ్రీరంగమున కరిగి "రాజస్థానమంటినే. మీరాశ్చర్యపడితిరే. అచ్చటికిపోయి చెప్పితిని. ఉడయవరుల శిష్యుడు, కూరత్తాళ్వారుల బిడ్డ యున్నాడు. సింహమునొద్దకు పోవు ఏనుగుగతి యగు నంటిని. ప్రమాణముగ జెప్పితిని." అనగా ఆవిద్వాంసు డేమనెనని భట్టరడిగిరి. మన "అద్వైతకోలాహలమున అట్లు శ్రీరంగమున నొకడున్నాడా" అనెను. అతనికి లోలోపల భయమే. తమ పరాక్రమాదులను, వాక్చాతుర్యాదులను, వాదవైఖరిని తెల్పి అట్లు

భయపెట్టితిని. వాని నెట్లయినను పట్టి జయింపవలెనని చెప్పితిని. ఒకవేళ వాదమున అపజయ మొందుదునేమో యని అతడు భయపడెనని చెప్పెను.

లోకమున రామానుజసిద్ధాంతము అప్రతిహతముగ నడచుచున్నదని యెపుడు చెప్పవచ్చును? ప్రతివాది లేనపుడుగదా? మఱియొకడు మిక్కిలి అధికు డున్నాడనిన గౌరవ మేమి? ఉడయవరులు, కూరత్తాళ్వారు, ఎంబారు, మఱి నేను ప్రవచనము చేసి ఏమిలాభము? రామానుజసిద్ధాంతమునకు విరుద్ధముగ నొకడుండ గౌరవము లేదు. కాన వానిసంహారము చేసియే తీర్థపానము చేసెద నని భట్టరు నిశ్చయించిరి. భట్టరు వేదాంతియను ఆ యద్వైతిని జయించియే తీర్థపానముచేయవలెనని నిశ్చయించి శ్రీరంగపట్టణమునకు బయలుదేరిరి. దుష్టనిగ్రహము, శిష్టపరిపాలనము చేయ నవతరించిన స్వామి రావణసంహారమునకై వాని యొద్దకుపోయెను గాని వాడు రాలేదుగదా! అట్లే ప్రహ్లాదుడు, ద్రౌపది, గజేంద్రుడు మొదలగువారివద్దకు తానే పోయి రక్షించెను. ఈరీతిగనే వానినిపట్టి జయించి శిష్యునిగ చేసికొనవలయునని భట్టరు అతిశీఘ్రముగ బయలుదేరిరి. శ్రీరంగనాథుని కృపయుండిన వానిదర్శన మగును; వాదము జరుగును అని వచ్చిన స్వామితో జెప్పి పంపిరి. విద్వాంసునిశ్రమ విద్వాంసు డెఱుగును. వేదాంతి బాగుగ చదివినవాడు, గొప్పవాడు. శ్రీరంగనాథుడు, యతిరాజులు, ఎంబారు, కూరత్తాళ్వారులకృప నాపై నున్నది. వానిని వాదమున కీడ్వవచ్చును. అపజయము గలిగిన నెట్లు? అంతకంటెను వాదముసల్పక శ్రీరంగముననే ప్రవచనముసేయుచుండిన బాగు. భట్టరే వేదాంతితో వాదము సల్పియుండిన ఓడించియుండును అనుఖ్యాతియుండునని తలంచి ఆతండ్రి తేఁకు, ఈతండ్రితో చెప్పికొనెద నని భట్టరు రంగనాథుని సన్నిధికి బోయెను. వేదాంతి

గొప్పవాడట! అపుడు ఉడయవరుల సిద్ధాంతమున కేమిగౌరవము గలదు ? వాడు శిష్యుడు కావలయునని భట్టరు రంగనాథునితో జెప్పగా "ఆయోచన యేల ? నీవు కూరత్తాళ్వారుల పుత్రుడుగా మాత్రముండినగదా భయపడవలయును ? నాపుత్రుడవుగదా! నిన్ను పంపి నేను రాకుందునా! ఉడయవరుల, ఎంబారుల, కూరత్తాళ్వారుల కృప యుండలేదా ? అని స్వామి చెప్పగా వాద యుద్ధమునకు సాయము లేదు. మీరే గతి. మీరు వచ్చి జయింప జేసి రామానుజసిద్ధాంతమును స్థాపింప వలయునని ప్రార్థించి, వారియుత్తరువుపొంది ఉడయవరులతో జెప్పి, పల్లకి నెక్కి, అనేకశిష్యులతోడను, జయభేరితోడను పోయిరి. ఇట్లు పోయిన వాని దర్శనము గాదు. వా డనేకశిష్యులను, ప్రశిష్యులను వాకిట నిల్పియున్నాడు. వారితో వాదించి లోపలికి పోవలసియుండును. ఎట్టివాడు వచ్చినను వారితో వాదించుటకు రెండుమూడు నెలలైన పట్టును. వానిదర్శనము కాకపోవును అని అచ్చటివారు చెప్పిరి. వానిదర్శనము కావలయునే యని భట్టరనగా అతడు ధనికుడు. నిత్యము నిన్నూరు, మున్నూరుమందికి సత్రములో భోజన మిడును. ఆసత్రమున భుజించు వారివలె పోయినచో అతని దర్శన మగునని వా రనిరి. "మంచిది; కార్యమా ? వీర్యమా ప్రధానము ?" అని భట్టరు పల్లకి విడిచి చినిగినవస్త్రములు కట్టుకొని ఓటిచెంబెత్తుకొని సత్రమునకు పోగా వేదాంతి అచ్చట నిలిచి యుండెను. భట్టరునిజూచి వేదాంతి "కూర్చుండు" డనెను. భట్టరు పోక అట్లే నిలిచియుండిరి.

వేదాంతి : కూర్చుండనికారణ మేమి ?

భట్టరు : నేను అన్నభిక్షకు రాలేదు.

వేదాంతి : ఏభిక్షకు వచ్చితివి ?

భట్టరు : వాదభిక్షకు వచ్చితిని.

వేదాంతి యోచించెను.

భట్టరు : వేదాంతీ! వాదించుటకు వచ్చితిని.

వేదాం : ఏల ఈరీతి వచ్చితిరి ?

భట్ట : మీశిష్యప్రశిష్యులు వాదించెదరు. ఆరునెలలైన పట్టును. నాకంత అవకాశము లేదు. కాన నిట్లు వాదభిక్షకు వచ్చితిని.

వేదాం : ఏమి నీధైర్యము ? ఏమి సాహసము ? ఓయీ! నీది శ్రీరంగమా! నీవు భట్టరువా ?

భట్ట : అదేల అట్లడుగుచున్నారు ?

వేదాం : భట్టరునకుతప్ప ఇంకొకనికి నాతో మాట్లాడుటకు శక్యముగాదు. అతడైననే నాతో తెగించి మాట్లాడగలడు. అవునా?

భట్ట : అయ్యా! నేను ఆభట్టరునే. కూరత్తాళ్వారులకుమారుడను. భట్ట రిట్లనగా వేదాంతి గొప్పవిద్వాంసుడగుటచేత వచ్చిన బ్రాహ్మణులకు అన్నభిక్ష, వీరికి వాదభిక్ష యిడియే భుజింపవలయునని తలంచిరి. ఇరువురును భోజనము సలుపకుండిరి. వాద మారంభమైన అల్పకాలముననే వేదాంతికి మీదియుక్తి స్ఫురించలేదు. ఇట్లుకాకున్న బ్రాహ్మణుడు చెప్పి యుండునా ? అని మెచ్చుకొనెను. భోజనమునకు వచ్చినవా రందరును వేడుక చూచుచుండిరి. ఈయుద్ధమును గొప్పవిద్వాంసులును చూచుచుండిరి. వేదాంతి కేమియు తోపక లేచి నిల్చి "అయ్యా! ఒకవైష్ణవుడు వచ్చి మీసంగతిచెప్పి సింహముకడకేగు ఏనుగుల వంటిది ప్రతివాదుల గతి యనెను. అంతమాత్రము చాలదు. ఆయనతక్కువగనే చెప్పెను. మిమ్ము చూడగా జయించెదరని తోచుచున్నది యనెను. రంగనాథ రామానుజుల యనుగ్రహము మీకున్నది. కావున నాకు తోచలేదు. నాసంశయములు తీరునని మీతో వాదము నారంభించితిని. మీముఖము చూచినపుడే

నే నపజయ మొందుదునని తలంచితిని.'' అనెను. ఎల్లవారును చూచి ఆశ్చర్య మొందిరి. అంజలి చేసిరి. ''ఓహో ! నీ వోడితివా ! నేను కొన్ని సంగతులను చెప్పగా వినవలయునని వాదించితివా ? అంజలితో నేను చెప్పుదానిని వినుము'' అని భట్టరు ఉభయ వేదాంతములను కుర్మిమ్మరింపగా వానికి సంశయములు తీరెను. నేను మీయుపన్యాసములచేత ఛిన్నసంశయుడనైతినని యాతడనెను. విద్యాగౌరవమును జూచి మనకు మించినవాడు లేడని తలంచియుంటిని. నేడుకదా తెలియని సంగతు లన్నియును తెలిసెను. నేను బృహస్పతినని తలచియుంటిని. నాపైవాడు ఈతడు. ఇట్టివారికి శిష్యుడను కావలయును. రహస్యముగ కాదు అని తలచి వేదాంతి జనులను చూచి ''ఓ జనులారా ! నేనీయనకు శిష్యుడ నైతిని; చూడుడు'' అని సేవించెను. భట్టరు వేదాంతి యొక్క శైవదీక్ష తొలగించి శ్రీవైష్ణవదీక్ష నిచ్చిరి. వేరుజన్మము వచ్చెను గాన బిడ్డకువలె మాధవదాసని పేరు పెట్టిరి. భట్టరు అచ్చట కొన్ని దినములుండి మాధవదాసుచేత ఉపచారములు పొంది ''బహుదినము లాయెను గాన శ్రీరంగమునకు పోవలయు'' ననిరి. మిమ్ము విడిచి యుండజాలను అని మాధవదాసనగా ''మీరు ఇచ్చట అనేకులకు అన్నదానము చేయుచున్నారు. భక్తియే ముఖ్యము. ఇచ్చటనే యుండి వైష్ణవారాధనము చేయుచుండుడు'' అని చెప్పి భట్టరు వారి నచ్చట నిలిపి శిష్యులతోడ శ్రీరంగమునకు పోయి రంగని సేవించి ''స్వామీ ! ఉత్తరువాయెనే; పోయి జయించి, వాదించి వైష్ణవదాసుని చేసి వచ్చితిని. మీయొక్క, ఆచార్యులయొక్క అనుగ్రిహమున అట్లు చేసితి'' ననిరి. ముందువలె అప్రతిహతశ్రీగా రామానుజసిద్ధాంతమును ప్రవచనము చేయుచు అచ్చట మాధవదాసుని నిలిపి అచ్చటికి గురువై, యిచ్చటికి శిష్యులై యుండిరి.

మాధవదాసునకు జ్ఞానము ముదిరెను. అట్టివారిని విడచి యుండుట తప్పు. అచ్చటికి పోయి వారికి శుశ్రూష చేయుట ముఖ్యము. వారు రావలదనిరి. పోవుటకు కారణ మేర్పడిన చాలును అని తలచి యుండిరి. వారు హరిభక్తిపరాయణులై యుండిరి. జ్ఞానభక్తి వైరాగ్యములు ముదిరి ఆచార్య శుశ్రూషను గోరుచు వైష్ణవారాధనము చేయుచుండి యొకనాడు స్నానమునకు పోయిరి. మాధవదాసుయొక్క ఇరువురుభార్యలు ఎవరని విచారించిరి. సాపాటుకు వచ్చితిమని వారనగా ఆయన స్నానమునకు పోయి యున్నారు, పొండి అనిరి. ఆవైష్ణవులు మాధవదాసు దగ్గరకు పోగా నిచ్చట కేల వచ్చితి రని ఆయన అనెను. వారు సంగతి చెప్పిరి. అటుపిమ్మట మాధవదాసు భార్యలనుజూచి ''మీరు శ్రీవైష్ణవదాసులకు అపచార మొనర్చితిరి. ఇల్లువిడచి పొండి'' అని చెప్పి తమ యాస్తిని మూడుభాగములు చేసి, భార్యలు అపచార పడినను అన్నమునకు అల్లాడరాదను తలంపుచేత వారికి చెరి యొక భాగ మిచ్చి, మూడవభాగమును ఎత్తుకొని శ్రీరంగమునకు పోయి భట్టరు ముం దుంచిరి. "ఏమి! నేను అచ్చటనే యుండుమంటినే'' అని భట్ట రనగా నాకు సంసారమున సరిపడలేదని మాధవదా'' సనెను. ''సరి; నీవు ముందే వచ్చెద నంటివి. నేను వలదంటిని. కారణము కల్పించుకొని వచ్చితివి'' అని భట్ట రనగా ఔనని మాధవదాసు చెప్పెను. ''నాయనా! యేమో ఆలుమగల జగడమున కేమి ? ఊరు చేరుము'' అని భట్టరనగా మీవలెనే అనేకులు అందురు. అందుచేత మనస్సెట్లగునో కాన సన్న్యాస మొసగుడు అని మాధవదాసనెను. "సరి; వైరాగ్యము గలిగె'' నని విధి ప్రకారము సన్న్యాసమిచ్చిరి. మాధవదాసు సన్న్యాసివేషముతో భట్టరునకు నమస్కరించి అంజలిచేసి ప్రక్కన నిలువగా భట్టరు చూచిరి. ఆహా ! యేమి విద్య, యెంతధనము, ఇట్టివానిని నేను

జయింపగలుగుట శ్రీరంగనాథుడు, ఉడయవరులు, కూరత్తాళ్వారు ఎంబారుల కృపచేతనే. ఇట్టివాడు నాకు శిష్యుడై నిలిచెనే! ఇదియే గౌరవము. ఇదివరకు జరిగినది కాదు. ఉడయవరులు, రంగనాథుడు అనుగ్రహించినది స్వాభావికము. ఇదే భాగ్యము" అని భట్టరు సంతోషించి ఆశిష్యుని చూచి "నాయనా! యిటు రమ్ము" అని గట్టిగ కౌగిలించుకొని నాకు ఇందరు శిష్యులు స్వాంతము కాదు. నీవు శిష్యుడవై నిలచుట నాభాగ్యము. నీవు నాయతివి. అస్మద్యతివి. నంజియర్ అని చెప్పి "నాయనా! ఇచ్చటనే వాసము చేయుచుండు మని ఉత్తరు విచ్చిరి. నంజియ్యర్ శుశ్రూషచేయుచుండిరి. దినదినమునకు వైష్ణవదీక్ష యెక్కి పోయెను. భట్టరు చెప్పినదానికిపైన ఈయన వ్యాఖ్యానము చేయుచుండిరి. ప్రాచీనవాసన మరచి పూని వెదకి వ్యాఖ్యానములం జేయుచుండిరి. వర్షాకాలమున చంద్రుడు ప్రకాశించడు. మేఘములు పోగా ముందువలె ప్రకాశించును. అట్లే నంజియ్యరు మేఘావరణముచేత అట్లు అద్వైతిగా నుండిరి. అదిపోగా బుద్ధి పళపళ ప్రకాశించెను. ఒకనాడు భట్టరు ప్రయాణముకాగా నంజియ్యర్ పల్లకి పట్టిరి. నేను గురువైనను మీఆశ్రమము పెద్దదిగాన మీరు పట్టరాదు అని భట్టరనగా నాకు ఆశ్రమము పెద్దదిగాదు. కాషాయము గొప్పకాదు. గురుశుశ్రూష కావలయును. అందులకు విరోధమైనచో నీగుడ్డలు వలదు. బ్రహ్మచారియో, గృహస్థుడో, వానప్రస్థుడో, సన్న్యాసియో ఎట్లుండినను జ్ఞానమునకు గౌరవము కలదు. పరమాచార్యులై నన్ను వైష్ణవుని చేసితిరే అని గురునికి ఉండు గౌరవమును తా మాచరించి చూపిరి.

భట్టరునకు సేతుయాత్ర సల్పవలయునని తోచెను. వారి కట్లు తోచుటకు కారణమేమి? సంతానము కలుగవలయునని కోర్కెయా, లేక పాపక్షయము కావలయుననియా? మనము

పాపము చేసియున్నాము, చేయుచున్నాము, చేయుదుము. కాన మన కాకోరిక కలుగుట న్యాయము. పుణ్యులు వారట్లేల తలపవలయు ననగా పాపితో నొకక్షణము చేరినను పాపము కలుగును. అనేకులు పాపులు పుణ్యతీర్థములందు స్నాన మాచరించి తమ పాపమును వదలి ఆనీటికి దోషము కల్పింతురు. మహర్షులు దానియందు స్నానమాచరించి నీటికి మహత్వము కల్పింతురు. నారదుడు గంగకుపోయి యెల్లవారును స్నానముచేసి సంకల్పము చేయుచుండగా తానట్లు చేయక గట్టున నిలచి "గంగా ! నమస్కారము పోయెద" నని పోవుచుండెను. గంగాదేవి యతనిని బిలిచి "అదేమి ? స్నానము చేయక పోవుచున్నా" వని యడుగగా "గంగా ! మంచికార్యములు చేసిన పుణ్యము కలదందురు. వానిలో మోక్షము గొప్పది. అది నీదర్శనము చేతనే కలుగును. నిన్ను దర్శించితిని. మోక్షము లభించెను. అందుకు మీది ఫలము లేదు. ఫలములేక స్నానమేల చేయవలయును ? అని పోయితి" నని నారదు డనెను. "నారదా ! మీరు చెప్పినది మిక్కిలి యుక్తమే; మీరు స్నానముచేయ నవసరము లేదు. మీరుస్నాన మాచరించినగదా నాపాపము పోవును ? నిత్యము వేల సంఖ్యలో మనుజులు సంకల్పముచెప్పి స్నానము చేయుచున్నారు. నన్ను పరిశుద్ధురాలినిగా చేయుటకు స్నాన మాచరింపు" డని గంగాదేవి చెప్పగా నారదుడు గంగాస్నానము చేసెను. ఈసంగతి వాయు పురాణములో మాఘమాహాత్మ్యమున నున్నది. ఈవిధముగనే సేతువు అనేక సంవత్సరముల వరకు మాహాత్మ్యముతో నుండవలయునను తలపుతో భట్టరు సేతుయాత్రకు వెడలిరి. నంజియ్యర్ సదా శుశ్రూష చేయుచుండిరి- భట్టరు నిద్రవచ్చుచున్న దని నంజియ్యరు ఒడిలో పరుండిరి. రాత్రి ఆయెను. అప్పటికిని వారు లేవలేదు. తొడను కదలించితినేని వారు నిద్రలేతురని

నంజియ్యరు కదలకుండిరి. తెల్లవారువరకును అట్లే యుండిరి. కేవల భక్తిమాత్రము చాలదు. జడమైన శరీరముకూడ కార్యము చేయవలయునని వారట్లు ఆచరించి చూపిరి. పిమ్మట వారు సేతు యాత్రచేసి వచ్చునపుడు పాదిరిగుడి యను గ్రామమునకు వచ్చి చేరిరి. అచ్చట బ్రాహ్మణుల యిండ్లు లేవు. వేటకాండ్రుండిరి. అచ్చట నిలువవలసివచ్చి ఒకని యింటివాకిట కూర్చుండిరి. భట్టరును గొప్పవారని తలచి యొకడు మంచమువేసి వారిని పరుండు మనెను. దీనిమీద నెవరైనను పరుండియుందురు గాన మాకిది వలదని భట్టరనిరి. ఆవేటగాడు ఆరాత్రియే క్రొత్తమంచము చేసి సమర్పింపగా వానిభక్తికి మెచ్చి పరుండిరి. భట్టరు వేటగానినిజూచి "ఓరీ! నీకేమిపనియని యడుగగా మృగములను హింసించు వాడను. ఇట్లే బ్రతుకవాడనని వాడనెను. నేడేమి చేసితివని భట్ట రడుగగా, నేడుపోయి అనేక మృగములను చంపితిని. ఒక్క కుందేటిపిల్లను పట్టి దానిని చంప యత్నించితిని. దానితల్లి నా కాలు పట్టుకొనెను. కనుక దానిని చంపక విడిచితిని" అనెను. భట్టరు నంజియ్యరు మొదలగు శిష్యులను పిలచి వేదాంతములోని ఒకసంశయము తీరెను. మీకు చరమశ్లోకము ఉపదేశించితినే. దానియందు మీకును, నాకును సందేహముగ నుండెను. మనము పాపముచేసి కాపాడు మనిన స్వామి కాపాడునా ? శరణుపొందిన విడుచునా ? యని తలచితిని. వీనికి చదువులేదు. శరణాగతుని కాపాడవలయునని తెలియదు. వీని కాలిమీద బడిన కాపాడునని కుందేలు ఎఱుగదు. అది ఐదంగములతో గూడిన శరణాగతి చేయలేదు. ఒకప్రాణివచ్చి భయపడి కాలుపట్టుకొనగా హింసించు స్వభావముగల వీడు విడిచెనే! మఱి భగవంతుడు చరమశ్లోకమున చెప్పినట్లు ఐదంగములతో శరణాగతి చేసిన కాపాడడా ? యని తెలిపెను. మీరును నమ్ముడు. చరమశ్లోకమున చెప్పినది సత్యము,

సత్యము, సత్యము. ఇక సందేహింపరాదు. కరుణానిధికి కృప కలుగదా యని భట్టరు సారాంశమును గ్రహించి శిష్యులకు తెలిపి అప్పుటనే సుఖముగ ఆరాత్రి గడపి ఊరుచేరిరి.

వీరసుందర బ్రహ్మరాయడను నతనికి రంగరాజుమీద భక్తియుండెను. అతడు ప్రాకారము కట్టదలచి కూరత్తాళ్వారు శిష్యులగు పిళ్ళైపిళ్ళెయాళ్వారు గృహము ప్రాకారము కట్టుటకు ఆటంకముగ నున్నదనియు, కాన వారియింటిని పడగొట్టవలయు ననియు అనగా ఆయాళ్వారు భట్టరుతో చెప్పిరి. మునుపు తిరు మంగై యాళ్వారు ప్రాకారముగట్టునపుడు తొండరడిప్పొడి ఆళ్వారు యొక్క తిరుమాల కట్టడమును విడిచి కట్టియుండలేదా ? మీరును పిళ్ళైపిళ్ళెయాళ్వారు గృహమును విడిచి కట్టుడని భట్టరు చెప్పగా ప్రాకారము సూటిగ నుండవలయునని వారిమాట వినక ఆళ్వారు యొక్క ఇంటిని కొట్టించెను. అందుచేత కలహము ఏర్పడెను. భట్టరు రాజదౌర్జన్యమును సహింపలేక ఈయూర నుండరాదని తిరుకోట్కవలూరికి పోయి స్వామివిశ్లేషముచేత నిద్రాహారములు లేక దినదినము శుష్కించి పిచ్చిపట్టిన ట్లుండిరి. ఒక శ్రీవైష్ణవుడు వారిరాక నెరిగి వచ్చి "నమ్మాళ్వారు యొక్క తిరువిరుత్తమునకు అర్థము చెప్పుడని అడిగెను. నాకు బుద్ధి స్వాధీనములో లేదు. అందుచేత చెప్పుటకు కాదని భట్టరనిరి. నేడు అర్థము గ్రహింప వచ్చితినే యని వారనగా భట్టరు నంజియ్యరును చెప్పు మనిరి. వచ్చినవారు అర్థమును తెలిసికొనిపోయిరి. కూరత్తాళ్వారు శిష్యు డగు వీరసుందరరాజు అపచారముచేత చచ్చెను. భట్టరుతల్లి ఆండాళమ్మ అతని మరణము నెఱింగి యేడ్చెను. ఎల్లవారును వానిమరణమునకు సంతోషించుచుండగా మీరేల దుఃఖించుచున్నా రని శిష్యు లడుగగా "ఉడయవరుల పరమానుగ్రహ పాత్రులైన నాభర్తకు అతడు శిష్యుడు. విద్యనేర్చిన శిష్యుడు పుత్రుడుకదా!

కావున వాడు నాకు భట్టరుతో సమానుడు. అట్టివాడు భాగవతాప చారముచేత యమునికి చిక్కెనే. భగవద్భక్తులయెడ జాగరూకులై మెలగుడని యముడు తనదూతలకు చెప్పియున్నాడు. భాగవతాప చారుడగు వీనిని యమదూతలు పిలుచుకొనిపోయిరే యని యాండాళమ్మ చెప్పి పొర్లి పొర్లి యేడ్చెను. పిళ్ళైపిళ్ళై యాళ్వారు తిరుక్కోవలూరికి పోయి వీరసుందరబ్రహ్మరాయని మరణమును భట్టరున కెరింగించి మీరు శ్రీరంగమునకు రావల యును. నేను ఎచ్చట నైనను ఇల్లు కట్టుకొనెద నని చెప్పగా వారు శ్రీరంగమునకు వచ్చి మునుపటివలె ప్రవచనము చేయుచుండిరి. ఇట్లుండగా అమ్మణియాళ్వాను వచ్చి భట్టరును సేవించి మీరు మిగుల పెద్దలని విని దూరమునుండి వచ్చితిని. అధికముగ వినుటకు లేదు. సంగ్రహముగ దెల్పుడు అనెను. భగవంతుని పట్టుట కష్టము. భాగవత శేషభూతుడుగా నుండవలెను. అనగా భగవంతునికంటెను తదీయశేషత్వము అధికము. భగవంతుని శిష్యశిష్యు డనుకొనవలయును. ఒక్కబీజముచేత నెన్నికోట్ల మఱ్ఱివృక్షములు పుట్టుచున్నవి: ప్రణవము ఒకశబ్దము. దాని యందు సకలవేదశాస్త్రము లుండునట్లు భాగవత శేషత్వ మేర్పడిన అన్నియును ఏర్పడును. (కులశేఖరులును దాసుడ నయ్యెదనని ఏడంతస్థులు తగ్గించి చెప్పుకొనిరి; నమ్మాళ్వారులును అట్లే చెప్పిరి. వేదాంతదేశికులును ఏడంతస్థులు తగ్గించి చూపవలె ననిరి.) కావున భగవచ్ఛేషత్వముగొప్పది యని భట్టరు తెలిపిరి. వీరశిఖామణి వల్లభరాజు అను ప్రభువు శరణుపొందగా భట్టరు విభీషణ శరణా గతిని దెలిపి అంగములతోకూడిన శరణాగతిని వివరించి శరణా గతియే గొప్పదని శరణాగతికి గౌరవము కలిగించిరి. అతనిని పంపగనే త్రిభువనవీరదేవరాజు అను ప్రభువు శరణుపొందగా భట్టరు అనేక శాస్త్రములు ఉపదేశించిరి. వసుదేవునియొద్దకు నారద

దుడు వచ్చి బిడ్డ యెచ్చట యని యడుగగా వాడధికప్రసంగి. ఇంటనుండడు, ఊరంతయును తిరుగుచుండును అనెను. "ఆహా! మేము పరబ్రహ్మ మని అల్లాడుచున్నామే. యమనియమాదుల చేత శ్రమపడుదుమే. అట్టివానిని నిట్లనుచున్నాడే. ఇది అతని తప్పుకాదు. అధికస్నేహముచేత గౌరవము తగ్గును" అని నారదు డనెను. అట్లే త్రిభువన వీరదేవరాజునకు భట్టరుమీద గౌరవము తగ్గి "రేపు మీరు మాయింటికి పండ్రెండు గంటలకు రండి" యనెను. "నేను రంగనాథుని సన్నిధికి తప్ప మరియొకని యింటికి వత్తునా?" యని భట్ట రనగా అదేమి! నేను ప్రభుడను కదా యని రాజనెను. రంగనాథుడు దక్క ప్రభు వెవడు? మఱి యిట్టితలపు కలుగరాదని భట్టరు ఖండించిరి. భట్టరు ఒకనాడు సన్నిధికి పోయిరి. నంజియ్యరు పల్లకిపట్టుట, శిష్యబృందము చుట్టియుండుట, రంగనాథునికి పుత్రుడై యుండుట అను విశేషములను చూచి కొందరు అసూయపడి భట్టరును పట్టతో కొట్టునట్లు ఏర్పాటుచేసిరి. అనేకులమధ్యయుండిన భట్టరును కొట్టిరి. ఇంత అధికగౌరవముండుచోట నన్నుకూడ కొట్టుస్థలము ఉన్నది కదా! ఇందుచేత నేను చేసియుండు స్వల్పపాపములుకూడపోవును అని భట్టరు శిష్యులకు బోధించి వారిని కోపించుకొనవల దనిరి. వారు ఆశ్చర్యపడిరి. ఇట్లు క్షమాగుణము చూపి ఆగుణమును వారికి బోధించిరి. ఇట్లుండగా సోమయాజి వచ్చి శరణుపొంది తిరువారాధనక్రమము నడిగెను. మూడుగంటలకాలము పట్టునట్లు తిరువారాధనక్రమము నుపదేశించిరి. భట్టరు తిరువారాధన చేయునపుడు చూచిన బాగుగ మనసునకు పట్టు నని తలచి సోమయాజి వారింటికి పోగా భట్టరు అయిదునిమిషములలో తిరువారాధన ముగించి వచ్చిరి. ఇదేమియని సోమయాజి అడుగగా నాయోగ్యతకు ఒకనిమిషము చాలును. నీయోగ్యతకు మూడుగంటలు

చాలదు. నేనొకనిమిష మారాధించిన భగవన్ముఖోల్లాస మగును. నాకు ప్రవచనమే పెద్దది. కర్మానుష్ఠానములను వదలరాదని సల్పుచున్నానని భట్టరనిరి. మన యోగ్యతకు తగినట్లు చేయ వలయు నని చూపిరి.

ఒక శ్రీవైష్ణవస్వామి భట్టరును చూచి భగవంతునియందు భక్తికలిగి ఆరాధించుట తెలిసియున్నది. దేవతాంతరము సంగతి యేమి అనిరి.

కామై స్తైస్తై ర్హృతజ్ఞానాః ప్రపద్య న్తేఽన్యదేవతాః ।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా ॥

అను భగవద్గీత 7అధ్యా. 20వశ్లోకము మొదలు 4శ్లోకముల చేత ఇతరదేవతల నారాధింపరాదనియు, 9 అధ్యాయమున సర్వము నేనే యనియు కృష్ణమూర్తి చెప్పగా "కృష్ణా! అన్ని యును నీవే యగు పక్షమున ఇంద్రు నేల పూజింపరాదని అర్జును డడిగెను.

యేఽప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్ ॥

అను భగ॥ 9అధ్యా. 23శ్లోకమున అన్యదేవతారాధనము చేసి నను నన్నారాధించినట్లే యగును. అది జ్ఞానపూర్వకము కాదు అని స్వామి చెప్పెను. యాగము చేయునపుడు ఇంద్రాయస్వాహా అనవలెను గాని కృష్ణాయ స్వాహా అననగునా యని యాగాది సత్కర్మములలో జ్ఞానపూర్వకముగ చెప్పవలెను. ఇంద్రాదులు భగవంతునికి శరీరభూతులు. మనము సాక్షాత్తుగ స్వామి నాశ్ర యించలేము గాన వారిద్వారా యీయవలయును. స్వామి సారాంశమును భుజించి పిప్పిని మీరు భుజింపుడని వారి కీయ వలెను. మనము ఇంద్రవరుణుల కిచ్చు ఆహుతిని వారు భృత్య భూతులై స్వామి కిత్తురు. ఇట్లు తెలిసి యజ్ఞాది కర్మములను

చేయవలెను అని భట్టరు ఆవైష్ణవస్వామికి తెలిపిరి. భట్టరు శ్రీపాద తీర్థమును స్వీకరింపనివారే లేరు. వారితల్లి అండాళమ్మయును వారికి తెలియకుండ స్వీకారము చేయుచుండెను. ఒకరువచ్చి యుత్తమ శ్రీవైష్ణవలక్షణమును చెప్పుడని భట్టరు నడుగగా ప్రవచనము చేయుటకే కాలము లేకున్నది. తిరుపతికి పోయి అనంతాళ్వాను నడుగు మనిరి. ఆయన వారి నడుగగా చెప్పెద ననిరి. ఈయన నేచియుండిరి. అనంతాళ్వారు ఎందరువచ్చినను భోజనముపెట్టి ఆ శ్రీవైష్ణవుల శేషమును స్వీకరించుచుండిరి. ఇట్లు ఎనిమిది దినములు జరుగగా వచ్చినస్వామి తాముకోరిన సంగతిని చెప్పుడని అనంతాళ్వాను నడిగిరి. ఎల్లవారును కాగా చేయిపట్టవలయును. నేను ముందని యుండరాదు. ఇదే లక్షణమని అనంతాళ్వాను తెలిపిరి. మిగుల విటుడుగా నుండిన యొక్కని భట్టరు పట్టి తెచ్చిరి. వాడు పతితుడు; వానిని చేర్చరాదని యెల్లవా రనిరి. వానినే దిద్దవలయునని భట్ట రనగా వాడు వినడని వారనిరి. సరి పరచెదను చూడుడని భట్టరు వారితో చెప్పి; ఆవిషయప్రియుని ఏకాంతముగా పిలిచి నేను పెద్దలగుటచేత నీసంగతు లన్నియు చెప్పు మనగా చనవుతో వాడు తనసంగతులన్నియు చెప్పెను. అందుకేమని భట్టరు వానికి కామశాస్త్రమును చెప్పెను. వేదమున చెప్పియుండు రీతులను వానికి తెలిపి అప్రకారమే నడచిన నది యొక యజ్ఞ మగునని భట్టరు తెలుపగా ఆవిషయమున తనకు తెలియని సంగతులను ఆయన చెప్పుచున్నాడని వాడు ముఖ్యశిష్యుడాయెను. వాడు విషయసుఖములను భట్టరు తెలియపరచినట్లు అనుభవించి తృప్తిపొంది మీరు వేదాంతులని తలచి యుండగా, నాకిట్లు చెప్పితిరి కదా యనెను. "నాయనా! చెప్పెదను వినుము, నీవు అనుభవించుచుండునది సుఖముకదా! ఇది యంతయు నశ్వరము. ఇంతకంటెను హెచ్చుసుఖమున్నదని

వేదాంతమును ఉపదేశించగా వాడు అందరికంటెను హెచ్చైన శిష్యుడాయెను.

వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన ।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥

అనుభగవద్గీత 2అధ్యా. 41శ్లోకమున చెప్పబడినట్లు వేదము వేయితల్లులకంటెను అధికవాత్సల్యము గలది. సాత్త్వికి, రాజస, తామసు లను మూడుతరగతులవారికి తగినట్లు చెప్పుచున్నది. భట్టరు వేదమందలి అంశమును చెప్పి విషయప్రవణుడని విడువ రాదని చూపిరి. ఒక శ్రీవైష్ణవుడు భట్టరునుచూచి యేమి వాగ్ధోరణి! మిమ్ము ఉడయవరులని చెప్పవచ్చును. మీపూర్వజన్మపుణ్యమని స్తోత్రముచేసిరి. అపుడు శిరియాచ్చాన్ అనువారు భట్టరుయొక్క అభిప్రాయము నెరిగి లేచి మీరట్లు చెప్పకుడు; వారియందు ప్రవేశించి చెప్పువారు రంగనాథు డనుకొనుడు. అచ్చటచ్చట స్వామియుండియే జరుపును అనిరి. కూరత్తాళ్వారు శిష్యుడగు తిరు వరంగత్తముదనార్ అనువారు రామానుజనూత్తందాదిని చేసి ఉడయవరులకు చూపగా వారు మెచ్చుకొనిరి. ఆయన భట్టరు; కూరత్తాళ్వారు పుత్రుడు. నేను మాత్రము కానా ? ఇది విద్యా వంశము. నాకాయన విద్యనుపదేశించిన తండ్రి. భట్టరు పుట్టిన బిడ్డ. అనగా కొంద రాసంగతి భట్టరుతో చెప్పిరి. దానిని విని శ్రీ భట్టరు—అది నాతండ్రిగారిస్తోత్రము. ఆయనకు గౌరవమున్నది. నేను న్యాయప్రకారము కొడుకును; నాకంటెను ఆయనకు, తండ్రికి సంబంధము అధికమే. అయితే వారు తన్ను ప్రశంసచేసికొనిరే. అది పొరబాటు. మనసున తలపవచ్చును గాని పైకి అట్లు చెప్ప రాదు అని భట్టరు శిష్యులకు చెప్పిరి. శ్రీరంగనాథునికి కోడెఉత్స వము జరుగుచుండెను. ఆఉత్సవము సాయంకాలము ప్రారంభ మగును. భట్టరును, శ్రీవైష్ణవులును స్వామిని సేవించుచుండగా

కొందరు సంధ్యావందనమున కని పోయిరి. భగవంతుని సేవించుచు, భగవంతునికథల వినుచు, ధ్యానించుచు నుండు నపుడు కర్మలోపమని లేవరాదు.

యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥

అను భగవద్గీత 3అధ్యా. 17శ్లోకమున చెప్పబడినట్లు నా విషయమున ఆసక్తుండై ఆనందించువానికి కర్మలోపము రాదని కృష్ణమూర్తి చెప్పెను అని భట్టరు చెప్పగా, వారు కర్మలోపము వచ్చునే యని శంకించిరి. ఎవడు కర్మచేయవలసిన కాలములో భగవద్విషయమున నుండునో వానికొరకు కర్మమును చేయుటకు ముక్కోటిమహర్షులు కాచియుందురని భట్టరు తెలిపిరి. అసూయా పరులగు ననేక విద్వాంసులు భట్టరుతో వాదముసల్పి యీయనకు సర్వజ్ఞులని పేరున్నదే; అన్నియును తెలియునా యని ఒకచోట గుంటచేసి యచ్చట పామునుపెట్టి టెంకాయచిప్పను మూసి యిందేమున్న దనిరి. శ్రీరంగనాథుని శ్వేతచ్ఛత్ర మున్నదని భట్ట రనగా, పామున్నదని వారు పరిహాసము చేసిరి. "మూఢు లారా ! మీకు తెలియలేదే: శెండ్రాల్ కుడైయామ్" అని ఆళ్వా రులు సెలవిచ్చిరి. "నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతప వారణాదిభిః" అని ఆళవందారులు సెలవిచ్చిరి. అనగా ఆది శేషుడు స్వామికి గృహము, పడుక, సింహాసనము, పాదుకలు, పీతాంబరము, దిండు, గొడుగుగా నుండును. అందరును స్వామికి శేషభూతులే. ఆదిశేషభగవానుడొక్కడే ఏయేసమయము లందు ఎట్లెట్లు చేయవలెనో అట్లు చేయుచు శేషుడనబడుచున్నాడు. మీరు పామని తలచితిరి. ఆపాము శ్వేతచ్ఛత్రముగా నుండును. చూడు డనగా వారికట్లే తెలిసెను. భట్టరు కొన్నిగ్రంథములు రచించిరి. సహస్రనామభాష్యము, విష్ణుపూజాక్రమము, అష్టశ్లోకి

అనగా ఎనిమిదిశ్లోకములు గలది. దానిలో నాలుగు తిరుమంత్రమునకు, రెండు ద్వయమంత్రమునకు, రెండు చరమశ్లోకమునకు వ్యాఖ్యానముగ నుండును. రంగరాజస్తవము, పూర్వోత్తరశతకము, శ్రీగుణరత్నకోశము- ఇది అమ్మవారి పరమైన స్తోత్రము. విష్ణుపత్నియైన మహాలక్ష్మి చరాచరప్రపంచమునకు తల్లి. ఇట్లని యజుర్వేదము చెప్పుచున్నది. అంతమాత్రమున చాలదు. శ్రీసూక్తము శాఖోపశాఖలుగా వర్ణించినది అని భట్టరు స్తుతింపగా "సర్వేశ్వరు డున్నాడు. ఆయనను స్తుతింపక నన్ను స్తుతించుచున్నావు, నీకు అభిమానము" అని రంగనాయకి అనెను. "అమ్మా! నాకభిమానములేదు. పురుషసూక్తములో మొదటి అనువాకమున స్వామిని వర్ణించి, రెండవఅనువాకమున రంగనాయకికి భర్తగా నుండుటచేతనే నీకీవైభవము వచ్చినది. ఆమె అదృష్టముకదా" అని చెప్పబడెనని భట్టరనిరి. సీతాకల్యాణఘట్టములో "రామా! సీత నాగేటిచాలునుండి పుట్టినదని యోచింపకుము. ఆమె మిక్కిలి గుణవంతురాలు. నీవామెను పెండ్లాడు"మని జనకు డనెను. (పాణిం గృహ్ణీష్వ పాణినా) సుమంతుడు సీతనుచూచి ఈరామునికి ఇంత విశేషమున్నదని తలచితిని. ఇంతప్రభుత్వము వచ్చినది. ఈమె అదృష్టమే యని తలచెను. భట్టరు రంగనాయకిని "అమ్మా!" అనగా "నిన్నుకంటినా"? అని ఆమె యడిగెను. నీవు అమ్మచేయు కార్యమును చేసెదవు. తండ్రికి కోపమువచ్చిన పోగొట్టుకార్యము తల్లిది. నీవాకార్యము చేసెదవు. వీడు మహాపాపియని స్వామి చెప్పగా అదియేగదా నాకు సరిపడదు. పాపియగుటచేతనేగదా ఆశ్రయించినాడు. వానిపై కోపించనగునా ? పాపియో, దోషియో మిమ్ముదప్ప నిర్దుష్టమైన వస్తువును జూపుడు. బ్రహ్మదులకు దోషము లేదా ? అనుగ్రహింపుడు అని స్వామితో చెప్పి "నాయనా! రారా!" యని "కోపసమయమున రమ్మందువు" అని

భట్టరనిరి. వారిట్లు అనేకగ్రంథములుచేసి లోకోద్ధరణార్థమై లక్ష్మీ నారాయణులను ఆశ్రయించుటకు మార్గము కల్పించి ద్రావిడము నను చేయవలంచిరి. తిరువాయ్‌మొళికి తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ ఆరాయిరప్పడి వ్యాఖ్యానము చేసెను. ఉడయవరుల ఆజ్ఞచేతను, నాశాసనముచేతను ఒంబదు (9) నాయిరప్పడి చేయు మనిచెప్పి, చెప్పినట్లే నంజియ్యరుచేత గ్రంథములు చేయించి భట్టరు ప్రవచనము చేయుచుండిరి. ఒక గ్రంథమున ఆరు అపూర్వ అధికవిషయము లున్నవి. భట్టరు శారదా పీఠమునకు పోయి సరస్వతిచేత ప్రశంసింపబడి అనుగ్రహము పొందిరని, ఉడయవరుల సన్నిధిలో నిలిచి నాకేమి వచ్చుననగా వారు వేదాంత ఉదయనాచార్యులని పేరిచ్చి మాట్లాడిరని, ఆళవందారు స్తోత్రము విని కిడాంబిఅచ్చాన్‌పాదముల బడిరని, ఒకరు నెయ్యికి బదులు వేపనూనెను వేయగా భట్టరు చేయిపట్టి స్వీకరించిరి. వారు ముక్కుపట్టుకొని వేయగా వీరిచేత పడగనే ఆనెయ్యికి సువాసన కలిగెను. శరణాగతి చేసిరి. తిరువాయ్‌మొళిని నంజియ్యరు పాడు మని కోరగా భట్టరు తాళబద్ధముగ పాడిరి. మీరు పాడు డన నంజియ్యర్ పాడిరి. వీరు ఆనందించిరి. భట్టరిట్లు ఆసేతుహిమాచలాంతము ప్రవచనముచేయుచు రామానుజసిద్ధాంతమును నిలిపి నంజియ్యరును పిలిచి "నేను స్వస్థానమునకు పోయెదను. ఇక నాస్థానమున మీరుండుడు" అని చెప్పి రంగనాథుని ప్రార్థించి వైకుంఠము చేరిరి.

## మణవాళమహామునులు

రామానుజసిద్ధాంతము అప్రతిహతముగ నడచుచు వచ్చినను బహుకాలమగుటచేత మరియొకసారి దీనికి వన్నె పెట్టవలెనని అనగా చక్కపెట్టవలయునని స్వామి తలచెను. కలియుగమునం దాయన అవతరించని కారణముచేత తమ అంతరంగుని పంప

దలచి యోచించుచుండి యెవ్వరును లేని సమయమున శేషుని బిలిచి "నాయనా! నీవు ముందు ఉడయవరులై అవతరించి ఘనకార్యములు చేసితివి. మరియొకసారి భూలోకమునకు పోయి ఆసిద్ధాంతమును వృద్ధిచేసిన బాగుగనుండు" ననెను. శేషుడు భగవంతునిమాట విని, వారియాజ్ఞను శిరసావహించి వేదశాస్త్రములకు, ఉడయవరుల గ్రంథములకు రంగుపెట్టదలచి, ఆహా! అటులే పోయెద నని చెప్పి నమ్మాళ్వారి స్థానమైన కురుకానగరము లేక ఆళ్వారుతిరునగరిలో మణవాళమహామునియై అవతరించిరి. కలియుగము 4372 సం॥ శాలివాహనశకము 1290 సాధారణ సంవత్సరము తులామాసము శుక్లపక్షము చతుర్థి మూలానక్షత్రము గురువారమున అవతరించిరి. రమ్యజామాత లేక అళగియ మణవాళన్ (అనగా అందమైన అల్లుడు) అని వారినామము. మూలానక్షత్రమునకు ఆపేరేల కలిగె ననగా మణవాళమహాముని అవతారముచేత ప్రపంచముననుండు సకలప్రాణికోటులకును క్షేమ కారణ మాయెను. అందుచేత దాని కాపేరు. ఆశ్వయుజమాసమందలి మూలానక్షత్రము అంత శ్రేష్ఠమైనది. ఆమూలయే జగదభ్యుదయమునకు మూలము. వారికి వారితండ్రి యేమిపేరు పెట్టుదమని యోచించి బహుసౌందర్యవంతుడుగ నుండుటనుచూచి దేవాంశమే అని తలచి అభిరామవరాధీశులని పేరుంచిరి. తల్లి, సోదరుడు ఆశిశువును శిక్కిల్ కిడారమనెడు ఊరికి పిలుచుకొని పోయిరి. అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము మొదలైనవి చేసిరి. అవతారమైనను రామకృష్ణులకు చేసియుండలేదా ? అట్లే తండ్రియగు తాతరణ్ణన్ బ్రాహ్మణులకు ఉచితమగు సంస్కారములను సరియగు వేళలలో వీరికి చేసిరి. ఆయన సౌశీల్యము, సుహృద్భావము, గాంభీర్యములతో గూడి శ్రీరామునియట్లుండిరి. సౌశీల్యము అనగా ఎల్లవారితో గలసి మాట్లాడుట. వీరిగొప్పతనము

చూచి మాట్లాడుదురో, మాట్లాడరో అని తలచువారితో ఈయనయే ముందుగ మాట్లాడుదురు. సకలప్రాణులయందును స్నేహముతో నుందురు. రాముడు పురుషమోహనుడై జనదృష్టి చిత్తాపహారుడై యుండినట్లుండిరి. ఆయన సులభుడై యుండినను ఇతరులకు వారి సమీపమునకు వచ్చుటకు భయముగ నుండును. ఇట్లు రామునివలె సకల కల్యాణగుణములతో గూడి చంద్రునియట్లు వృద్ధి పొందుచుండిరి. వేదాభ్యాస మాయెను. సకలవిద్యలను అతి త్వరగా నభ్యసించిరి. అన్నికళలును చేరునా యనిన చంద్రుని యెడ చేరినట్లు దినదినమునకును చేరెను. సకలవిద్యాప్రవీణులైరి. శేషుడు మరల నవతరించుటకు, ఏర్పాటుచేసిన శ్రీరంగనాథుడు అపహరింపబడి అచ్చటచ్చటనుండి వేంకటేశ్వరునిచెంతకు చేరెను. ఆస్వామిని సేవించిన చాలు ననిపించదు. ఆహారనిద్రలు తోచవు. ఆయనలో ఆకర్షణశక్తి యున్నది. బ్రహ్మకు, ఇక్ష్వాకునకు తిరువా రాధన. ఆస్వామికి తనయూరికి పోవలయునని తోచెను. సెంజి కోటరాజు గోపణరాయడు తనయూరికి తీసికొనిపోయి కొన్నిదిన ములు తిరువారాధనలో నుంచుకొని యెల్లవారిక్షేమమును పాటించి స్వామిని శ్రీరంగము చేర్చెను. తురుష్కులు ఆక్రమించినందున స్వామి పోయియుండి గోపణరాయని ప్రేరేపించి వచ్చి చేరిరి. మణవాళమహామునికి వివాహము చేసిరి. వారు విద్యాభివృద్ధికై గురువు నాశ్రయించిరి. ఆళ్వారుతిరునగరిలో తిరువాయ్మొళిపిళ్ళై, శ్రీశైలేశులు, తిరుమలైఆళ్వాన్ అను మూడుపేరులు గలిగిన వారిని శరణుపొంది తాము నేర్చినది సరిపరచుకొని దివ్యప్రబంధములను తెలిసికొనిరి. సచ్ఛిష్యుడని ఆయన సకలము చెప్పగా ఉభయ వేదాంతులైరి. గురువగు శ్రీశైలేశులు ఉడయవరులను ప్రతిష్ఠచేసి నాలుగువీథులను గట్టి వీరే ముఖ్యము, మూలము, వీరిని విడువ రాదు అని చెప్పగా మణవాళమహామునికి మిగుల భక్తి కలిగెను.

ఇది చూచి యతీంద్రప్రవణులు అనగా యతీంద్రులయందు విశేష ముగ భక్తికలిగినవారని గురువు పేరుంచిరి. ఎల్లవారికిని కలదు. నీకు అధికముగ నున్నదనిరి. మణవాళమహాముని యతిరాజవింశ తిని చేసి గురువునకు చూపగా మిగుల బాగుగ నున్నది, నీపేరు నకు తగినట్లు చేసితి వని వారు శ్లాఘించిరి. నేను చెప్పినది విని యతిరాజులయందు భక్తికలిగి మఠముకట్టి ఉడయవరులకు ఉత్సవ ములు చేయుచున్నాడని శ్రీశైలేశులు ఆనంద మొంది ఈయనకు ఇష్టమైన కూరలను స్వయముగ కోసి పంపుచుండిరి. ఇది అపచార మని మణవాళమహాముని లనగా "నాయనా! నీవంటి పదార్థము ఏర్పడకుండినగదా మేముఅన్నికార్యములు చూతుము. నీవేర్పడి తివి. ఇకఅర్చావిగ్రహముతో మాకు పనియేమి ?" అని గురువు కూరలు పంపుచుండిరి. ఇక నీవే స్వామియనిరి. యతీంద్రులట ! ప్రవణులట ! మనకు భక్తియుండలేదా ? కూరలుపంపుట యొకటి అని యితరశిష్యులు తిట్టుకొన నారంభించిరి. గురువు మనసున నుంచుకొని అందరిని రప్పించి ఉభయవేదాంతములను మణవాళ మహామునులచేత చెప్పించి యీాయన గొప్పవాడని వారికి తోపింప జేసి అట్టివాడని తెలిసియే కూరల పంపితి మనిరి. ఇట్లుండగా వారికి పుత్రుడు కలిగెను. పేరేమి పెట్టుదు నని గురువు నడుగగా నాకిష్ట మైనపేరు పెట్టెదవా ? రామానుజు డనునదే నా కిష్టము అని వారు చెప్పిరి. పిమ్మట రామానుజజియ్యర్ అనుపే రుంచిరి. మణవాళ మహామునులు అనేక గ్రంథములకు వ్యాఖ్యానములు, అనేక ప్రబంధములు వ్రాసిరి. తిరువాయ్మొళిపిళ్ళకు ఉపాధి కలుగగా వారు చింతించిరి. ఏలయని శిష్యు లడుగగా నాకు పిమ్మట రామా నుజసిద్ధాంతమును సరిగా చూచువా రెవరని ఖారనిరి. నేను మీ శిష్యుడ నున్నానని మణవాళమహాముని చెప్పిరి. మనుజులు సకల శాస్త్రములను తెలియుదురు.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥

అను భగవద్గీత 3అధ్యా. 39శ్లోక మట్లు తోడాలు సంపాదించు టకై కోరుదురు. విద్యను ద్రవ్యమునకై అమ్ముదురు. బ్రాహ్మణావ మానము చేయుదురు. విద్య అందుకు ఉపయోగపడుచున్నది. భక్తికి ఈడుపడరు. కామము అట్లుచేయుచున్నది. జ్ఞానులకు అది శత్రువు. కాన అనావశ్యకమైన శాస్త్రములు చూచుచుండి కాలము వ్యర్థపుచ్చరాదు. సకలశాస్త్రములును వేదాంతమునకు ఉపయోగ పడవలయును. కావున సంస్కృతమున శ్రీభాష్యమును, ద్రావిడ మున దివ్యప్రబంధములను ఉంచుకొనుము. ఇతర శాస్త్రములతో పొద్దుపుచ్చవలదని శ్రీశైలేశులు శిష్యునితో చెప్పి వైశాఖమాస కృష్ణపక్షమునందు అష్టమినాడు పరమపదించిరి. మణవాళమహా ముని వారిస్థానమున ఉభయవేదాంతప్రవర్తకులై యుండిరి. సంస్కృతమునకు స్వాభావికముగనే మాధుర్యము గలదు. ఉడయ వరులే అట్లు చెప్పిరి. ద్రావిడము కష్టము. అర్థము తెలియనందున ఎల్లవారికిని నమ్మాళ్వారిమీద అవిశ్వాసముగ నుండెను. మణవాళ మహామునులు దివ్యప్రబంధములకు అర్థము చెప్పగా విని "అబ్బా! ఇది వేదమునకంటెను హెచ్చైనదని యెల్లవారును తల చిరి. అపుడే ఆప్రబంధములకు వన్నె హెచ్చెను. పూర్వాచార్యుల ప్రబంధములకు వ్యాఖ్యానములు చేసి అర్థముచెప్పగా జనుల కపుడే పూర్వాచార్యుల మహిమ తెలిసెను. వీరియొద్ద అనేకులు ప్రవచనము వినుచుండుటను చూచి మరియు ననేకులు ఆశ్ర యించిరి. వారిలో అళగియ వరదర్ అనువా రొకరు. అంగి సన్యాసమనగా జ్ఞానభక్తివైరాగ్యములతో సంసారము వ్యర్థమని తోచి స్వీకరించు సన్యాసము. అంగసన్యాస మనగా జ్ఞానము కలుగుటకు మునుపే సన్యాస స్వీకారము. అళగియవరదర్ ఇంట

కష్టములని సన్యాసము స్వీకరింత మని జ్ఞానమునకై అంగసన్యాస మును స్వీకరించిరి. వారు మణవాళమహామునులదగ్గరనే యుండగా వారికి ఇంటిచింత, బాధ కలిగెను. అందువలన వారు సన్యాసము స్వీకరించి గురువును విడువకుండిరి. వారువారు సంస్కృత ద్రావిడ వేదాంతములను దెలిసికొనునపుడు సదా వినుటకు లేదే. సన్యాసము తీసికొనిన బాగుగ నుండును అని వారికి తోచు చుండెను. మణవాళ మహామునులు ఆళ్వారు తిరునగరిలో నుండిరి. రంగని దర్శించుటకై శ్రీరంగమునకు పోయిన బాగుగనుండునని అచ్చటికి పోయిరి. పోవుమార్గమున ఆళగరుసన్నిధికి వచ్చి అచ్చట స్వామి కనిపించకపోగా రావలయునని మంగళాశాసనము చేసి భాష్యకారు లుండిన స్థానమగుటచేత నచ్చట కొన్ని దినము లుండు నట్లు తలచుచున్నాను, అనుగ్రహింపు డని ప్రార్థించిరి. నేను విడిచి పోవుచున్నానని తలపకుడు. రామానుజులు ఉన్నస్థలమున నుండవలయునని యిష్టము అని శ్రీరంగమునకు పోయిరి.

మణవాళమహామునులు శ్రీరంగమునకు పోగా సన్నిధికి అధికారిగనుండిన అణ్ణన్ తిరుమాలెతందపెరుమాళ్ భట్టర్ అనువారు వారిని తమయింటికి పిలుచుకొని పోయిరి. ముప్పత్తాయిరప్పెరు క్కర్ అనగా ముప్పత్తాయిరగ్రంథమును పెంచితివే అని ప్రశం సించిరి. రంగనాథుని సన్నిధికి పిలుచుకొనిపోయిరి. వారుఅచ్చ టచ్చటికి పోయి వచ్చునపుడు పిళ్ళలోకాచార్యులఇంటికి వచ్చిరి. ఆయనచేసిన గ్రంథములేకదా అందరికి నేత్రములుగ మున్నవి! రంగనాథుడు ఆపిళ్ళలోకాచార్యులను నిటుల ప్రశంసించిరి. "వీరికి మించినవస్తువు లేదు. నేనెవరు ? నన్ను చక్రవర్తి తిరుమగనారు (శ్రీరాముడు) పూజించలేదా ? అపుడు సంతోషపడినట్లు ఈ పిళ్ళ లోకాచార్యులు ఆరాధించగా సంతోషపడుచున్నాను. శ్రీరంగము నాకు వాసస్థానముగ నేర్పడెనే" యనిరి. పిమ్మట అట్టి పిళ్ళలోకా

చార్యులయింటినుండి వేదాంతవిద్యానిధియైన వడక్కుత్తిరుపీథిపిళ్ళ యింటికి పోయిరి. పిళ్ళలోకాచార్యుల తమ్ములగు అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనాచార్యులకు నమస్కరించిరి. మణవాళ మహాముని అణ్ణనుతోడపోయి సేవించి ప్రార్థించి, మరల వారి తిరుమాళిగకు పోయిరి. ఈయూరికి, నాకు గౌరవము గలుగును గాన నీవిచ్చటనే యుండుమని రంగనాథుడు ప్రీతితో మణవాళమహామునులను అడుగుకొనగా, భగవంతుని ప్రార్థనచేత వారచ్చట కొంతకాల ముండిరి. ఉత్తమనంబి యనువారు స్వామి విషయమున సరిగా వర్తింప లేదనియు, అందుకు తగుకార్యము చేయవలయు ననియు వానమామల జియ్యరు మణవాళ మహామునులతో చెప్పగా వా రావిషయమును మనసున నుంచుకొనియుండి వానమామల జియ్యరునకును, ఉత్తమనంబికిని విరోధ మేమో యని తలంచి వారిరువురను పిలిచి స్నేహముచేసిరి. నాబుద్ధికి అట్లు విరోధము తోచెను అనుకొని వానమామలజియ్యరు గురునాజ్ఞచేత నుత్తమ నంబితో స్నేహముగ వర్తించిరి. మణవాళమహామునికి తిరుపతికి పోవలయునని తోచి స్వామి నడుగగా పొమ్మనెను. వారు తిరుక్కోవలూరికి పోయి తిరుపతి చేరిరి. శ్రీనివాసుడు పెరియకేళ్వినిధిజియ్యరు స్వప్నమున ప్రత్యక్షమై నాకొండలలో నొకయోగీశ్వరుడు వరుండి యున్నాడు. పాదమునొద్ద నొకరు ప్రకాశించు చున్నారు అని చెప్పెను. ఆయసంగతి విచారించి తెలిసికొని మణవాళమహామునులను మర్యాదతో పిలుచుకొనిపోయిరి. వా రచ్చట కొంతకాలముండి కొండదిగి గోవిందరాజులను సేవించి ఉడయవరులకు కన్నతల్లియైన భూతపురికి (శ్రీపెరుంబూదూరికి) వచ్చిరి. అచ్చట నాల్గుదినములుండి కాంచీపురికి పోయిరి. తృప్తి లేక మరల శ్రీపెరుంబూదూరికి వచ్చిరి. శ్రీభాష్యము నేర్చుకొన నెంచిరి. కాంచీపురమున కిడాంబినాయనారు అనువా రున్నారు.

నీవు ఆయనవద్ద నేర్చుకొనుము, నేను వారియందు వుండి చెప్పె దను. కలియుగముగాన వారిద్వారా చెప్పెదనని యతిరాజులు స్వప్నములో చెప్పగా మణవాళమహామునులు కిడాంబినాయ నారుతో చెప్పి మీయిష్ట మేమనగా నాకును స్వప్నము వచ్చెనని వారనిరి. మణవాళమహామునులు కిడాంబినాయనారు చెప్పగా విని రాత్రి ఒకపర్యాయము గ్రంథముచూచి వేయిముఖములతో అర్థముచెప్ప నారంభించగా వినినవా రందరును నాయనారుతో చెప్పిరి. నీ వెవరో నిజము చెప్పుమని ఆయన యడుగగా ఆది శేషుడ నని వీరు చెప్పిరి. ఆరూపము చూపుమని ఆయన అడుగగా ఈయన చూపెను. నాయనారు భయపడిరి. దేశదేశములనుండి యెల్లవారును వచ్చి యీయన చరణారవిందములను ఆశ్రయించి కృతార్థులైరి.

మణవాళమహామునులు వ్యాఖ్యానమండపమున వ్యాఖ్యా నము చేయుటకు చేరిరి. మణవాళమహామునిని నేనే యని రంగ నాథుడు చెప్పగా అందరు వచ్చిరని కొన్నిగ్రంథములం దున్నది. వారు మరల తిరుపతికి బోయి స్వామిని సేవించి శ్రీరంగము చేరిరి. వారికి సూతకము వచ్చెను. స్వామిని సేవించుటకు లేకపోయినదే యని సన్న్యాసము స్వీకరించిన ఈయాటంక ముండదని అట్లే చేసిరి. శఠగోపజియ్యరు నడుగగా వారు సన్న్యాస మిచ్చి శఠ గోపజియ్యరు అని పేరుపెట్టిరి. అళగియమణవాళన్ అని స్వామి తనపేరు పెట్టుమనెను. వల్లవరాయమఠము అనుపేరుతో నొకమఠ మేర్పరచిరి. మణవాళమహామునులు అందుండిరి. మణవాళమహా మునులు ప్రాతఃకాలమున నదిలో స్నానమాడుచుండగా తిరు మంజనఅప్పా లేక శ్రీతీర్థతాతన్ అనువారు అసమీపమున స్నాన మాచరించుచుండిరి. నాకు జ్ఞాన మేమున్నది ? ఎటులైనను ఇరు వురము చేరుదుము. వారి స్పర్శపొందినజలము నామీద పడుగాక

అని తలచి క్రిందివైపున స్నానమాచరింపగా వారిలోపలి అజ్ఞానము పోయి జ్ఞానోదయ మాయెను. జ్ఞానములేక తిరుమంజనముఁ చేయుచుంటినని తిరుమంజనఅప్పా అనువారు శరణు పొందగా వారికి మహామునులు సమాశ్రయణము చేసిరి. గోవిందప్ప దాసరప్పన్ అనువారు అనేకశిష్యులతో నుండిరి. వారుశరణు పొందిరి. శ్రీవచన భూషణమనునది గొప్పగ్రంథము. దానియం దనేకములైన అర్థ విశేషము లుండును. మణవాళమహామునులు దానినిప్రవచనము చేయుచుండగా పైవారు తమ మతాభిమానమును, వంశాభిమానమును విడిచి చేరిరి. మణవాళమహామునులు వాడుకప్రకారము భిక్షకు పోగా నొకనాడు వర్షమధికముగ నుండెను. తమపాదుకలను ఒకయింటిఅరుగునోరగా విడిచి తాము అరుగు నెక్కిరి. కందాడై అణ్ణన్ వంశములో చేరినహ రాయింటివారు. వారిభార్య పాదుకలెత్తి కడిగి తీర్థమును ప్రోక్షించుకొని తుడిచియుండెను. మణవాళ మహామునులు సంతోషించిరి. ఆమెకు ఆనందము గలిగెను. ఆమె మణవాళమహామునుల స్పర్శతగిలిన జలములో స్నానమాచరించిన తిరుమంజన అప్పాయొక్క కూతురు. ఆమె జరిగినసంగతిని తండ్రితో చెప్పుకొనెను. నీవు నాకంటెను భాగ్యముగలదానవు. నాకే జ్ఞానముగలుగగా నీకు కలుగదా అని చెప్పి ఆమెను మణవాళ మహామునుల సన్నిధికి రహస్యముగ పిలుచుకొనిపోయి వారితో విన్నవించగా వారు సమాశ్రయణము చేసిరి. ఈతిరుమంజనఅప్పా కూతురు కందాడైఅణ్ణన్ అనువారి పినతండ్రి భార్య. వారామెచేతి ప్రసాదము నొక తిరువధ్యయనదినమున భుజించగా జ్ఞానము గల్గెను. కందాడైఅణ్ణన్వద్దకు ఒకస్వామివచ్చి నేను మణవాళమహామునికి కూర నిచ్చితిని. వంటవారు దానిని పక్వముఁచేసి వారికి పెట్టిరి. నేను స్వామిని సేవింప సన్నిధికి పోయితిని. స్వామి చేయినెత్తి ఆదిశేషునిజూపి ఈయనగదా మణవాళమహాముని.

ఆయనను ఆశ్రియింపు డనెను అని చెప్పగా ఇదేమని అణ్ణనుకు యోచన గలిగెను. తమ గౌరవము పాటించి మణవాళమహామునిని యొద్దకు పోవ సిగ్గుపడెను. పెద్దపెద్ద శ్రీవైష్ణవులు దివ్యప్రకాశ ముతో మిద్దెమీదినుండి వచ్చి పదిదెబ్బలుకొట్టి మిద్దెమీదికి పిలుచు కొనిపోయినట్లును, మణవాళమహామునియును చేతితో దెబ్బకొట్టి "నేను ఆదిశేషుడను, ఉడయవరులను; నన్నాశ్రియింపుము, అని నట్లును, మహదాచార్యులగు కందాడై అణ్ణన్ అనేకశిష్యులతోడ శరణాగతిచేసి యెట్లాశ్రియించునది అనినట్లును, నీవు మొదలి యాండాన్ వంశస్థుడవుగాన మన్నించెదము; నిన్ను మన్నింప కుందుమా'' యని మణవాళమహామునులు చెప్పినట్లును కందాడై అణ్ణను స్వప్నముగని కనులుదెఱచి ఏమియు కానరాకుండగా తమతో జేరినవారితో స్వప్నవృత్తాంతము తెల్పిరి. అందరు సరి యనిరి. కందాడైలక్ష్మణాచార్యులను పెద్దలు పోవల దనిరి. కందాడైఅణ్ణను వారిమాట వినక అనేషశిష్యులతోడ పోయిరి. శుద్ధ సత్త్వము అణ్ణన్ అనువారును చేరిరి. అచ్చటికి పోయి అహంక రించకుమని వారు అణ్ణనుకు బుద్ధిచెప్పిరి. ఆయ్యా! అందువలననే మీకు శుద్ధసత్త్వమని పేరుకలిగెను. అడుగడుగునకును చెప్పు చున్నారు అని అణ్ణను ఎల్లవారితోడ పోయి మణవాళమహాముము లను శరణుపొంది సమాశ్రియణము సల్పు డనగా నాల్గవనాడు చేసెద మనిరి. మణవాళమహామునులు అణ్ణనును పరీక్షింపగోరి పరీక్షించి సమాశ్రియణము చేసిరి. ఇంకను కొందరు విద్యామదము చేత ఆశ్రియింపక చెడుచున్నారని స్వామి వారిని స్వప్నములో లేపి కొట్టి ఆశ్రియింపు డనిరి. వారిమనసున దూరి దర్శనమిచ్చి చెప్పగా వారెల్లరును ఆశ్రియించిరి. ఇట్లుండగా కాలము చాల కుండెను. ఉభయవేదాంతములను ప్రవచనము చేయవలసి యుండెను. సమాశ్రియణము చేయవలసియుండెను. భక్తిగల

వారైన సరియే; లేనివారినిగూడ స్వామి పంపుచుండిరి. అందుచేత మణవాళమహామునులు వానమామలజియ్యరును పిలిచి తమపీఠమున గూర్చుండబెట్టి నేనే మీరు; సమాశ్రయణము చేయు డనిరి. ఆండపెరుమాళ్ విద్యాప్రవీణుడు. ఆయన శరణు పొందగా కందాడై అణ్ణనను ఆశ్రయింపుడని వారితో చెప్పి నాకు ప్రతినిధిగా నుండి ఉపదేశింపుమని అణ్ణనుతో చెప్పిరి. మణవాళమహామునుల పుత్రుడగు రామానుజజియ్యరుకు పుత్రుడు కలుగగా తాతపేరైన అళగియమణవాళజియ్యరని పేరుపెట్టు మనిరి. రెండవపుత్రుడు కలుగగా పెరియాళ్వారని పే రుంచు మనిరి. ఎల్లవారును శిష్య ప్రశిష్యపరంపరగా ప్రవచనము చేయుచుండిరి.

మణవాళమహామునులు తమజన్మస్థానమందలి అభిమానము చేత రంగనాథుని అనుజ్ఞపొంది తిరునగరికిపోయి నమ్మాళ్వార్లను సేవించుకొనుచు కాలక్షేపము చెప్పుచుండిరి. ఆచార్యహృదయమను గ్రంథమునకు మనముచెప్పునట్టి అర్థము చాలదు. పెద్దల వలన చక్కగా వినవలయును అని తలంచి తీర్థయాత్రకై వెడలి మార్గమధ్యమున తిరునారాయణపురమునందుండు తిరునారాయణ పురత్తాయి అనువారిని సంధించి వారిని పిలుచుకొనివచ్చి ఆగ్రంథ మందలి సకలార్థములను గ్రహించి ప్రతిప్రయోజనముగ వందన మొనర్చిరి. ఆపెద్దలకు దేవరాజులని పేరు. గౌరవార్థము తిరు నారాయణపురత్తాయి అని వ్యవహరించుచుండిరి. వారు మరల తిరునారాయణపురమునకు పోవునంతలో అసూయాపరులు వారి సొత్తునంతయు ఆక్రమించి సన్నిధిపరము చేసిరి. ఆసంగతి తెలిసి వారు మిగుల సంతోషించి పరమతృప్తి పొందిరి. భోజనమునకు వేరుమార్గము లేనందున ఆసన్నిధిలో తిరుమాలాకైంకర్యము చేయుచు జీవించుచుండిరి. ఈఅసూయ ఆకాలములోగూడనుండుట చేత ప్రకృతిసంబంధముయొక్క మహిమ యెట్టిదో తెలియు

చున్నది. అసూయాపరులు కొందరు మణవాళమహామునుల మఠమునకు నిప్పుపెట్టగా వారు పరమశాంతమును వహించి యుండిరి. రాజు ఆపనిచేసినవారిని శిక్షింప యత్నించగా భగవత్సంకల్పము లేనిదే తృణమైనను కదలదుగాన వారియందు దోషములేదని వారిని విడిపించిరి. మణవాళమహామునులు ఆతతాయులవిషయమై సిఫారసుచేయగా రాజు వారి శమదమాది సద్గుణసంపత్తికి మెచ్చి వారి నాశ్రయించెను. మణవాళమహామునులు తమ్మాశ్రయించిన యింకొక్కబ్రాహ్మణుని ద్వారా దివ్యదేశములలో అనేక కైంకర్యములను జరపించిరి. ఇరుంబియప్పా అనువారు శ్రీరంగమునకు పోయి అణ్ణన్ తిరుమాళిగకు వచ్చిచేరి మణవాళమహామునుల ఆశ్రమమున కేతెంచి వారిప్రసాదమును యతియన్నమని నిరాకరించి ఊరికిపోయిరి. మరుదినము ఆరాధ్యదైవమైన చక్రవర్తితిరుమగనారును ఆరాధించుటకై చందనమాల్యాదులను తీయబోగా శక్యముగాలేదు. అందుచేత ఆరగింపుచేయలేక తానును ఆహారము స్వీకరింపక పండుకొనెను. మణవాళమహామునులు ఆదిశేషభగవానుడుగాన వారివిషయమున అపచారపడినందులకై మన్నింప వేడుమని శ్రీరాముడు స్వప్నమున చెప్పిపంపిరి. ఇరుంబియప్పాఅనువారు మణవాళమహామునులపాదము లాశ్రయించి వారి దాసకోటిలో చేరిరి. మణవాళమహామునుల దినచర్యవిషయము : ప్రాతఃకాలమున కందాడై అణ్ణన్ మొదలగువారు "హే మునీశ్వరా! సూర్యోదయమువలన బాహ్యాంధకారముమాత్రము పోవును. హృదయమందలిచీకటి మీరు నిద్రలేచినగదా పోవును అనియు, నీటియందున్న కమలము సూర్యరశ్మిచేత వికసించుచున్నది. కాని మాహృదయకమలములు మీరు లేవకయే వికసించ వనియు సుప్రభాతముచెప్పి నిదురలేపిన పిమ్మట వారు నిత్యకర్మానుష్ఠానములను జరుపుచుండిరి. కందాడై అణ్ణన్ వంశములో చేరిన నాయనార్ అను

ఒకరిని భార్యతోడ అపరాధమువలన నిగ్రహించి మరల పరమాను గ్రహముచేత చేర్చుకొనిరి. ఇందుచేత కక్ష యేర్పడినది. ఒక నాడు కాలక్షేపములో వారిమాహాత్మ్యమును జూపించి యిట్టిజ్ఞాని కాబట్టి చేర్చుకొంటినని చెప్పిరి. ఇరుంబిఅప్పా ఆశ్రయించి యుండుటకు శ్రీరంగములో అందరు నాశ్చర్యపడిరి. అప్పిళ్లా లేక అప్పిళ్లాన్ అనువారు రంగనాథునిమాత్రము సేవించి పోవలయు ననియు, మణవాళమహామునులను చూడబనిలేదనియు తలచగా ఇరుంబియప్పా అనువారు మణవాళమహామునులతో జెప్పిరి. వారు తమగౌరవమును పాటించక వానమామలజియ్యరును బంపి అప్పి ళ్లానును పిలిపించిరి.

మణవాళమహామునులు విశేషాభినివేశముతో రంగనాథుని సేవించుచుండగా ఆసూయగొన్న ఉత్తమనంబి "ఎంతసేపు సేవిం చుట ? బయటికి పొమ్ము" అని ధిక్కరించెను. వా రామాటలను పరమసంతోషముతో మన్నించి– "అహా! బయట ననేకులు కనిపెట్టు కొనియుండుటచేత ఆయపచారము నకు తాను పాత్రుడు కాకూడ దనియే శ్రీరంగనాథు డిట్లు చెప్పించెనని తలంచి యింటికేగిరి. రాత్రికాగా రంగనాథుడు ఉత్తమనంబి స్వప్నమున సాక్షాత్కరించి ఆయనను కొరడాతో కొట్టి, మణవాళమహామునుల నాశ్రయింపు మని చెప్పగా అత డపుడే పరుగెత్తివచ్చి వారిపాదము లాశ్ర యించెను. ఒకస్త్రీ మణవాళమహామునులను ఏకాంతమున చూచుటకు పోయి మఠములో నొకమూల దాగియుండెను. అపుడు వీరు తమ నిజరూపముతో (అనగా వేయిఫణములతో నాదిశేషుడుగా) విహ రించుచుండిరి. ఆమె భయపడగా మరల యతిరూపుడై దర్శన మిచ్చి స్వరూపజ్ఞానహీనులకు ఈవిషయము చెప్పకు మని చెప్పి పంపిరి. ఒక్కనాడు మఠమునొద్ద నిరువురు వైష్ణవులు జగడమాడు టను, వారిప్రక్క పోట్లాడుచుండిన కుక్కలను మణవాళమహా

మునులు చూచి ''ఓశునకములారా! మీరు శ్రీవచనభూషణమునకు అధికారులుకారుగదా! దానికి అధికారులైనవారే జగడమాడవలయు నని చెప్పి అవైష్ణవుల అహంకారము తగ్గించిరి. ఒకనాడు మఠములో నొకమూల గోమయముతో శుద్ధిపెట్టియుండిరి. ఇందుకు కారణమును మణవాళమహామును లడిగిరి. మఠముయొక్క గ్రామములైతులు వచ్చి భుజించినందున శుద్ధిపెట్టినట్లు కొందరు చెప్పిరి. అంతట మణవాళమహామునులు తమమఠమునకు గ్రామము లనవసరమని వానిని రంగనాథునికి సమర్పించిరి. మఱియు మిగుల ననుగ్రహపాత్రియైన వంటమనిషి అహంకారముతో భాగవతులు తెచ్చియిచ్చిన కాయగూరలను నిరాకరించగా మణవాళమహామును లామెను ఆరుమాసము లాకైంకర్యమునుండి నిలిపివేసి భాగవతాపచారమునకు శిక్ష విధించిరి. పెద్ద లొకరు తమ శిష్యులు నన్ను సేవించుటలేదని చెప్పుకొనగా వారు శిష్యులను విచారించిరి.

ఆపెద్దలు కృష్ణావతారమువలె నున్నారని శిష్యు లనిరి. అయిననేమి? వారియొద్ద గుణమును మాత్రము గ్రహించవలయును. దోషమును వెదకుట సరికాదు. సూకరమే అట్టికార్యమును చేయునని మణవాళమహామునులు చెప్పిరి. యుక్తియుక్తముగను, శాస్త్రోక్తముగను అర్థము చెప్పునట్టి వేదలప్పర్ అనువారు కొన్ని దినములు మఠము వదలిపోవునట్లు చెప్పగా వారికి బదులు అట్టి వారిని ఏర్పాటు చేయవలయునని మణవాళమహామునులు తలచి యుండిరి. ప్రతివాది భయంకరము అణ్ణన్ అనువారు తిరుమలకు వచ్చి స్వామిచేత తిరుమంజనకైంకర్యమునకు నియమింపబడి ఆకాశగంగలో తిరుమంజన తీర్థమును తెచ్చుచుండిరి. వారొక శ్రీవైష్ణవునివలన మణవాళమహామునుల ప్రభావమును వినుచు తీర్థమును మెల్లగా తెచ్చుచుండగా సమయము మించిపోవుచున్నదని

మరియొక రెదుర్కొని వచ్చి తిరుమంజనతీర్థమును తీసికొనిపోయి తిరుమంజనము జరిపించిరి. వీరు మిగుల భయపడి, అపరాధిని, వాసనద్రవ్యములు చేర్చకయే తిరుమంజనము జరిగెనుకదా యని చింతించుచుండగా, ఇన్ని దినములకంటెను నేటితీర్థము విశేషవాసనతో గూడియుండె నని అచ్చటివారు చెప్పిరి. అదెట్లు సంభవము? నేను ఆచార్యప్రభావమును వినుచు వచ్చినందున ఆలస్యమైనదని వారనగా ఆప్రభావమే యింత పరిమళమునకు కారణ మని అచ్చటివారు చెప్పిరి. అట్టిప్రభావము గలవారని తోడనే ఆశ్రయించవలయునని తలచి వారు శ్రీరంగమునకువచ్చి మణవాళమహాముసుల నాశ్రయించిరి. మరల ఆచార్యులు తీర్థయాత్రకు బయలుదేరి కంచికివచ్చి గరుడసేవ సేవించి అచ్చట అప్పాచ్చియార్అణ్ణా అనువారిని అనుగ్రహించి అచ్చటనేయుండ నియమించి మరల శ్రీరంగమునకు పోయి అచ్చటికి అప్పాచ్చియారణ్ణను పిలిపించి కంచి కలహమునకు చోటుగాన జాగ్రత్తగా నుండునట్లు నియమించి పంపిరి. ప్రతివాదిభయంకరులను పిలిచి వారిని శ్రీభాష్యమునకు అర్థముచెప్పనియమించి వారిని శ్రీభాష్యకర్తనుగా అభిషేకించిరి. ఇరుంబియప్పా అనువారు దినచర్య అను గ్రంథమును రచించి ఆచార్యులకు పంపి వారిచేత పిలిపించబడి అనుగ్రహించబడిరి. మణవాళమహామునులు మరియొక శిష్యునిజూచి దీక్ష యెందుకని విచారించగా గర్భదీక్షయని ఆయన చెప్పెను. దీక్ష తీసివేయుమని ఆచార్యులనిరి. అతడట్లే చేసెను. తోడనే ఆయనకు పుత్రుడు కలిగి పదిదినము లాయెనను సంగతి తెలియరాగా వారిసర్వజ్ఞత్వమునకు అందరు మెచ్చుకొనిరి.

మహాజ్ఞాతయైన మణవాళమహామునులయొద్ద ముప్పత్తాయిరప్పడి వ్యాఖ్యానమును వినవలయునని రంగనాథు డాశజెంది మణవాళమహామునులమఠముకాక గరుడమండపమున ప్రవచనము

జరుగవలయు ననియు, నేనొక శిష్యుడనుగ వినవలయు ననియు ఆజ్ఞాపించి ఒకసంవత్సరకాలము విని శాత్తుమొరదినమున వారు వారు కానుకలు సమర్పించుటకు కాచియుండగా ఒకచిన్నబాలుడుగ అందరిని త్రోసికొని ముందుకు పోయి-

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥

అను తనియను చెప్పి అంతర్ధాన మొందెను. అది గ్రంథ సమాప్తిలో రంగనాథు డిచ్చిన బిరుదు. పరమాత్మ శిష్యభావము వహించి వందనపూర్వకముగ తనియను చెప్పుటను ఎల్లవారును చూచి ఆశ్చర్యమొంది స్వామియే యని తలచిరి. నేటినుండి నూట యెనిమిది దివ్యదేశము లందును ద్రావిడ వేదపారాయణారంభము నకు ముందుగ నీ తనియను భక్తిపూర్వకముగ అనుసంధింపవల యునని రంగనాథుడు ఆజ్ఞాపించెను. కందాడై అణ్ణన్ భార్యయొద్దకు ఒకబాలుడు పరుగెత్తుకొనివచ్చి ఒకచీటి నిచ్చి పోయెను. ఆమె ఆచీటిని సభకు పంపగా అందులో శ్రీశైలేశతనియన్‌వ్రాయబడి యుండెను. అళగర్ సన్నిధిలో నొకమహానుభావుడు మణవాళ మహామునులవిషయమున నొకమంచిశ్లోకము లభించవలయునని కోరి సేనమొదలియార్ సన్నిధిలో ప్రార్థించుచుండిరి. తిరుపతిలో బ్రహ్మోత్సవమున స్వప్నములో లభించిన శ్లోకమును ఆశ్రీవైష్ణ వుడు విని అట్లే వ్రాసికొని తెల్లవారి విచారించగా ఎవరును తెలియ దనిరి. ఇది భగవద్వాక్య మని ఆయన భావించెను. మణవాళమహా మునుల కాలక్షేపానంతరము శ్రీరంగ భక్తబాలకరూపమున వచ్చి తనియన్‌చెప్పి పోవుటకు ముందేవైష్ణవు డొకడు, ఉత్తరదేశము పరిక్ర దివ్యదేశయాత్రచేయుచు బదరికాశ్రమము చేరి నారాయ ణునికి అనేకవిధముల కైంకర్యములు చేయుచుండగా స్వామి ప్రసన్నుడై స్వప్నమున సేవయిచ్చి యేమి కావలె ననెను. నాకొక

పరమహితము నుపదేశింపుడని ఆవైష్ణవు డడుగగా శ్రీశైలేత్యాది శ్లోకమును స్వామి చెప్పెను. ఈశ్లోకప్రతిపాద్యు డెవడని వైష్ణవు డడుగగా దక్షిణదివ్యదేశములలో నీకతడు కాన్పించునని చెప్పి స్వామి అంతర్ధాన మొందెను. ఆవైష్ణవుడు ఆశ్లోకప్రతిపాద్యు నెరుగగోరి, తిరుపులకు వచ్చి అచట భాగవతు లందరు దివ్య ప్రబంధాను సంధానమునకు పూర్వము, ఆశ్లోకమును అనుసంధించుటను చూచి, ఆశ్చర్యపడి వారిమూలమున గురువర్యుడు మణవాళ మహాముని శ్రీరంగమునందున్నట్లెరిగి, అచ్చటికి పోయి గురు వర్యుని సేవించి, జరిగినసంగతి చెప్పి, వారిని ఆశ్రయించి పంచ సంస్కారాదిహితంబుల నొందిరి. కందాడై యణ్ణన్ కంచికిపోవు వారిలో ఇరుంబిఅప్పా తండ్రిచేత నుపచరింపబడి కంచికిపోయి చేరి ఉడయవరులు అభిమానించిన శాలక్కిణరుతీర్థము తెచ్చి తిరు మంజన కైంకర్యమును కొంతకాలము చేయుచుండి అప్పాచ్చి యణ్ణనుకు ఆకైంకర్యము నొసగి శ్రీపెరంబుదూరికి పోవ నిశ్చ యించగా నొకశ్రీముఖము వచ్చినది. అధికకాలమైనది గాన శ్రీఘ్ర ముగ రావలయునని ఆచార్యులు ఆజ్ఞాపించి యుండుటను చూచి వారు శ్రీపెరంబుదూరిదిక్కునకు వందన మొనర్చి శ్రీరంగము చేరి ఆచార్యులకు యాత్రాక్రమము నంతయు జెప్పిరి. ఆసమయ మున రామానుజదాసరును తీర్థయాత్ర ముగించుకొనివచ్చిరి. వాన మామలలో కార్యదర్శిగా నుండవలయునని వానమామల రామానుజ జీయ్యరును పంపుమని జాబురాగా మణవాళమహామునులకు వారిని బంపనిష్టములేకపోయినను కార్యము పెద్దదిగాన నేను చెప్పినపుడు రావచ్చునని చెప్పిపంపిరి. పిమ్మట ఆచార్యులు మధురయాత్రకు బయలుదేరగా మహాబలి బాణనాథరాయడను రాజు వారిమాహాత్మ్య మును విని శిష్యుడాయెను. ఆరాజు దివ్యరత్నఖచితమైన పల్లకిని సమర్పించి గురువు దానిలో కూర్చుండగా తానును ఆపల్లకిని

మోయుచుండెను. మణవాళమహామునులు ప్రధానశిష్యులతోడను, సకలోపచారములతోడను, రాత్రియందే మహావేగముగ పోయి వైఘకు వచ్చి అచ్చట ననుష్ఠానము తీర్చుకొని రాజుసైతము పల్లకి మోసెనని తెలిసి సంతోషించి ఆరాజుయొక్క భక్తికి మెచ్చి నీప్రార్థనవలన పల్లకిలో వచ్చితిని. ఇక పాదచారిగనే పోవలయు నని చెప్పిరి. ఆరాజు తన కార్యమునకు రావలయునని ప్రార్థించి పిలుచుకొని పోయెను. వారు ఆరాజ్యమునకు పోయి అళగియ తిరుచ్చత్తరని ఆయూరికి పేరుపెట్టి పోవుచుండిరి. దారిలో నొక చింతచెట్టునీడలో విశ్రాంతి పొంది దానిని తమహస్తములతో తాకి అనుగ్రహించిరి. తోడనే ఆమ్రాను కూలి అందలియాత్మ సద్గతి నొందెను. వారు శ్రీరంగమునకు పోవలయునని శీఘ్రముగా పోయి చేరిరి.

ఒకసమయములో పెరియాళ్వారు తిరుమొళికి పెరియ వాచ్చాంపిళ్లె వ్యాఖ్యానము లోపించినందున దానికి తానొక వ్యాఖ్యానము చేయదలంచి శ్రీపరాంకుశ పరకాలాదిదివ్యసూక్తుల కీర్తివిశేషములచెప్పుటకు సహాయముగా తిరుప్పాణాళ్వారు తాదర్ నాయనార్ తగినవారని వారికి శ్రీముఖమువ్రాసి రప్పించి వారి సహాయముతో శిథిలమైన వ్యాఖ్యానమును రచించి, ప్రకృతము దానితో చేర్చియుంచగా కందాడనాయనార్ అనువారు దానిని చూచి యిప్పటివ్యాఖ్యానము మిగుల సమ్మతముగా నున్నదనిరి. ఆచార్యులు శిష్యుని చూచి, రెండువ్యాఖ్యానములలో నొకటిని మాత్రము గౌరవించుటకు కారణమేమని అడుగ పూర్వవ్యాఖ్యానముకంటె, ఇది మహారసజ్ఞులకు ఆదరణీయము. దీనిమీద నాకు ఆదరణ మధికమని చెప్పిరి. ఆచార్యులు అధికబాల్యావస్థలోనే వారికిట్టి జ్ఞానము కలిగినందుకు మిగుల సంతోషించి అవతార పురుషుడని ఆలింగనము చేసికొనిరి. ఈవ్యాఖ్యానంబునకు గొప్ప

సహాయముచేసిన తిరుప్పాణాళ్‌హార్ తాదరనైనార్యునకు బహు మర్యాదలు చేసిరి. రసజ్ఞులందరు చాల మెచ్చుకొనిరి. మణవాళ మహామునులు పట్టూరి సింగరాచార్యులిచ్చిన ధనమును సద్వినియోగపరచిరి. వానమామలజియ్యరు, పార్‌మంగతిరువేంగడముని, పరవస్తుపట్టరపిరాంజియ్యరు, కోవెలకందాడఅణ్ణన్, ప్రతివాది భయంకర అణ్ణన్, ఇరుంబియప్పా, అప్పిళ్ళై అప్పిళ్ళారనెడు అష్ట దిగ్గజములచేతను తిరుమలయెంబెరుమానార్‌జియ్యరు, పట్టూరి సింగరాచార్యులు మొదలగు మహాదేశికులచేతను అనవరతము సేవింపబడుచుండిరి. మణవాళమహామునులకు దేహములో ఉపాధి కలుగగనే వానమామలజియ్యరును చూడగోరి వారిని రప్పించి చూచిరి. ఉపాధిశమించినట్లుండగా వారిని పంపిరి. మరల కొన్ని దినములకు వ్యాధి హెచ్చగా ''అంతకాలే చ మామేవ'' యను గీతాశ్లోకప్రకారము అరువదిశ్లోకములుగ ఆర్తిప్రబంధమును చేసిరి. అట్టికాలమున ఇష్టమిత్రవర్గమువారందరును చేరి ఆశ్రయించిరి. కడపటికాలమైనందున దివ్యదేశస్వాముల నందరిని అనుసంధించుచు వచ్చునపుడు చెల్వపిళ్ళమీద మనసు లయించగా తోడప్పన్ అనువారు నేనచ్చోట నిత్యవాసము చేసెద నని కోరిరి. అట్లే నియమించిరి. పిమ్మట ఉడయవరుల తిరువడిసంబంధియైన తిరుమల నల్లాన్ అనువాని వంశస్థుడగు అణ్ణరాయన్‌చక్రవర్తి అనువారు మిక్కిలి ఆర్తితో మిగులదూరమునుండి వచ్చి సేవించుచుండిరి. మణవాళమహామునులకు కాలు ముడుచుకొనిపోయి యుండెను. అణ్ణరాయన్ అనువారు ఉడయవరుల సంబంధియని మణవాళ మహామునులు తెలిసికొని గురుభక్తిచేత వచ్చిన అతని శిరస్సుమీద అదివర కెవ్వరిచేతను కదలించుటకు వలనుపడకయుండిన తమ తిరువడిని ఉంచిరి. భక్తవాత్సల్యముచేత అపాద మట్లు సరిగా వచ్చెను. అయద్భుతము నందరు చూచిరి. మణవాళమహామునులు

ఉత్తమనంబిని పిలిపించి సన్నిధివ్యవహారములలో మీవిషయమున చాల అపచారపడితిని మన్నించవలయునని కోరుకొనిరి. అంత్య కాలముసమీపించగా శిష్యులు తైత్తిరీయోపనిషత్తులో బ్రహ్మవల్లి, శ్రీభాష్యము మొదలగునవి పారాయణము చేయుచుండిరి. రుధిరో ద్గారి సంవత్సరమున ఆస్తికులందరు వేచియుండగా బ్రహ్మకపాల మును భేదించి పరమపదము చేరిరి. వారిజన్మముమొదలు అంత్యమువరకు జరిపిన అద్భుతకార్యములకు పరిమితి లేదు. తాను ఆదిశేషుడను సంగతిని సాక్షాత్తుగ తెలిసి తన ప్రభావముచేత అహంకార మమకారములను పోగొట్టిరి. మాసిమాసము శుక్లపక్ష ద్వాదశి శనివారము శ్రవణనక్షత్రమున స్వస్థానము చేరిరి. వారు యతిపతి అవరావతారమైనను ఆచారజ్ఞానలక్షణాదులచేత ఉభయ వరులను బోలిన వారైనను గురుభక్తిని విశేషముగ వ్యక్తపరచిరి.

## వేదాంతదేశికుల చరిత్రము

మనము ఉద్దేశించినవారివిషయము తెలిసిననేకాని వారి యందు భక్తి, వారు రచించిన గ్రంథములందు విశ్వాసము కలు గదు. కావున వారి మాహాత్మ్యములను చక్కగా నెరిగి వారిమార్గము ననుసరించినయెడల అవశ్యము భగవదనుగ్రహము కలుగును. అందుకొరకే ఆళ్వారాచార్యులు, భాష్యకారులు, భట్టరు మొదలగు వారి దివ్యచరిత్రములు తెలుపబడెను. ఆమార్గమును అనుసరించిన యిరువురిలో మణవాళమహామునుల చరిత్రము చెప్పబడినది. ఇపుడు వేదాంతదేశికులచరిత్రము తెలుపబడుచున్నది. వీరిరువురి విషయములో వడగల తెన్‌గల అను ఉపభేదములచేత అసూయా పరు లగుచున్నారు. వారలమాహాత్మ్యమును చక్కగా నెరుగకుండు టయే అసూయకు కారణము. మనసంప్రదాయపరులైన ఆచార్యుల యందు విశేషభక్తి కలిగియుండినను వేదాంత దేశికులయందు అసూయలేక సరసముగా ఇరువురిదయకు పాత్రులు కావలయు

ననియే వీరిచరిత్రములు తెలుపబడుచున్నవి. అనేకులగు కువాదు లేర్పడి వేదములకు అపార్థములు కల్పించగా వేదము దుఃఖించెను. ఆవేదము ననుసరించి అనేక ఋషులు శాస్త్రపురాణాదులను రచించి యుండుటచేత దానికిని దుర్దశవచ్చినందున మాయావాదము కలి యుగ మాహాత్మ్యము వలన తలయెత్తి ఆడుచుండెను. ధర్మము అడుగంటి పోయెను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

అను భగవద్గీత 4 అధ్యా. 8శ్లోకమున చెప్పబడినట్లు భగ వంతుడు అవతరించవలసియుండినను కలియుగమున అట్టి సంక ల్పము లేదుగాన తనకు ప్రతినిధిగా తన గంటను పంపిరి. ఆ యంశజులే వేదాంతదేశికులు. ద్వితీయపరతంత్రస్వతంత్ర పర కాలజియ్యరు పన్నీరాయిరప్పడిలో వేదాంతదేశికుల చరిత్రమును విస్తారముగ వ్రాసియున్నారు. దానిని తృతీయపరతంత్రపరకాల జియ్యరు మువ్వారాయిరప్పడిలో సంగ్రహముగ వర్ణించి యున్నారు.

కాంచీపట్టణము మిగులపుణ్యస్థలము. క=బ్రహ్మ, ఆయన చేత, అంచ్=పూజింపఁబడుటచేత దానికి కాంచి యని పేరు కలి గెను. అది స్వామియజ్ఞమున బ్రహ్మవలన వపాయాగముచేత ఆరాధింపబడిన స్థలము. ఆక్షేత్రము శ్రవణముచేతను సకల పాపములను హరించునట్టిది. ముప్పదిమూడు కోటుల దేవతలు వసించునట్టి ఆదివ్యస్థలమందు తిరుత్తంగాల్ అను ప్రదేశమున దీపప్రకాశస్వామిసన్నిధికి సమీపమున అనంతదీక్షితుల పుత్రుడగు పుండరీకదీక్షితు లనువారు వసించుచుండిరి. అతనిపుత్రుడగు అనంతసూరి సకలకళాపూర్ణులు. చంద్రోత్పత్తివలన క్షీరసముద్ర మునకు ఖ్యాతి కలిగినట్లు, విశ్వామిత్రుల గోత్రమున పుట్టిన

అనంతసూరివలన ఆ వంశమునకే గొప్పఖ్యాతి కలిగెను. ఇట్లని ప్రతివాదిభయంకర అణ్ణన్ సప్తతి రత్నమాలయను గ్రంథమున చెప్పియున్నారు. అనంతసూరి తోతారమ్మను పెండ్లాడెను. అప్పిళ్ళానను వారు ఆమె సహోదరులు. ఉడయవరుల కాలములో తిరుక్కురుగురై పిరాన్‌పిళ్ళాన్ అనువారిని తలచి వీరిని చూచినపుడు వారివలెనే తోచినందున వీరికి అప్పిళ్ళాన్ అని పేరు వచ్చినది. వారినామము రామానుజన్. తోతారమ్మకు సంతతిలేనందున ఆమెకు మిగుల విచారము కలిగెను. అనంతసూరి భగవంతునిమీద భారమువేసి యుండిరి. ఉడయవరులు తమకు శంఖచక్రములను ధరింపజేసిన ఉపకారులగుటచేత వారికి ప్రత్యుపకారమును చేయ దలచి తిరువేంగడముడయాను కాలమును నిరీక్షించియుండిరి. రామానుజమతమునకు లోపము రాగా, జీర్ణోద్ధారణము చేయుటకై ప్రత్యుపకారముగ తమ గంటను బంపిరి. కృతజ్ఞతను దెలుపుటకై అనంతసూరి స్వప్నమున ప్రత్యక్షమై భార్యాసహితుడవై నాసన్నిధికి రమ్ము; నీకు దివ్యపుత్రుని ప్రసాదించెదను అని స్వామి చెప్పెను. మహాలక్ష్మి వారిభార్యస్వప్నమున నొకసుమంగలి రూపమున ప్రత్యక్షమై "సన్నిధికి వచ్చిన అనుగ్రహము కలుగు"నని సెలవిచ్చెను. భార్యాభర్తలిరువురును నిదురలేచి పరమానందభరితులై తిరుమలకు బయలుదేరిరి. బాగుగ చదివినవాడు పరీక్షయందు కృతార్థుడగుట నిశ్చయముగ నుండినను పూర్ఖులు వేయువాడు నీకు సహాయము చేసెద ననినపుడు సందేహమే లేనటులు సాధారణముగ తిరుమలకు పోయిన సంతతి గలుగుట సహజము. ఇక స్వామివారు తాయారు చెప్పియుండగ సందేహమా? కుంటి, గ్రుడ్డి, చెవిటి, వంధ్య మొదలగు కొందరు చేరి తిరుమల యాత్రార్థమై బయలుదేరిరి. మూగవాడు బయలుదేరినపుడే ఒక శ్లోకమును చెప్పుచు వచ్చెను. చెవిటివాడు దానిని విని ఆనందిం

చెను. గుడ్డివాడు దీనినిచూచి ఆశ్చర్యపడెను. చేయిలేనివాడు కల్యాణాద్భుతయను తిరువేంగడముడయానుపరమైన శ్లోకమును గడగడ వ్రాయ నారంభించెను. కాలులేనివాడు డోలిలేకయే నేను వచ్చెద నని వేగముగ నడచివచ్చెను. వంధ్య నాల్గుమాసముల గర్భిణి యాయెను. ఇట్లు ప్రయాణ నిశ్చయములోనే యింత గొప్ప లాభములు బడయుటను చూచినట్లు ఒకానొక మహనీయులు చెప్పి యున్నారు.

ఇట్టి మాహాత్మ్యముగల తిరుమలకు భార్యాభర్త లిరువురును పోయి భక్తితో స్వామి సన్నిధిలో స్వామిని దర్శించి తమస్థలము నకు పోయి పరుండి మార్గాయాసముచేత నిద్రించిరి. ఆరాత్రి తిరువేంగడముడయాను అనంతసూరి స్వప్నమున బ్రాహ్మణ రూపముతో ప్రత్యక్షమై వారిని లేపి తనతో తెచ్చిన తన పూజా ఘంటను వారిచేతికిచ్చి దీనిని నీభార్యచేతి కిమ్ము; ఆమె దీనిని భుజింపనిమ్ము. ఈఘంటాంశమున నీకు సత్పుత్రుడు కలుగును అని చెప్పెను. అనంతసూరి బ్రాహ్మణుని తేజస్సు చూచి వచ్చిన వారు భగవంతుడే యని తలచి సంతోషముతో లేచి భార్యను లేపి గంట నిచ్చి మ్రింగు మనెను. ఇంత గట్టివస్తువు నెట్లు మ్రింగుదు నని ఆమె యోచించ లేదు. ఇంతదూరము రప్పించిన ప్రభువునకు తెలియదా యని తలచి భక్తితో మ్రింగెను. అది గళగళయనుచు లోపలికిపోయెను. వా రాఘంటను పారవేసినయెడ తనకు ఘంట లేక పోవునని తలచి ఆమె మ్రింగువరకును స్వామి కాచియుండెను. "భాద్రపదమాసమున మీకు సంతానము కలుగు" నని చెప్పి స్వామి అంతర్ధాన మాయెను. ప్రాతఃకాలము కాగా వారు లేచి పరమానంద ఆశ్చర్యభరితులై పరమభక్తితో స్వామిపుష్కరిణిలో స్నాన మాచరించి సన్నిధికి పోయిరి. ఘంట లేనందున అర్చకులు అందరిని విచారించి సంగతి తెలియనందున అధికారులకు దెలిపిరి.

వారు పరిచారకులను, అర్చకులను బంధించి మీకుతప్ప ఇతరులకు సంబంధము లేదు. కాన నిజము చెప్పవలెను. లేనిచో గొప్పదండన విధింపబడునని హింసించుచుండిరి. ఈభార్యాభర్తలా హింసను చూచి రాత్రి జరిగిన సంగతినిచెప్ప సంకోచించి నిలిచియుండగా, తిరుమలజియ్యరు అనువారు వచ్చి ఘంటవిషయము తనకు స్వప్నములో స్వామి చెప్పియున్నారు. కాన బంధించియుండువారిని వదలిపెట్టు డనిరి. అధికారులు వారిని విడచి, ఆదంపతులను విచారించి, తెలిసికొని వారిని మర్యాదతో సన్నిధిలోపలకు పిలుచుకొని పోయి సేవింపజేసి బహుమర్యాదలు చేసిరి. వారిభాగ్యమునకు ఆశ్చర్యపడి అనేకపుష్పరాసులను వారి శిరస్సులందు కుమ్మరించిరి. వారు అచ్చటనుండి తమ స్వస్థానమునకు (కంచికి) వచ్చి చేరిరి. భగవంతుడు అర్జునునకు రాజసూయయాగనిర్వహణమును, సుభద్రాకల్యాణమును, బావమరదులను, నట్టి బంధుత్వమును; ద్రౌపదీమానసంరక్షణమును, ఖాండవవన దహన కార్యమును, దుర్వాసునిపరీక్షకు భయపడి భగవంతుని స్మరించి పత్రమును సమర్పించి దుర్వాసుని పరీక్షనుండితప్పించుకొనుటయు, సంధికాలమున దూతకార్యమును, సారథ్యమును, మహాద్భుతమైన విశ్వరూప దర్శనముతో గీతోపదేశమును, అశ్వమేధయాగ రక్షణమును అను పదునాలుగు కార్యములను చేసినవాడు. మరియును వరాహావతారమెత్తి భూమిని ఉద్ధరించుట, కంసవధము మొదలగు కార్యములుచేసిన ప్రభువు. శ్రీనివాసకల్యాణమున చెప్పబడినట్లు భృగుమహర్షి తన వక్షఃస్థలమును కాలితో తన్నినందున లక్ష్మి యలిగిపోవుట కారణముగ తిరుమలకు వేంచేసి వకుళాదేవిపుత్రుడైన మహానుభావుడు. అట్టి భగవంతుని సన్నిధిలో ఘంటావిషయమై గొప్పకోలాహలము జరిగెను. కాంచీపురిలో తోతారమ్మ పండ్రెండు సంవత్సరములు గర్భము ధరించియుండెను. చీకటివలన కష్టపడు

ప్రజలు చంద్రోదయమునకు ప్రతీక్షించునట్లు అజ్ఞానావృతమైన ప్రపంచమను చీకటిలో అల్లాడుప్రజలు ప్రతీక్షించుచుండగా, కలియుగము 437 సంవత్సరము భాద్రపదమాస శుక్లపక్ష ద్వాదశియందు విలక్షణమైన గర్భచిహ్నములుగల తోతారమ్మ గర్భమునుండి చంద్రోదయమైనట్లు ఘంటావతారముగా సత్పుత్రుడు జన్మించెను.

తోతారమ్మ గర్భమున జనించిన శిశువు తిరువేంగడముడయానుయొక్క అనుగ్రహమువలన కలిగెను. కాన వేంకటేశుడని నామకరణము చేసిరి. మూడవసంవత్సరమున చౌలము, ఐదవ సంవత్సరమున అక్షరాభ్యాసము జరిగెను. తోతారమ్మ సహోదరుడు అప్పిళ్ళాన్ అనువారు. ఆయన తనమేనల్లునితోడ నడాదూరమ్మాళ్ లేక వరదాచార్యులు అనువారి కాలక్షేపమునకు పోయియుండిరి. అప్పిళ్ళానుతోడ పోయిన బాలుని చూచి వరదాచార్యులవారు తమ కాలక్షేపము నిలిపి మాట్లాడుచుండి మరలనారంభించపోయి నిలిపిన చోటు తెలియక అల్లాడుచుండగా, ఆబాలు డాచోటును ఎత్తి చెప్పెను. వాదిహంస సింహమను బిరుదుగల ఆబాలుని అద్భుత శక్తికి ఆశ్చర్యపడి మిగులసంతోషించి అనుగ్రహించి కటాక్షించిరి. మేనమామయగు అప్పిళ్ళానుకూడ ఆబాలుని మిగుల కటాక్షించిరి. అట్లు వారిరువురు కటాక్షించిన తేజోబలము వేదాంతదేశికులకొక డాలును కలిగించినది. అంతమాత్రమేకాక ఆగొప్ప సభయందు వరదాచార్యులు కాలక్షేపము చెప్పుచుండి గొప్ప ఆక్షేపము చేసిన వారికి సమాధానము చెప్పలేకపోయిరి. ఉపనయనముకూడ కాని బాలుడు వారిసందేహమును అవలీలగ, అనాయాసముగ తీర్చగావిని వరదాచార్యులు ఆశ్చర్యపడి పెక్కుదీవన లిడిరి. ఈసంతోషము ననుభవించిన మేనమామ ఆబాలుని చేయిపట్టుకొని ఇంటికి పిలుచు కొనిపోయిరి. దేశికులచేత చేయబడిన ఒకగ్రంథములో వేంకటేశు

డను నాచేత చేయఁబడినది అని చెప్పుటను ఆత్మప్రశంస యని భావింపకుడు. బాల్యదశలో నడాదూరమ్మాళ్, అప్పిళ్ళాన్ అను వారల కటాక్షవీక్షణమువలన వృద్ధిచెందిన వాడ నగుటచేత నటు లైనను చెప్పవచ్చును అని చెప్పియున్నారు. వీరికి 'వాది హంసాంబు వాహకర్' అను బిరుదుగల మేనమామ ఉపనయనము చేయించిరి. వేదమున వేష్టనము అనగా త్రిప్పిచెప్పినది. అవేష్ట నము అనగా త్రిప్పనిది అని రెండుపదములు గలవు. వారు విధి ప్రకారము వేష్టనపదము వినా తక్కిన దంతయు ఒకపర్యాయము ననే గ్రహించిరి. ఇట్లు వేదశాస్త్రాదుల నభ్యసించిరి. సకలవిద్యా ప్రవీణులైరి. వారి విద్యకు మెచ్చి ప్రపంచములోనివారు కన్యా దాన మొసగ గోరిరి. దేశికులు తిరుమంగయార్ అనునామెను వివాహమాడిరి. వారు ఇరువదియవ సంవత్సరమున శ్రీరాముడు సీతను పెండ్లాడినట్లు మిగుల అందమైన స్త్రీని పెండ్లాడిరి. గృహస్థా శ్రమియై అతిథి, అభ్యాగతులను ఆరాధించుచు భగవదారాధ నాదులు జరుపుచుండిరి. వారి లోకవిలక్షణశక్తికి అసూయాపరుల చేత ఏఆపదయును కలుగకుండుటకును, వారి ఆత్మసంరక్షణము నకు వారిమేనమామ గరుడమంత్రము నుపదేశించగా వారామంత్ర మును అనుసంధించుచుండిరి. దేశికులు ఘంటావతారము. అదిగాక నడాదూరమ్మాళ్, అప్పిళ్ళాన్ అనువారలఆశీర్వాదబలము గలవారు. దానికితోడుగ గరుడమంత్రోపదేశము లభించగా చెప్పతరముగాని తేజస్సుతో ప్రకాశించుచుండిరి. వారట్లు కంచియందు ప్రవచనము చేయుచుండగా వీరవల్లి, పేరరుళాళఅరయురు అనువారువచ్చి ఆశ్రయించిరి. వారు గురుపరముగా నొకశ్లోకము చెప్పిరి. నమః అను సంస్కృతపదమును ఈయాచార్యులకొకరికే ప్రయోగింతు మని ఆశ్లోకమున చెప్పిరి. హనుమంతుడు శ్రీరాముని క్షేమసమా చారమును సీతాదేవితో చెప్పగా ఆమె సంతోషించెను. పైరుకు

జలములేక అల్లాడుచున్నపుడు వర్షము వచ్చినయెడల భూమిగల వారు ఎట్లు సంతోషింతురో అట్లు శ్రీరాముని క్షేమమును వినిన సీత ఆనందమొందెను. ఆప్రకారమే భాష్యకారులవలన కొంతజలము చేత పైరు పెట్టబడి, వారికి పిమ్మట జలములేక అల్లాడుచుండిన పైరుకు వీరు అవతరించి గొప్పవర్షమును గురియించి, సంతోష పరచిరని ఈశ్లోకముయొక్క భావము.

భగవద్గీత 4అధ్యాయమున పండ్రెండువిధములైన యజ్ఞ ములు చెప్పబడుచున్నవి. అందు ఇరువదియెనిమిదవదైన-

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః॥

అను శ్లోకమున యోగయజ్ఞము చెప్పబడియున్నది. యోగ యజ్ఞమనగా దివ్యదేశయాత్ర యని రామానుజభాష్యమున చెప్ప బడెను. అందుచేత ఆసంప్రదాయు లందరును దివ్యదేశ యాత్రను ముఖ్యముగా నుంచుకొనిరి. దేశికులును దివ్యదేశ యాత్రకు బయలుదేరి మధురాంతకమునకు వచ్చిరి. అది భాష్య కారులకు సమాశ్రయణమైన దివ్యదేశము. దేశికులు అచ్చట వేంచేసియుండు శ్రీరాములను సేవించి పరమానందభరితులై "రామా! నీసమాను లెవరు?" అని అనేక విధముల ప్రార్థించి, సీతాదేవిని చూచి "అమ్మా! భగవంతునికి నిగ్రహానుగ్రహములు తెలియును. తల్లియైన మీకన్ననో అన్నియును దెలియును. నిగ్ర హము మాత్రము తెలియదుగాన అట్టి అనుగ్రహస్వరూపిణివి" యని వర్ణించి, లక్ష్మణుని చూచి అంతకంటెను అధికముగ వర్ణించి సంతో షించిరి. అచ్చటినుండి తిరువహీంద్రపురమునకుపోయి దేవనాయ కుని సేవించి, ఔషధపర్వతముమీదనున్న నరసింహస్వామిని సేవించి, అశ్వత్థవృక్షముక్రింద గూర్చుండి గారుడమంత్రమును అనుసంధించుచుండగా గరుత్మంతుడు ప్రత్యక్షమై హయగ్రీవ

మంత్రము నుపదేశించెను. వారు దాని ననుసంధింప నారంభించిరి. హయగ్రీవుడనగా గుఱ్ఱముముఖముగల స్వామి. ఆమంత్రబలము గలవారికి అప్రతిహతమైన వాగ్ధోరణి కలుగును. ఆళవందారులు కాంతాస్తోత్రమున 'వేదాత్మా విహగేశ్వరః' అని గరుడుని వర్ణించి యున్నారు. గరుడుని యొక్క ప్రతిఅవయవమును ఒక్కొక్క వేదమని వేదమే చెప్పుచున్నది. అట్టి గరుడభగవానుడు సాక్షాత్తుగ వచ్చి హయగ్రీవమంత్రమును ఉపదేశించెను. వేదాంతదేశికులు ఆమంత్రముచేత హయగ్రీవమూర్తిని బిలిచిరి. "పరాకుసేయ నిది సమయముగాదు. శ్రీఘ్రముగ రమ్ము" అని ప్రార్థించగా హయ గ్రీవమూర్తి ప్రత్యక్షమాయెను. ఆస్వామి మంత్రావృత్తి అధిక మైనందున గుర్రమువలె వేగముగ పరుగెత్తి వచ్చిరి. అగుర్రము వేగముగ రాగా నోట నురుగు వచ్చెను. దేశికులు ఆనురుగు నెత్తి అమృతమునువలె పానము చేసిరి. స్వామిదర్శనమును, నురుగును స్వీకరించుటచేత వారు మహావాగ్ధోరణిగలవారై గరుడభగవానుని మీద పంచాశత్శ్లోకములుగల ఒకగ్రంథమును, హయగ్రీవపర ముగా నొకగ్రంథమును రచించిరి. పిదప దైవనాయకుడను పెరు మాళ్ళు నన్నుగూర్చి యొకగ్రంథమును చేయరాదా యని మిగుల వేడుకొనిరి. దేశికులాపురుదినమే 'దేవనాయక పంచా శత'మను గ్రంథమును చేసిరి. స్వామీ! నన్ను గొప్పస్థితిలో నుంచ వలయునని భక్తుడు స్వామినడుగగా నీతలవిధి యెట్లున్నదో యని వారనిరి. ఆవిధిమీద మన్ను వేసి మూయరాదా యని భక్తుడనగా ఏధూళి వేయుదునని స్వామి యడిగెను. మీపాదధూళినని భక్తుడు చెప్పెను. దేశికులిట్లు చమత్కారముగా దైవనాయకుని విషయ మును వర్ణించిరి. మరియు భక్తిలేని, తముపాదధూళి సంబంధము లేని అయోగ్యుల సహవాసము నాకు బొత్తిగాలేదు. నాయొక్క సూక్తులకు ఒకరు కల్పించి అర్థముచెప్పవలసిన పనిలేదు. స్వయము

గనే అనేకఅర్థములు కలిగియుండును అనియు వ్రాసిరి. ఇట్లు భగవద్విషయమై పంచాశతమను గ్రంథమును రచించి పిమ్మట అచ్యుతశతకమును ప్రాకృతభాషలో చేసిరి. మధురాంతకములో వాసముచేయుచు 'రఘువీరగద్యము' చేసిరి. 'గోపాలవింశతి' యని యిరువదిశ్లోకములను రచించిరి. అచ్చటినుండి తిరుక్కోవలూరికి పోయి ఉలగమళంద పెరుమాళ్ విషయముగ దేహళీయస్తుతి చేసి, కాంచీపురికి పోయి, వరదుని సన్నిధిలో భరన్యాసము, శరణాగత దీపిక, న్యాసశతకము మొదలైన గ్రంథములు రచించిరి.

ఆయూరిలోని మహావిద్వాంసులమధ్య వీరు హయగ్రీవ మంత్రప్రభావముచేత అనేకగ్రంథములను చేయుటచూచి అచ్చటి విద్వాంసు లందరు వారిఅద్భుతశక్తికి మెచ్చి 'కవితార్కికసింహ' డని బిరుదునిచ్చిరి. మహావిద్యాలయమైన కాంచీపురియందలి విద్వాంసు లందరు వారిగృహమునకు వచ్చి ప్రశంసించుచుండిరి. వైశాఖోత్సవమున గరుడసేవ లభించగా దేశికు లాసమయమును వర్ణించిరి. ఆదినము సూర్యుని తేజస్సు భగవంతుని తేజస్సులో అణగిపోయి పగటిపూట వెలిగించిన దీపమువలె నుండెను. జనులు పరమభక్తితోకూడి గుంపులుగ నుండుటను జూచి భగవంతుడు మందస్మితముతో బయలుదేరిరి. అట్టి వైశాఖోత్సవమున గరుడ సేవకై వచ్చియుండిన విద్యారణ్యస్వామితో దేశికులకు వాదము కలిగి వారిని జయించిరి. వేదమునకు భాష్యముచేసిన ఆకవిచేత గొప్పఅవతారపురుషుడని ప్రశంసింపబడిరి. తిరుక్కురుగురైపిరాన్ పిళ్ళాన్ అనువారు ఆరాయిరప్పడివ్యాఖ్యానము చేసినపుడు భాష్య కారులు మెచ్చి తన ఆరాధ్యదైవమైన హయగ్రీవమూర్తిని వారి కిచ్చియుండిరి. ఆవంశపరంపరలోనివారును, అప్పిళ్ళాన్అనువారి అల్లుడును అగు పుండరీకాక్షులకడకు ఆవిగ్రహము చేరియుండెను. భాష్యకారులు వారిస్వప్నములోపోయి ఆస్వామిని దేశికులయొద్ద

చేర్చవలయునని సెలవిచ్చిరి. వారు స్వామియాజ్ఞను నెరవేర్చిరి. దేశికులావిగ్రహము నారాధించుచున్న సమయమున తిరుమలలో జరుగు బ్రహ్మోత్సవమునకు పోవలయునని వారికి కోరిక గలిగెను. వారు కాంచీపురినుండి శిష్యులతోడ బయలుదేరి తిరుమలకుపోయి ఉత్సవము సేవించి అచ్చటనే యుండవలయునని తోచగా నుండిరి. భవిష్యోత్తర పురాణమున వర్ణింపబడిన శ్రీనివాసునియొక్కయు, తిరుమలయొక్కయు ప్రభావమును, వారియొక్క దయనుచూచి ఆనందించి దయాశతకమును చేసిరి. ఈప్రభువు మహాజనకుడగుట చేత లోకోద్ధారణము చేయుటకై వైకుంఠమును వదలుటకు భార్యతో కలహమును పెట్టుకొనెను. అట్టి దయామయుడితడు అని స్తుతించిరి. అచ్చటినుండి వడమధురకు వచ్చి తుంగభద్ర చేరి విద్యారణ్యస్వామిని చూచిరి. ఆస్వామి వేదమునకు వ్యాఖ్యానమును తాటిఆకులలో వ్రాసియుంచిరి. అది విస్తారముగా నున్నందున ఆద్యంతములు తెలియకపోయినందున, వారు దానినొక బండిలో వేసి గంగలో వేయుటకు పోవుచుండగా నెదుట నొక వేటగాడు నాలుగుకుక్కలతోడవచ్చి సంగతి యేమని విచారించి తెలిసికొని ప్రయోజనములేదని పారవేయుదాని నిచ్చటనే వేయుడు. నేను గంగలోవేసెదను అనిచెప్పెను. వారు అట్లే పారవేయగా వేటకాడు కుక్కలకు సంకేతముచేసెను. ఆకుక్కలు గ్రంథపత్రములను నాలుకతో నాకెను. తోడనే యెత్తిచూడగా కడుచక్కగ విశదమాయెను. అందుచేత నలుగురు వేదపురుషులు ఆవ్యాఖ్యానము మాకు సమ్మతమని చెప్పినటులాయెను. తోడనే ఆపురుషుడు, కుక్కలు అంతర్ధాన మొందిరి. అట్టి మహానుభావులైన విద్యారణ్యస్వామిని ఒకరాజు ఆశ్రయించి బ్రహ్మరక్షస్సును పోగొట్టుకోలేక దేశికులను ఆశ్రయించెను. ఆస్వల్పకార్యమునకై తనతపఃప్రభావమును వినియోగపరచుటకు ఇష్టములేనందున వారు తమవల్లకాదని

చెప్పి శ్రీపెరంబూదూరికి పోయి యతిరాజులను సేవించిరి. విద్యా రణ్యస్వామి మరల ప్రయత్నించి బ్రహ్మరక్షస్సును తొలగించి విజయనగరరాజును స్వాధీనముచేసికొని దేశికులయొక్క ప్రభావ మును స్మరించి, దేశికులను రప్పించి బహుధనరాసుల నొసగ వలయునని రాజుతో చెప్పెను.

దేశికులకు బహుధనరాసు లీయవలయునని విద్యారణ్య స్వామి విజయనగరరాజుతో చెప్పగా ఆరాజు దేశికులకు జాబు వ్రాసెను. వారికి ఉత్తరప్రత్యుత్తరము లిట్లు జరిగెను.

దేశి : నీవు ప్రపంచములో నొకభాగమునకు ప్రభువుగ నున్నావు. ఇట్టి నీవు నాకు ప్రభుడవు కానేరవు. సర్వలోక పాలకుడైన ప్రభువే ప్రభువు.

రాజు : నాయొద్దకువచ్చిన ధనరాసులు లభించును.

దేశి : నాకు నీధనముతో పనిలేదు. అట్టి యిచ్ఛకలిగిన నాకిచ్చుప్రభువు ఉన్నాడు.

రాజు : ఎవ రున్నారు ?

దే : కుచేలస్వామికి ఇచ్చినవారు. సాధారణరాజులను ఆశ్రయించి బ్రతుకు సాధారణకవినిగాను అని తిరస్కరించి వ్రాసిరి. ఇట్టి వీరిధైర్యమునకు అందరు ఆశ్చర్యపడవలదా ? విజయనగర రాజు ఒకటికి రెండులేఖలు వ్రాసెను. ప్రయోజనపడలేదు. ఈవిష యమును చూచి కొందరు అసూయపడి ఒక బ్రహ్మచారిని దేశికుల కడకు పంపిరి. ఆబ్రహ్మచారి వారు చెప్పినట్లు దేశికుల నాశ్రయించి వారిని మెప్పించిరి. నీ కేమికావలయునని వారడుగగా ద్రవ్యము కావలె ననెను. ఇది అసూయాపరుల కార్యమని తెలిసి, దేశికులు బ్రహ్మచారితోడ పెరుందేవితాయారు సన్నిధికిపోయి శ్రీస్తుతిచేయ నారంభించిరి. ఒక్కొక్కశ్లోకమున కొక్కొకతూము స్వరములు కుర్మ్మరిల్లెను. ఇరువదియారుశ్లోకములకు 26తూముల

సవరములు కాగా వటువు ఎత్తలేక యిక చాలు నిలుపుడని కోరు కొనెను. అంతటితో సమాప్తి చేసిరి. ప్రికృతి ముక్కోణమైన పలక. స్వామి, తాయారు ఆడెడువారు. బ్రహ్మాదిదేవతలు పలకలో నుంచబడిన కాయలవంటివారు. ఇట్లుంచుకొని లీలగా ఆడు చున్నారు కదాయని ఒకశ్లోకమున వర్ణించిరి. శోధించవచ్చిన ఆబ్రహ్మచారి మహాసంతోషముతో గొప్ప లాభమును పొందెను. ఇట్లున్నసమయమున శ్రీరంగమున కొందరు మాయావాదులు చెలరేగి వాదమునకు రావలయును. ఈసిద్ధాంతము సరియని నిశ్చయమైన పిమ్మటనే భగవదారాధనము జరుపవలయును అని ఆక్షేపించిరి. అపుడు పెరియవాచ్చాంబిళ్ళ, పిళ్ళలోకాచార్యులు దేశికులకు జాబువ్రాయగా వా రాజాబును చూచి అచ్చటికిపోయి దుర్మతమును ఖండించి, రంగనికి ఆరాధనము జరిపించియే గంగాపానము చేయవలయునని నిశ్చయించి వాదమునకు ఆరంభించి యెనిమిదిదినములు వాదించి, అర్జునుడు బాణములను వేసి శత్రువులను జయించినట్లు, అనేకఅర్థములు, యుక్తులు అను బాణములనువేసి జయించిరి. తోడనే వారు శరణాగతులైరి. రంగ నికి ఆరాధనజరిగెను. ఆరాత్రి భాష్యకారులు దేశికుల స్వప్నమున ప్రత్యక్షమై "నాయనా! నీవలన నామతము కాపాడబడినది. శత్రువులచేత నాసిద్ధాంతము, రంగనాథుడుమొదలు అన్నియును నశించిపోవునని భయపడుచుంటిని. ఆభయము నీవలన పోయినది కావున నీవు నాప్రతినిధిగా నుండుమని ఆశీర్వదించిరి. ఆయెని మిదిదినములు జరిగినవాదమును పరిశీలించిచూడగా ప్రతిపక్షుల మీద శతదూషణము తేర్పడియుండెను. అది శతదూషణమను గ్రంథముగ నేర్పడినది. దానిని పెద్దలందరును అంగీకరించిరి. అటుపిమ్మట వేదాంతాచార్యులని రంగనాథుడు బిరుదునిచ్చెను. తిరుప్పాణాళ్వారుచేసిన పదిపాశురములుగల అమలనాథపిరాన్

అనుదానికి వ్యాఖ్యానముగ భగవద్ధ్యానసోపానమును రచించిరి. అమలనాథపిరానునందు భగవంతుని పాదమునే ముఖ్యముగ వర్ణించియుండునట్లు వీరు చరణప్రభావమునే సోపానముగవర్ణించి యున్నారు. యతిరాజసప్తతి, సోపానసప్తతి అనుగ్రంథములను చేసిరి. సూర్యప్రకాశముచేత చీకటియున్నచోటు తెలియకపోవు నట్లు, దేశికులు ప్రకాశించుచుండగా మాయావాదులు ఉన్నచోటు తెలియక పోయిరి. పెరియవాచ్చాంబిళ్ళ ఉంఛవృత్తికి పోవునపుడు వీరిప్రవచనమును మరుగుననుండి విని మిగుల సంతోషించి రామా నుజ సిద్ధాంతమునకు వీరివలన గొప్ప ఆధారముల నేర్పరచ వలయునని తలచి వారిని పిలిచి మనసిద్ధాంతమునకు ముఖ్యమైనది శరణాగతి. దానికి సరియైన గ్రంథములేర్పరచవలయునని కోరిరి. దేశికులు అట్లేకా నిమ్మని చెప్పి న్యాసశతకము, న్యాసవింశతి, శరణాగతి గద్యము అనుగ్రంథములను చేసి సమర్పించగా పెరియవాచ్చాంబిళ్ళ పరమానందభరితులైరి.

తర్వాత విద్యారణ్యస్వామి విజయనగరమునం దున్నపుడు అక్షోభ్యతీర్థులు అను ద్వైతసిద్ధాంతి అద్వైతియగు విద్యారణ్య స్వామితో వాదము చేయవలయునని వాంఛించిరి. వైష్ణవసిద్ధాంతి యొకరు కావలసియున్నందున దేశికులను రావలయునని కోరిరి. నేనువచ్చుటకు వలనుపడదని వారు చెప్పిరి. వాదము జరుగనిండు. పిమ్మట వారికి పంపి నిశ్చయమెరుగుద మని రాజు చెప్పెను. జరిగినవాదమును దేశికులకు పంపిరి. వారు దానిని చూచి 'తత్త్వ మసి' యనువాక్యముచేత (అసి యనగా ఖడ్గముగాన దీనిచేత) విద్యారణ్యమును వారిని ఖండించిరని తీర్మానించిరి. అక్షోభ్యులు అనగా ఎవరిచేతను కదలించుటకు వీలుకానివారు. వారి కాపేరు తగియున్నదనిరి. విద్యారణ్యస్వామికి కోపము వచ్చెను. దేశికులు చేసిన శతదూషణమను గ్రంథమును పంపినయెడల నేను ఖండించ

గలసని చెప్పి వారిగ్రంథమును తెప్పించి అందులో తప్పు దొరక
నందున ఒకచకారము అధికమని గుర్తుపెట్టి పంపిరి. దేశికులు
విద్యారణ్యుల గురుతుమీద మరియొక గురుతుపెట్టి అందుకు సమా
ధానముగ చకారగ్రంథమనుదాని నొకటిచేసిరి. వారు మరల
యాత్రికు బయలుదేరి వరాహస్వామియున్న స్థలమున చేరి
యున్నపుడు కృష్ణమిశ్రులు అనువారిని శాస్త్రమున జయించిరి.
వారు తాముచేసిన ప్రబోధ చంద్రోదయమును చూడవలయునని
కోరగా, నేను సంకల్పసూర్యోదయమును చేసియున్నాను, చూడు
డని దేశికు లనిరి. చూపుడని వారడుగగా ఉదయమున నిచ్చెదనని
చెప్పి దేశికు లారాత్రియే భగవదనుగ్రహమున గ్రంథమును
రచించి అతనికిచ్చి జయించిరి. పిమ్మట డిండిమకవి అనేక బిరు
దములతో వచ్చి రామాభ్యుదయము చూడవలయునని కోరిరి.
దేశికులు యాదవాభ్యుదయకావ్యమును వారికి చూపి అప్రతిహత
ముగ వెలుగొందుచు కుంభకోణమునకు పోయి శార్ఙ్గపాణిని సేవించి
శ్రీవిల్లిపుత్తూరి కేగి ఆండాళుపరముగా గోదాస్తుతిచేసి శ్రీరంగము
నకువెళ్లి కొన్నిదినములుండి మరలయాత్రికు బయలువెడలి చుట్టు
కొని కాంచీపట్టణమునకు వచ్చి చేరిరి. ఒకపాములవాడు పామును
దెచ్చి దీనిని బంధించగలరేని మీ సర్వతంత్రస్వతంత్రబిరుదము
నిజమగును అని చెప్పగా అట్లే కానిమ్మని చెప్పి దేశికులు ఏడు
గీతలను గీచి పామును వదలుమని చెప్పిరి. ఆపాము ఆగీతను
ధాటలేక అచ్చటనే తిరుగుచుండినది. దేశికు లపుడు గరుడదండక
మును రచించగా గరుడ భగవానుడు వచ్చి ఆసర్పము నెత్తుకొని
పోయెను. వాడు పాముపోగా మిగుల చింతించెను. అసూయ
గొన్నవా డొకడు మంత్రప్రయోగముచేసి వారికి కడుపు ఉబ్బ

నట్లుగ చేసెను, దేశికులు శిష్యుని పిలిచి తోటయందుండు అరటి. చెట్టును కొట్టివేయు మనిరి. అతడట్లే చేయుగ ఊనీరు ఆచెట్టు మూలముగ పోయెను. మరల తిరుక్కోవలూరికి సమీపమున పోయినపుడు హయగ్రీవమూర్తికి సరియైన ఆహారమీయక గోప పురియను ఆతిరుక్కోవలూరియందొక పెద్దలయింట నిలిచి తీర్థ మును హయగ్రీవమూర్తికి నైవేద్యమొసగి పరుండిరి. ఆరాత్రి హయగ్రీవమూర్తి వారిగృహమునందుండిన ఉలవలనెల్ల తిని ఆ యింటివారికి, దేశికులకు దర్శనమిచ్చి భుక్తశేషము ననుగ్రహిం చిరి. తిరువహీంద్రపురమున నొకశిల్పి కొల్లెత్తుపనియందు నేర్పు చూపిననే మీబిరుదు నిలుచుననగా దేశికులు వాని యిచ్ఛానుసార ముగా బావికట్టి వానిని జయించిరి. యాత్రాపరు లిప్పటికిని ఆ బావికి ప్రదక్షిణనమస్కారములు చేయుట వాడుకలోనున్నది. పిమ్మట శ్రీరంగమునకు వచ్చి శ్రీభాష్యప్రవచనము చేయుచుండగా పిళ్ళలోకాచార్యులు మొదలగువారు మెచ్చుకొనిరి. కొందరు అసూయాపరులు దేశికులు ప్రాతఃకాలమున స్నానమునకు పోవు మార్గములో వారిశిరసునకు తగులునట్లు పాదరక్షలు కట్టియుంచిరి. వా రదిచూచి నాకు జ్ఞానయోగ, భక్తియోగాదులు లేవు. ఈవైష్ణ వుల పాదరక్షయే శరణమని సంతోషించిరి. ఇతరులకు ఇంత అసూయ కలుగదు గాన నిదివైష్ణవుల పాదరక్షయే యని దేశికులు నిశ్చయించిరి. వారి శాంతశమదమాదులకు అందరు సంతోషించిరి. ఒకసారి దేశికులతండ్రి తిరువధ్యయనము రాగా అసూయాపరులు నిమంత్రణమునకు చెప్పియుండిన బ్రాహ్మణులకు ధనమిచ్చి వారిని తిథి కరుగకుండునట్లు చేసిరి. అపుడు రంగనాథుడు, వరదరాజు, తిరువేంగడముడయాను ముగ్గురు బ్రాహ్మణులుగ వచ్చి బ్రాహ్మ

ణార్థముచేసి వెలుపలికివచ్చి అంతర్ధాన మొందిరి. దేశికులు అది చూచి నేను నిరపరాధినైనను నాకిట్లు కీడుదలచుచున్నారు అని రంగనాథుని సన్నిధికిబోయి, "స్వామీ ! నీవలన కావలసిన లాభ మొకటి యున్నది. ముఖ్యముగా నాకు కావలసినది రామానుజ సిద్ధాంతము. అది ఆచంద్రార్కముగ నున్నది. కాన దానికై భయములేదు. సంప్రదాయము మిక్కిలి చక్కనిదైనను అసూయ మాత్రము వాసము చేయుచున్నది. మనవారిని వదలుమనిన వద లరు. కాన ఆయసూయను పిలిచి శ్రీవైష్ణవులు మావారు కావున నీవు వారిని వదలిపెట్టుము అని ఆజ్ఞాపించవలయునని కోరుకొనిరి.

ఒక యేకాదశిదినమున వేదాంతదేశికులు రంగనాథుని సన్నిధికిపోయి తీర్థమును తీసికొనగా ఆతీర్థముతోడ నొక పొంగలి యుండ చేతపడెను. దేశికులు తీర్థమును మాత్రము స్వీకరించి ఆభగవత్ప్రసాదమును విడచుటకును, ఉపవాసదిన మగుటచేత భుజించుటకును లేక యోచించుచుండగా ఒకనికి ఆవేశమువచ్చి అట్లు చేసినఅర్చకుని చెంప వాయించెను. అసూయాపరులు తనకు రెండురూపాయ లిచ్చి అట్లు చేయుమనిరని అతడు చెప్పెను. దేశికులు ఉంఛవృత్తికిరాగా బియ్యముతోడ సవరములను గలిపి వేసిరి. దేశికులు భార్యచేతి కీయగా ఆమె చెరిగి బియ్యము నెత్తుకొని సవరములను పారవేసెను. వారి గుణము నట్లు పరీక్షించిరి. ఒకరు పదకమల సరసగ్రంథమును చేసియున్నానని అహంకరించగా దేశికులు ఒకరాత్రిలో పాదుకాసహస్రమును చేసి వారిని జయించిరి. తిరుక్కురుగురాన్ పిళ్ళాన్ చేసిన ఆరాయిరప్పడికి 76 ఆయిరప్పడి చేసిరి. శింగరప్పరనువారు తమకు సావకాశము లేనందున సంగ్రహముగా కొన్ని విషయములను తెలుపవలయునని

కోరగా దేశికులు వారుకోరినట్లే వ్రాసియిచ్చి ఆయనను శిష్యునిగ చేసికొనిరి. పిమ్మట దేశికులకు పుత్రుడు కలిగెను. వానికి వరదాచార్యులు లేక నయనాచార్యులు అనిపేరు. ఆయన తండ్రివిషయమై ఒకతనయ చేసిరి. గొప్పవిద్వాంసుడగు సుదర్శనభట్టరు మొదలగువారు దానిని మెచ్చిరి. ఆపుత్రుడు కలియుగము 4418వ దగు నళసంవత్సర శ్రావణమాస రోహిణీనక్షత్రమున వరదుని అంశమున జన్మించెను. ఆసంవత్సరమును తలచినయెడల పాప పరిహార మగును. దేశికు లొకనాడు వ్యాఖ్యానము చేయుచుండగా కందాడ లక్ష్మణాచార్యులు శిష్యునితోడ ఆవీథి నరుగు చుండిరి. ప్రవచనమందలి రుచిచేత దేశికులు లేచి వారిని సేవింపకుండిరి. ఆయాచార్యుల శిష్యులు అందుకు సహించక దేశికులయొద్దకువచ్చి వారికి నమస్కారము చేయలేదేమి యని కోపించి వారికాళ్ళు పట్టుకొని యీడ్చివేసిరి. నేను వారిని సేవింపనిది తప్పేయని దేశికులు త్వరగాపోయి కందాడలక్ష్మణాచార్యులను సేవించిరి. సరి పొమ్మని వారు పోయిరి. ఆమరునాడే దేశికు లాచోటు విడిచి సత్యమంగలము అను మరియొకచోటికి పోయి చేరిరి. శిష్యులు చేసిన అక్రమమును సమ్మతించిన గురువునకు ఆరాత్రియే పాదాది కేశ పర్యంతము కుష్ఠురోగము సంప్రాప్తించెను. ఆయన తమకు కుష్ఠురోగము కలుగుటకు కారణ మెరిగి దేశికులయొద్దకు వెళ్లి క్షమాపణ వేడి సాలగ్రామతీర్థముగ వారిపాదతీర్థమును ఆరునెలలు స్వీకరించి దివ్యదేహమును పొంది స్వస్థానమును చేరిరి. వారితీర్థప్రభావమున ఆచార్యుల కొక పుత్రుడు కలిగెను. ఆబిడ్డకు తీర్థపాదు డను పేరు పెట్టిరి.

దేశికులు సత్యమంగలమున నుండినపుడు రంగనాథుని కలవరము కలిగి భార్యను, బిడ్డను అచ్చటనే విడిచి శ్రీరంగమునకు

వచ్చి రంగనాథుని సేవించిరి. ఆసమయమున ఉత్తరదేశమునుండి యొక విద్వాంసుడు వచ్చి వాదమున కారంభించెను. దేశికులు, వీరవల్లి, పేరరుళాళజియ్యరను తమ శిష్యుని వారితో వాదము చేయుమని నియమించగా ఆయన వాదిని జయించెను. దేశికులు మెచ్చి బ్రహ్మతంత్ర స్వతంత్రజియ్యరని శిష్యునికి బిరుదునిచ్చిరి. ధాతసంవత్సర ఫాల్గుణమాస ఉత్సవమున స్వామి బయలువెడలగా తురుష్కులు సన్నిధిని ముట్టడించిరి. అధికారు లపుడు బయటకు వచ్చియున్న ఉత్సవమూర్తులను దాచియుంచిరి. ఆతురుష్కుల హింసవలన ఎల్లవారును శ్రీరంగమునుండి పరుగెత్తిపోయిరి. సుదర్శనభట్టరనువారికి ఇరువురు పుత్రులుండిరి. వారు నడాదూరమ్మాళ్ అనువారియొద్ద వినియుండిన శ్రీభాష్య వ్యాఖ్యానమును శ్రుతప్రకాశమని యొకగ్రంథముగా చేసియుండిరి. దేశికులు మొదలగువారు పారిపోవు సమయమున సుదర్శనభట్టరు ఆగ్రంథమును తీసికొని దేశికులయొద్ద దానినిచ్చి మీ రీగ్రంథమును సరిచూచి ప్రచురపరచవలయును. ఈపుత్రుల కిరువురకిని శాస్త్రాదులు చెప్పవలయును అని కోరిరి. తురుష్కులవేధచేత మూలకొకరు చెదరిపోయిరి. దేశికులు ఆగ్రంథమును, ఇరువురు పుత్రులను తీసికొని సత్యమంగలము చేరి సుదర్శనభట్టరుయొక్క కోరికను నెరవేర్చిరి. బ్రహ్మతంత్ర స్వతంత్రజియ్యరు దేశికుల విషయమున 'రామానుజదయాపాత్రం' అను ఒక తనయను చేసిరి. దేశికుల పుత్రుడైన వరదాచార్యులును తండ్రిపరముగ తనయను చేసిరి కదా! ఈరెంటిలో దేనిని ఉపయోగించవచ్చునని వివాదము రాగా శ్రీమాన్ "వేంకటనాథార్య" అని పుత్రుడు చేసిన తనయను ద్రావిడవేదమునకును, "రామానుజదయాపాత్ర" మని శిష్యుడు చేసిన

తనయను సంస్కృతవేదాంతమునకును ఉపయోగించవలయునని దేశికులు తెలిపిరి. దేశికులు తిరునారాయణపురమునుండి రంగనాథునికి కలిగిన ఆపదలకు రక్షకముగా అభీతిస్తవమును మంగళాశాసనముగ చేసిరి. అందుచేత రంగనాథుడు శింజిరాయకోట గోపన్నరుమూలముగా శ్రీరంగమునకు వచ్చి చేరిరి. నీమంగళాశాసన ప్రభావమున వచ్చి చేరితినని రంగనాథుడాసంగతిని స్వప్నములో దేశికులకు తెలిపిరి. దేశికులు భార్యను, పుత్రుని పిలచుకొని యెడబాసిన రంగని సేవింపవలయునని పరమప్రీతితో శ్రీరంగమునకు వచ్చి స్వామిని సేవించిరి. చిత్రకూటమున తిల్లగోవిందుని పరారుచేసి యున్నందున దేశికులు గోపనరాయుని చూచి రంగనాథుని తెచ్చి చేర్చినట్లు వీరినికూడ చేర్చవలయునని కోరగా అతడట్లే చేసెను. ఒకప్రభువును స్వాధీనపరచుకొని చిత్రకూటమున విష్ణుబింబప్రతిష్ఠ చేసిరని కొందరు అసూయచెంది ద్రావిడపాశురములను పాడరాదు. అది వేదము కానేరదు అని వాదమున కారంభించిరి. దేశికులు వారితో వాదము చేయబోగా నోరు తెరువజాలకుండిరి. ఆభిచారిక ప్రయోగమువలన నోరు తెరచుటకు కాకున్నదని తెలిసి వాగ్బంధము చేయవచ్చునుగాని మనోబంధముచేయ నెవరితరము ? అనితలచి దేశికులు మనసా ద్వయానుసంధానము చేయగా ఆబంధము తొలగిపోయెను. కావున నిపుడు అధ్యయన ఉత్సవమున ద్రావిడపాశురములను చెప్పవలసినదేయని స్థాపించి ఆద్రావిడప్రబంధకర్తలకు అర్చనయు కలదని స్థాపించిరి. ద్రావిడ వేదమునకు వ్యాఖ్యానముగా రహస్యత్రయమును చేసిరి.

ఒకనాడు రంగనాథుడు భక్తులను చూచి "రామానుజదయాపాత్ర"మను తనయను ముందుంచుకొంటిరా ? "లక్ష్మీనాథ

సమారంభామ్" అను తనయను ముందుంచుకొంటిరా ? యని అడి గెను. 'లక్ష్మీనాథసమారంభామ్' అను తనయను ముందుంచు కొన్నామని వా రనిరి. అట్లు కాదు. 'రామానుజ దయాపాత్రం' అను తనయను ముందుచెప్పి పిమ్మట నాతనయను చెప్పవలయు నని స్వామి ఉత్తరు విచ్చెను. తాయార్ుసన్నిధిలోను అట్లే ఉత్తరు వాయెను. ఇంతలోపల కంచిలో ఒకవాద మేర్పడగా వారితో వాదించుటకు బ్రహ్మతంత్ర స్వతంత్రజియ్యరును పంపిరి. ఆయన జయమును పొందగా పర్యాప్తభాష్యకారులని దేశికులు బిరుదు నిచ్చిరి. ఒకశిల్పి దేశికులను చూచి మీరు సర్వతంత్రస్వతంత్రులను మాట నిజమేని విగ్రహము చేయగలరా యని యడిగెను. దేశికులు అట్లే కానిమ్మని చెప్పిరి. రాత్రి రంగనాథుడు ప్రత్యక్షమై నీయొక్క విగ్రహమునే చేసిచూపుమని చెప్పిరి. దేశికులు అట్లే సలక్షణముగ తమవిగ్రహము నేర్పరచిరి. సలక్షణముగ అమరిన యెడల ఆవిగ్రహమునకు ప్రాణము కలుగును. కనుకనే యీకలి యుగమునందు విగ్రహములకు ఏదైన నొక లోపము కలుగుట కలదు. దేశికులు సలక్షణముగ విగ్రహమును చేయగనే అవిగ్ర హము ప్రాణమును కలిగియుండెను. చెక్కిలి అధికముగ ప్రకా శించుటచేత అది కొంత చెక్కి వేయవలయునని ఆశిల్పి చెప్పగా లేదు అది సరిగా నున్నది. అధికముగా నున్నదని నీకు తోచిన యెడల చెక్కివేయుము అని దేశికులు చెప్పిరి. ఆశిల్పి ఉలితో చెక్కగనే నిజదేశికుల చెక్కిలియందు రక్తము కార నారంభించెను. ఆశిల్పి దేశికుల ప్రభావమును చూచి శరణాగతు డాయెను. దేశికు లపుడు శిల్పశాస్త్రమును చేసిరి. శ్రీశైలేశుని ఘంటావతారమైన వేదాంతాచార్యవర్యులు నూట పండ్రెండు దివ్యగ్రంథములను

రచించి రామానుజమతమును అప్రతిహతముగ ప్రకాశించునట్లు చేసి సౌమ్యసంవత్సర కార్తికమాస కృత్తికానక్షత్ర బుధవాసరమున పరమపదమునకు వేంచేసిరి. దేశికులు చేసిన విగ్రహమునకు జీవమున్నదిగాన ఈకలియుగమున దాని నుంచుకొనరాదు. మీరు వేరువిగ్రహమును చేసి ప్రాణప్రతిష్ఠ యొనర్చి నన్ను పూజించునపుడు వారినిగూడ పూజింపుడని రంగనాథుడు ప్రజల కాజ్ఞాపించెను. తోడనే దేశికులచేత చేయుబడిన ఆవిగ్రహము అంతర్ధానము నొందెను. వీరు గీతార్థచంద్రిక యను గొప్పగ్రంథమును చేసియున్నారు.

శ్రీఆళ్వారుల, ఆచార్యుల చరణములే శరణము.



# ఆదిత్య హృదయం

ఆదికవి వాల్మీకి ప్రణీతమైన స్తోత్రరాజం

## ప్రాశస్త్యం - వ్యాఖ్య

డా॥ ఇలపావులూరి పాండురంగారావు



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2000

# ఆదిత్య హృదయం

ఆదికవి వాల్మీకి ప్రణీతమైన స్తోత్రరాజం

## ప్రాశస్త్యం - వ్యాఖ్య

డా॥ ఇలపావులూరి పాండురంగారావు




ప్రచురణ

డా॥ ఐ. వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్.

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2000

**ADITYAHRIDAYAM**
Commentary and Stotra (Telugu)

By
**Dr. I. Panduranga Rao**

T.T.D. Religious Publications Series No : 289


T.T.D. First Edition : 1985
IInd Edition : 1998
IIIrd Edition : 2000

Copies : 10,000

Published by
**Dr. I.V. SUBBA RAO, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507.

Printed at
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507.

# ముందుమాట

భారతీయ వాఙ్మయంలో రామాయణ భారత భాగవతాలు మూడు అమూల్య గ్రంథరత్నాలు. ఐహికసుఖాల నందుకొని పారలౌకిక సౌఖ్యం పొందటానికి వీలుగా ఈ మూడింటినుంచి ఒక్కొక్క భాగాన్ని ఏరి నిత్య పారాయణకు అనువుగా పెద్దలు ఏర్పరిచారు. భాగవతంలో గజేంద్రమోక్షం నిత్యపారాయణ యోగ్యం. భారతంలో విష్ణుసహస్రనామం, భగవద్గీతలు పారాయణవిధిలో ఉన్న ప్రముఖ ఘట్టాలు. ఐహికవాంఛ వున్నవారు విష్ణుసహస్రనామాన్ని, మోక్షకాములు భగవద్గీతను పఠిస్తారని మనము ఎరిగినదే.

ఇక రామాయణంలో సుందరకాండ, ఆదిత్యహృదయం నిత్య పారాయణయోగ్యంగా ఆచరణలో ఉన్నాయి. సుందరకాండలో సుభగసుందరుడూ, శివాంశసంభూతుడూ అయిన హనుమంతుని తేజోబలపరాక్రమాలు వర్ణించబడ్డాయి. సుందరకాండ చదివితే రామాయణమంతా పఠించిన ఫలితం దక్కుతుంది. సుందరకాండ పారాయణం కష్టాల కడలినుండి సులభంగా గట్టెక్కిస్తుందని పెద్దలు చెబుతారు.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" ఆరోగ్యం ఆకాంక్షించేవారు సూర్యోపాసనచేసి లాభం పొందవచ్చునట! అన్నివిధాలయిన సుఖసంపద లిచ్చే వాడైనప్పటికీ ఆదిత్యుడు ఆరోగ్యాన్ని ప్రసాదించడంలో అసమానుడు. ఆరాధ్యస్వరూపుడు, సర్వదేవాత్మకుడు, ప్రత్యక్షదైవం... కనుకనే సూర్యారాధనవల్ల సర్వదేవతాఫలం సిద్ధిస్తుందని అంటారు.

ఈ పుస్తకంలో డా॥ ఇలపావులూరి పాండురంగారావు గారు "ఆదిత్య హృదయం" ప్రశస్తిని చక్కగా వివరించారు. స్తోత్రానికి ప్రోద్బలకంగా శ్రుతులు, ఉపనిషత్తులు -- వీటినుంచి చాలా ఉదాహరణలు చూపారు. ఈ స్తోత్రరాజం ఆస్తికులకు ఎంతో

ఉపయోగపడుతుందనటంలో సందేహం లేదు. అనతికాలంలోనే ప్రతులన్నీ అయిపోవడంచేత తృతీయ ముద్రణను ముద్రిస్తున్నాం. పాఠకులు ఎప్పటిలాగానే సమాదరిస్తారని ఆశిస్తున్నాం.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఆదిత్యహృదయ ప్రాశస్త్యం

ప్రపంచములో ప్రాణికోటికి ప్రాణశక్తిని ప్రసాదించే ప్రభాకరుడు ప్రత్యక్ష దైవం. ఇతర దేవతలు భావనాగమ్యులు. వారు భావనాశక్తితో ధ్యానించి ఆరాధించవలసినవారు. కనుక సామాన్యులకు సాధ్యం కారు. కాని ప్రత్యక్షంగా కనిపించే ప్రభాకరుని ప్రతివ్యక్తీ ఆరాధించవచ్చు. సకల దేవతల తేజస్సును, ఓజస్సును, శక్తిని, సామర్థ్యాన్ని, అంశనూ, అనుగ్ర-హాన్ని తనలో మిళితం చేసుకొని, తనను ఆరాధించేవారిని తగిన రీతిలో తరింపచేసే ఆదిత్యుని హృదయాన్ని వివరించే స్తోత్రరాజం -- ఈ ఆదిత్య హృదయం. ఆదిత్యుడంటే సూర్యుడు. కాని సూర్యునికి సవిత, రవి, అర్కుడు, భాస్కరుడు, భానుడు, దినమణి, దివాకరుడు - అని ఎన్నో పేర్లు ఉన్నాయి. ఈ పేర్లన్నీ సూర్యుని గుణగణాలను, శక్తి సామర్థ్యాలను వివరిస్తాయి. ఒక్కొక్క పేరులో ఒకానొక విశిష్టగుణం భాసిస్తుంది. వీటిలో ఆదిత్యనామం ఈ స్తోత్రకర్త అయిన వాల్మీకికి బాగా నచ్చింది. అందువల్లనే దీనికి 'ఆదిత్యహృదయం' అనే పేరు వచ్చింది.

ఆదిత్యులు పన్నెండు మంది. వీరిలో విష్ణువుకూడా ఒకడు. 'ఆదిత్యానా మహం విష్ణుః' - అన్న గీతావాక్యం ఈ సత్యాన్ని చెబుతుంది. ఆదిత్యులలో ప్రధానస్థానం వహించిన విష్ణువును ఉద్దేశించి చెప్పబడిన స్తోత్రమవటంచేత దీనికి ఆదిత్యహృదయ మనే పేరు సార్థకమయింది. దీనిని స్తోత్రమని చెప్పక హృదయమని చెప్పడంలో విశేషముంది. నిజానికి మనకు కావలసిన కాంతిని, శాంతిని, నిలకడను, సరసతను, హాయిని, స్థాయిని ప్రసాదించే సౌహార్దం, సామర్థ్యం ఆదిత్యహృదయంలో ఉన్నాయి.

సామాన్యంగా ఆదిత్య శబ్దానికి అదితికి పుత్త్రుడు - అనే అర్థం చెప్పుకుంటారు. దితి సంతతిని దైత్యులని, అదితి సంతతిని అదీనులైన దేవతలని భావించటం పరిపాటి. దితి శబ్దానికి దైన్యమనే అర్థంకూడా ఉంది. దైన్యరాహిత్యంవల్ల ఆవిర్భవించే తేజోమూర్తి ఆదిత్యుడు. సర్వకాల సర్వావస్థల యందు నిర్వికల్పంగా నిశ్శిథిలంగా గగనవీథిని సంచరించే ప్రభాపుంజం ఆదిత్యహృదయం. ఆదిత్యుని హృదయాన్ని అవగాహనం చేసుకోగలిగితే అనంతమైన జ్ఞానాన్ని సొంతం చేసుకొన్నట్లే. కనుకనే "వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అని శ్రుతివిశారదులు పారవశ్యంతో పొంగిపోయారు. సూర్యమండల మధ్యస్థయైన మహాత్రిపురసుందరిని మనసా దర్శించిన పరమేశ్వరీ పరాయణులు కూడా ప్రభాకరుని ప్రాభవాన్నే ప్రకటించారు. ఆకాశంలో నిర్విరామంగా వేవెలుగులతో వెలుగుతున్న ఆదిత్యునే మూడు సంధ్యలలో జ్యోతిర్విదులు ఆరాధిస్తారు. వేదమాతయైన గాయత్రీమంత్రంలో సవితృదేవతయొక్క వరేణ్యావైభవమే వివరింపబడినది. దివ్యనామసహస్రమైన శ్రీవిష్ణుసహస్రనామంలో ఈ ఆదిత్యుడు జ్యోతిరాదిత్యుడై భాసిస్తాడు. ఇంతటి అమోఘమైన సూర్యతేజస్సును 31 శ్లోకాలలో పుణ్యశ్లోకుడైన వాల్మీకి మనకు అందించటం మన అదృష్టం. ఇంత సులభ సూత్రంగా వేదాంతశాస్త్రమంతా మనకు అందుబాటులో ఉన్నప్పటికీ, దాని జోలికి మనం వెళ్లకపోవటం మన దురదృష్టం.

వాల్మీకి రామాయణంలో ఆదిత్యహృదయం ఎలా ప్రవేశించింది? రామాయణ కథానాయకుడు రాముడు. సూర్యవంశంలో పుట్టినవాడు. పట్టపగలు మిట్టమధ్యాహ్నపువేళ రామ జననం జరిగింది. అకారణంగా కాలచోదితుడైన రావణుడు ఆయనతో వైరం పెట్టుకొన్నాడు. సామ దాన భేదాలు ఫలించలేదు. కోదండపాణి దండపాణియై రణరంగంలోకి దూకాడు. రావణుడు నిశాచరుడు. చీకటిలా ప్రపంచాన్ని ఆవరించి, చిన్మయానందంలో ఓలలాడవలసిన ప్రాణికోటిని నిర్దాక్షిణ్యంగా పీడించి వేధిస్తాడు. తనకేగాక తనతోటి మానవకోటికి కూడా కంటకంగా ఉన్న రావణుని సంహరించేందుకు

రాముడు సర్వప్రహరణాయుధాలతో సమరం సాగించాడు. అమోఘమైన తపశ్శక్తితో పరమేశ్వరుని అనుగ్రహం పొందిన రావణుణ్ణి సంహరించటం అంత సులభంగా కన్పించలేదు. రణరంగంలో అలసిపోయినా రావణుడు ధైర్యంతో ఎదుర్కొంటున్నాడు. అతనిని ఎలా సంహరించటం అని రాముడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అప్రతిమానమైన రామ రావణయుద్ధం చూచేందుకు అంతరిక్షంలో దేవతలు, మహర్షులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు అందరు విచ్చేశారు. వారిలో అగస్త్యమహర్షి కూడా ఉన్నాడు. ఆలోచనలో మునిగి ఉన్న రామచంద్రుని ముఖారవిందం చూచి అగస్త్యుడు క్రిందికి దిగివచ్చాడు. ఏకాంతంగా రామునిచెంతకు చేరి కులదేవత, పరదేవతయైన సూర్యభగవానుని ఆరాధించమని ఆదిత్యహృదయం అందిస్తాడు. రాముడు అందుకుంటాడు, ఆనందిస్తాడు, ఆరాధిస్తాడు. మరుక్షణంలోనే రామ రావణ యుద్ధం ముగిసిపోతుంది. ఇది వాల్మీకి రామాయణంలో యుద్ధకాండలో 107వ సర్గలో జరిగిన వృత్తాంతం. ఈ సర్గలో మొత్తం 31 శ్లోకాలు ఉన్నాయి. దీన్నే ఆదిత్యహృదయం అంటారు.

రామ రావణయుద్ధంలో రామ విజయం రావణ పరాజయం, చీకటి వెలుగుల పోరాటంలో వెలుగు గెలుపును చాటి చెపుతుంది. బహిరంతర తిమిరాన్ని ఛేదించి చిరంతన చైతన్యంలోని నిత్య సత్యసందీప్తిని సాక్షాత్కరించుకొనేందుకు ఈ ఆదిత్యహృదయం ఆనాడు రామచంద్రునికి రణరంగంలో ఎలా సహకరించిందో, ఈనాడూ ప్రాణికోటికి ఆంతరంగిక జీవితరంగంలో అలాగే ఉపకరిస్తుంది. కృష్ణార్జునుల నిమిత్తంగా గీతామృతం ప్రవహించినట్లే అగస్త్య రామచంద్రులను ఆలంబనం చేసికొని ఆదిత్యహృదయం ఆవిర్భవించింది. భారతంలో భగవద్గీత, రామాయణంలో ఆదిత్యహృదయం - ఈ రెండూ రణరంగంలోనే వెలువడడం గమనించదగ్గ విషయం. ప్రపంచశాంతికి, ఆత్మతుష్టికి మూలకందములైన భయభక్తులు ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నాయేమో అని అనిపిస్తుంది.

వాల్మీకి రామాయణంలో ఇలాంటి స్తోత్రాలు ఎక్కువగా కనిపించవు. అసలు వాల్మీకి రామాయణమంతా ఒక మహాస్తోత్రం. మంత్రరాజం.

ఒక్కొక్క అక్షరం మహాపాతకాలను నశింపచేసే మహత్తరమైన మంత్రం. అలాంటి మంత్రశక్తితో గాయత్రీ బీజ సమ్మితంగా రచించిన రామాయణంలో చోటుచేసుకొన్న ఈ స్తోత్రం, ఎంత ప్రశస్తమైనదో ఊహించవలసిందే కాని, మామూలు మాటలలో వివరించటం సాధ్యం కాదు.

ఆదిత్యహృదయంలోని 31 శ్లోకాలలో సర్గసమాప్తిని సూచించే చివరి శ్లోకాన్ని శాంతిపాఠంగా భావిస్తే 30 శ్లోకాలు మిగులుతాయి. ఇందులో మొదటి 9 శ్లోకాలు స్తోత్రానికి పూర్వరంగాన్ని సమకూర్చుతాయి. చివరి తొమ్మిది స్తోత్రప్రాశస్త్యం, ఫలశ్రుతి మొదలైన వాటితో ముగింపును సూచి-స్తాయి. ఇలా మొదటి తొమ్మిది, చివరి తొమ్మిది శ్లోకాలు మినహాయిస్తే మధ్య పన్నెండు శ్లోకాలు కేవలం స్తుతిభాగానికి చెందినవిగా కనిపిస్తాయి. ఈ పన్నెండు శ్లోకాలు ద్వాదశాదిత్యులకు ప్రాతినిధ్యం వహిస్తున్నట్టు కనిపి-స్తుంది. సరిగా ఈ స్తుతికి మధ్యభాగంలో "ద్వాదశాత్మ న్నమోఽస్తుతే" అనే నమోవాకంకూడా వినవస్తుంది. ఒకవిధంగా చూస్తే, ఈ నమోవాకం ఈ సూర్యానువాకానికి సంధిస్థలంగా గోచరిస్తుంది. పూర్వభాగంలో భాస్కరుని ప్రభావ వైభవాలను ప్రకటించే దివ్యనామ సంకీర్తనం వినిపిస్తుంది. ఉత్తర భాగంలో నమోవాక పురస్సరంగా ఆరాధ్యదేవతకు అంజలి అర్పించటం కనిపిస్తుంది. కాబట్టి మొదటి ఆరు శ్లోకాలు స్తుతికి చెందినవనీ, తరువాతి ఆరుశ్లోకాలు నుతికి చెందినవనీ భావించినా తప్పులేదు. రుద్రప్రశ్నలోని నమక చమకాలవలె, ఆదిత్యహృదయంలో ఈ రెండు భాగాలు అందులోని శబ్దాలకు శ్రుతిగౌరవాన్ని సంక్రమింప చేస్తాయి.

ఈ విధంగా ఆదిత్యహృదయంలోని మంత్రభాగం సర్గమధ్యలో స్తోత్ర హృదయంలో సంపుటీకరించబడింది. ప్రతి స్తోత్రానికి అనుషంగికంగా ఉండే అంగన్యాస కరన్యాసాలు కూడా ఈ మంత్రభాగానికి ముందుగా ఉన్న శ్లోకాలకు చేర్చబడ్డాయి. కాబట్టి ఈ స్తోత్రం సర్వసమగ్రమైనది. స్తోత్రం పఠించేటప్పుడు, సామాన్య ధరాతలంనుండి మనస్సు క్రమంగా భూర్భువస్సువ ర్లోకాలకు పయనించి, మహత్తరమైన సత్యాన్ని సాక్షాత్కరించుకొని, మరల పుడమికి తిరిగి వచ్చినట్టుగా అనిపిస్తుంది.

ఈ స్తోత్రం 'తతో యుద్ధ పరిశ్రాంతం' అనే చరణంతో ఆరంభ మవు-తుంది. ఇందులో మొదటి పదం, సుందరకాండలోని మొదటి పదం ఒకటి కావటం గమనించదగ్గ విషయం. తదీయమైన ఈ పదాన్నే అన్వేషిస్తూ వెళ-తాడు సీతాతత్త్వార్థకోవిదుడు హనుమంతుడు. 'తత్త్వమసి', 'యత్తత్పద మనుత్తమం', చితి స్తత్పద లక్ష్యార్థా' మొదలైన సూక్తులతో కీర్తించబడిన తత్త్వార్థమే ఈ 'తతః' అనే శబ్దంలో స్ఫురిస్తుంది.

ఆదిత్యహృదయంలోని మొదటి రెండుశ్లోకాలు స్తోత్రసందర్భాన్ని వివ-రిస్తాయి. అగస్త్యుడు రాముని సమీపించటం ఈ రెండు శ్లోకాలకు తాత్పర్యం. మూడవ శ్లోకం అగస్త్యుని సంబోధనతో ఆరంభమవుతుంది. "రామ రామ మహాబాహో" అని అగస్త్యుడు ఆజానుబాహువైన శ్రీరామ చంద్రుని సంబోధిస్తాడు. రణరంగంలో రావణసంహారంకోసం తన పరాక్ర మాన్ని సద్వినియోగం చేస్తున్న రాముణ్ణి మహాబాహువని సంబోధించటంలో ఎంతో ఔచిత్యం ఉంది. అంతకు మించిన ఔన్నత్యం 'రామ రామ' అని రెండుమార్లు రామ శబ్దాన్ని ఉచ్చరించడంలో ధ్వన్యాత్మకంగా దాగి ఉన్నది. బాల్యంలోనే రాఘవరాముడు, భార్గవరాముణ్ణి నిర్జించి అతని తేజస్సును తనలో లయింప చేసుకున్నాడు. కాబట్టి 'భార్గవరాముని పరా క్రమం, దశరథరాముని దాక్షిణ్యం - రెండూ నీలో మేళవించి ఉన్నాయి సుమా!' అని అగస్త్యుడు హెచ్చరిస్తున్నాడు. 'నీవు కౌసల్యా దశరథులు కన్న మామూలు రామయ్యవు కావు. చతుర్బాహువైన శ్రీమహావిష్ణువు తేజస్సు నీలో మూర్తీభవించి ఉన్న'దనికూడా అగస్త్యుడు సూచిస్తున్నాడు. మహాబాహువనే సంబోధనలో బాహువుల సంఖ్య సూచింపబడలేదు. వాటి మహత్తు మాత్రమే చెప్పబడింది. ఎదుట నిలబడి ఉన్న శత్రువు దశకంధరుడు. అతనికి ఇరవై బాహువు లున్నాయి. అన్ని బాహువులున్నా రామచంద్రుని రెండు బాహువులలో ఉన్న మహత్త్వం అతనిలో లేదు. భూర్భువస్సువర్లోకాలను మించినది మహర్లోకం. ఆదిత్యుడు దానికి అధిపతి. "మహ ఇతి బ్రహ్మ" అన్న తైత్తిరీయ సూక్తినిబట్టి పరబ్రహ్మయొక్క బాహు పరాక్రమం రామునిలో ఉన్నదని మహాబాహువనే ఈ సంబోధన తెలియపరుస్తుంది. "మహ ఇత్యాదిత్యః" అన్న శ్రుతివాక్యం, సూర్యశక్తి

రామబాహువులలో ఉన్నదనికూడా స్ఫురింపచేస్తుంది. ఈ సంబోధనతోనే ఆదిత్యహృదయంలోని మంత్రశక్తి ప్రారంభమవుతుంది. ధ్వన్యాత్మకమైన ఈ సంబోధనకు తరువాత, పరమరహస్యం, పరమ పురాతనమైన పరమార్థాన్ని నీకు అందజేస్తున్నానని అగస్త్యుడు అంటాడు. ఈ పరమరహస్యం ఈ సంబోధనలోనే ఉన్నది.

నాలుగవ శ్లోకంనుండి స్తోత్రప్రాశస్త్యం ఆరంభ మవుతుంది. ఆదిత్య హృదయం పరమపావనమైన స్తోత్రమట. అంతఃశత్రువులను నశింప చేయ గలిగిన శక్తి ఈ స్తోత్రంలో ఉన్నదట. దీనిని నిత్యం జపించిన వారికి జయము చేకూరుతుందట. శుభం కలుగుతుందట. లభించిన జయం, కూడిన శుభం కలకాలం నిలబడుతాయట. మంగళకరమైన వస్తువుల కన్నింటికీ మాంగళ్యాన్ని ప్రసాదించగలిగే ఈ మహామంత్రం సకల పాపా లను, చింతలను, చీకులను, శోకాన్ని ఉపశమింప చేస్తుందట. ఆయుస్సు పెంచుతుందట. ఇంతకు మించిన స్తోత్రం లేదట.

అరుణోదయ కిరణకాంతితో చతుర్దశ భువనాలను లాలించి పాలించే భాస్కరుణ్ణి దేవతలు, గంధర్వులు, రాక్షసులు అందరూ ఏదో విధంగా ఆరా ధిస్తారు. సూర్యుడు ఉదయించగానే అర్ఘ్యపాద్యాదులతో అంజలి ఘటిస్తూ, దేవతలందరు ప్రత్యక్షదైవమైన ప్రభాకరునికి నమస్కరిస్తారు. ఈ ప్రాశస్త్యం తెలియని రాక్షసులు, తత్తుల్యులు నిద్రాముద్రలోనే సవితకు సాష్టాంగ నమస్కారం చేస్తారు. సూర్యుడు సర్వతోముఖుడు కాబట్టి ఏ దిక్కునుండి నమస్కారం చేసినా ఆ మొక్కు ఆయనకే చెందుతుంది. ఇలాంటి సూర్య దేవతను పూజించవలసిందని అగస్త్యుడు రామచంద్రునికి ఉపదేశిస్తాడు. ఈ ఉపదేశ వాక్యం ఆరవ శ్లోకంలో ఆరు భాగాలుగా వినవస్తుంది. 'పూజయస్వ' (పూజించుము) అనే ఆదేశపదానికి 'రశ్మిమంతం, సముద్యంతం, దేవా- సుర నమస్కృతం, వివస్వంతం, భాస్కరం, భువనేశ్వరం' -- అనే ఆరు పదాలు అంగన్యాస కరన్యాసాలతో షణ్ముఖసంపదను సూచిస్తాయి. ఆదిత్యహృదయ మనే మంత్రానికి ఇది న్యాసభాగం.

భాస్కరుని ఉపాసించవలసిందని ఉపదేశించిన తరువాత సకల దేవతలు ఈ భాస్కరునిలోనే మూర్తీభవించి ఉన్నారని అగస్త్యుడు వివరిస్తాడు. కిరణకరణములతో తేజోమూర్తిగా భాసించే భాస్కరుడు సర్వదేవతా స్వరూపుడు. దేవతలను రాక్షసులను సమభావంతో పోషించే సాత్త్వికమైన స్వభావం సూర్యకిరణములలో స్వతస్సిద్ధంగా ఉంది. మంచివారికీ, చెడ్డవారికీ, ఉన్న వారికీ, లేనివారికీ, రాజభవనాలకూ, పూరిగుడిసెలకూ సూర్యకాంతి సమానంగా లభిస్తుంది. ఒకవిధంగా చూస్తే కోటలలోకంటె కుటీరాలలోనికే సూర్యకిరణాలు ఎక్కువ సూటిగా ప్రసరిస్తాయి. తన కిరణజాలంతో లోకబాంధవుడు సమస్తలోకాలను సృష్టిస్తాడు, పోషిస్తాడు, లయింపచేస్తాడు. కనుకనే బ్రహ్మ, విష్ణువు, శివుడు ముగ్గురు సూర్యకాంతిలోనే ఉన్నారు. అంతే కాదు. శివకుమారుడు స్కందుడుకూడా ఇతడేనట! దివినుండి భువికి దిగివచ్చిన దేవతను స్కందుడని భావించటంలో పొరపాటులేదు. సూర్యుని సర్వదేవాత్మకత్వం అంతటితో ఆగలేదు. ఇంద్రుడు, కుబేరుడు, యముడు, సోముడు, వరుణుడు, పితృదేవతలు, ఎనిమిదిమంది వసువులు, ఇద్దరు అశ్వినీదేవతలు, మరుద్గణాలు, సాధ్యులు -- అందరూ భాస్కరునికి ప్రతిరూపాలుగా గోచరిస్తారు. వాన కురిపించేవాడు ఇంద్రుడు. కాని, సూర్యుని సహకారము లేనిదే ఇంద్రుడా పనిచేయలేడు. అలాగే సకలసంపదలను ప్రసాదించే కుబేరుడు, ఆధి వ్యాధులను పోగొట్టే అశ్వినీకుమారులు, ప్రాణములను పోసే ప్రజాపతి, ఆ ప్రాణములను హరించే యముడు, వసుంధరను సస్యశ్యామలం చేసే చంద్రుడు, వసువులు, ఆలోచన లిచ్చే మనువు, గాలి, నిప్పు, ఊపిరి, ఋతువులు, పగలు, రాత్రి, వెలుగు వీటన్నిటికీ మూలాధారం సూర్యుడు. సూర్యరశ్మియొక్క సహకారంతోనే ఈ పనులన్నీ యథావిధిగా జరుగుతూ ఉన్నాయి.

ఆదిదేవుడైన సూర్యునికి ఆదిత్యనామం సర్వథా సార్థకమైనది. సర్వస్వం ప్రసవింపచేసేవాడు కాబట్టి అతనికి సవిత అనే పేరు వచ్చింది. ఎవ్వరు చొరరాని చోటులోకూడా సూర్యకిరణాలు చొచ్చుకొనిపోతాయి. కాబట్టి సూర్య నామం అన్వర్థమైనది. ఆకాశంలో పయనిస్తూ ఉంటాడు కాబట్టి ఖగనామధేయం అతనికి చెల్లింది. విశాలమైన రెక్కలతో విను వీధిలో

సంచరించే గరుత్మంతునికి కూడా ఖగరాజనే పేరుంది. గరుత్మంతునిలా సూర్యుడుకూడా ఆకాశమార్గంలో సంచరిస్తూ అఖిల ప్రపంచానికి అమృతం పంచిపెడతాడు. ప్రాణికోటిని పోషించేవాడు కాబట్టి, పూషనామం వచ్చింది. కిరణాలతో శోభిల్లుతూ ఉంటాడు కాబట్టి, గభస్తిమంతుడని అనిపించు కున్నాడు. పసిడి వన్నెతో మిసమిసలాడుతూ, వెలుగుతూ, వెలిగిస్తూ పగటి వెలుగును వెలయిస్తూ ఉంటాడు కాబట్టి స్వర్ణరేతస్కుడని అనిపించు కున్నాడు.

ఆకుపచ్చని గుర్రాలపై వేవెలుగులసామి రాజఠీవితో విహరిస్తాడట. ఆయన గుర్రాలకు 'సప్తి' అని పేరు. సప్తి నామధేయం గల ఏడు గుర్రాలపై పయనిస్తాడు కాబట్టి 'సప్తసప్తి' అనే పేరు ఆయనకు వచ్చింది. సూర్యకాంతిలో ఏడు వన్నెలు ఇమిడిఉన్నాయి. భూర్భువస్సువరాది సప్తలోకాలలో సూర్యకాంతి ప్రసరిస్తుంది. సప్తమినాడు సూర్యకాంతి సర్వలోకపర్వంగా ప్రజ్వలిస్తుంది. అందువల్లనే రథసప్తమి సూర్య పర్వంగా రూపొందింది. సూర్యకిరణాలకు మరీచులని పేరు. ఎండమావులను కూడా మరీచిక లంటారు. సూర్యకిరణాలు శూన్యంనుండి వెలువడి సకల భువనాలలో ప్రసరించే శక్తిచైతన్యం లాంటివి. కనుకనే శివశక్తి సామ-రస్యాన్ని సూర్యమండల మధ్యవర్తిగా భావించటం భావనాపరులకు అభీష్టం. సూర్యుని పేరు చెబితేనే చీకటి ఛిన్నాభిన్నమై చెదరిపోతుంది. చీకటిని చిలికి, దానిలోనుంచి శివతత్త్వాన్ని నవనీతంగా వెలికి తీయగలిగిన దిట్ట కాబట్టి, సూర్యుణ్ణి మహర్షులు శంభువుగా కూడా భావించారు. ఆయన త్వష్ట అట. త్వష్ట అంటే వడ్రంగి అని అర్థం. వడ్రంగి అడవిలో దొరకిన కొయ్యను తీసికొని, తన కల్పనకు అనుగుణంగా దానిని కోసి మలిచి, ఒకానొక రమణీయమైన ఆకృతిని సృష్టిస్తాడు. అలాగే సూర్యుడు కూడా ప్రాణులకు కావలసిన ప్రాణశక్తిని తగు మోతాదులో తగినరీతిలో ప్రసాదించి వారికి పరిమిత లావణ్యాన్ని, అవయవ సౌష్ఠవాన్ని చేకూరుస్తాడు. అంతే కాదు. దేశకాలాలను కూడా ఇలానే నియమితం చేసి రేయింబవళ్లను, తిథులను, నక్షత్రాలను, మాసాలను, ఋతువులను, అయనాలను, సంవత్స రాలను కల్పిస్తాడు. కనుక సూర్యుడు నిజమైన త్వష్ట. కాని ఈ త్వష్టయొక్క

ఆశయం వికసింపచేయటమే కాని, నశింపచేయటంకాదు. వినాశంలోకూడా వికాసాన్ని బీజరూపంలో ఇముడ్చగల శక్తి అతని చైతన్య కిరణరాశిలో ఉన్నది.

అతడు హిరణ్యగర్భుడు. "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్" అని శ్రుతి కీర్తించిన హిరణ్యగర్భుడు సూర్యుడే. సృష్టికి ఆది, ఆధారం ఈ హిరణ్యమే. ఈ హిరణ్యం సూర్యుని గర్భంలో పుష్కలంగా ఉంది. ఎంత కాళరాత్రి గడచినా సూర్యు డుదయించటంతో ఆశలు చిగురిస్తాయి. పసిడికాంతితో ప్రకృతి పరిఢవిల్లుతుంది. శిశిరంలో ఉన్న చల్లదనం, మెత్తదనం, నైరాశ్యం, నిర్వేదం సూర్యునివల్లనే లభిస్తాయి. ఆ సూర్యుడే మండువేసవిలో తపనుడై భూమిని తపింపచేస్తాడు. ఒకప్పుడు కాంతి నిచ్చే భాస్కరుడు, మరొకప్పుడు చైతన్యాన్ని ప్రసాదించి, అంత స్తేజస్సును వెలయించే రవి అవుతాడు. అతని కడుపులో పసిడి ఉన్నట్లే అగ్నికూడా ఉంది. అదితి కన్న అల్లారుబిడ్డ కాబట్టి, అతడు ఎక్కడకు వెళ్లితే అక్కడి వాయుమండల మంతా పవిత్ర మవుతుంది. "శంఖ" శబ్దంలో 'శం' మంచిని సూచిస్తుంది. 'ఖ' శబ్దం ఆకాశవాచ్యం. సూర్యగమనం ఆకాశానికి పావనత్వాన్ని ప్రసాదిస్తుంది. అతడున్నచోట మంచు నిలవదు. మంచును హరించి, మంచిని పెంచే మహనీయుడు సూర్యుడు.

ఆకాశానికి అధిపతి అవడంవల్ల అతనికి వ్యోమనాథుడనే పేరు వచ్చింది. చీకటిని చీల్చుకొని వేదత్రయనాదాన్ని లోకత్రయికి వినిపిస్తూ, మేఘాలను మెరిపిస్తూ, వర్షాలను కురిపిస్తూ, నీళ్లతో నెయ్యం జరిపిస్తూ, వింధ్యాచలం మీద గంతులువేస్తూ, విహరిస్తూ ఉంటాడు -- వేయివన్నెల వేల్పు సూర్యదేవుడు.

కోపంవస్తే కాలాగ్నిలా మండిపడతాడు. సూర్యమండలం అతనికి జన్మకుండలి. ఆ మండలికి అతడే ప్రభువు. పింగళవర్ణంలో ప్రజలకు ప్రాణాలుపోసే సూరన్న, అవసరమని తోచినప్పుడు వాళ్లను తపింపచేస్తాడు. లేనిదాన్ని సృష్టించగల శక్తిగలవాడు కనుక, అతనికి కవినామం సార్థకమైనది. విశ్వరూపుడైన అతని దివ్యతేజస్సుతో రంజిల్లని అంశ ముండదు. అన్ని భావాలకు, భవనాలకు, భువనాలకు, ఉద్భవాలకు అతడే మూలం.

ఆకాశంలో కనిపించే చుక్కలు, గ్రహాలు, నక్షత్రాలు, అన్నీ ఆయన చెప్పుచేతలకు లొంగి నడుచుకుంటూ ఉంటాయి. గ్రహాలు, నక్షత్రాలు ఒకే కాంతివలయంలో కొన్ని నియమాలకు కట్టుబడి ఉండడం సూర్య శాసనానికి నిదర్శనం. అశ్విని, భరణి మొదలైన ఇరవై ఏడు నక్షత్రాలు. మిగిలినవి చుక్కలు. కదలిక గలవి గ్రహాలు, కదలకుండా ఉన్నట్టు కనిపించేవి చుక్కలు, నక్షత్రాలు. ఇవన్నీ సూర్యమండలంలోని భాగాలే. మన సూర్యుడి లాంటి సూర్యు లనేకులు బ్రహ్మాండంలో ఉన్నారు. ఆ సూర్యులందరికీ ఆదిసూర్యుడు ఆదిత్యుడు. అలాంటి ఆదిత్యులు పన్నెండు మంది. వారిలో విష్ణువు ప్రధానుడు. ఈ ద్వాదశాదిత్యులలో వెలిగే ద్వాదశాత్మ అందరికీ నమస్యుడు, వంద్యుడు, ఆరాధ్యుడు.

ఈ ద్వాదశాత్మ సంస్మరణంతో ఆదిత్యహృదయంలోని పూర్వార్థం -- అంటే స్తుతిభాగం ముగుస్తుంది. ఆ తర్వాత ఉత్తరార్థంలో-నుతిభాగం నమకం ఆరంభ మవుతుంది. సూర్యు డుదయించే తూర్పుదిక్కు, అస్త మించే పడమరదిక్కు -- ఈ రెంటికీ నమస్కారం. ప్రపంచంలో కనిపించే వెలుగుకు, పగటికి అధిపతి అయిన కాంతిదేవునికి నమస్కారం.

జయస్వామికి నమస్కారం. మంగళకరమైన జయాన్ని ప్రసాదించే జయభద్రునికి నమస్కారం. పచ్చని గుర్రాలతో పయనించే వేవెలుగుల ఆదిత్యునికి మరి మరి నమస్కారం.

ఉగ్రమూర్తికి నమస్కారం. శూరధీరునికి నమస్కారం. విలక్షణమైన వాక్కును వెలయించే వీరునికి నమస్కారం. సంసారసారాన్ని అవగాహనం చేసుకొని, తాను తరించి, ఇతరులను తరింపచేసే తరణికి నమస్కారం. రేయిచివరిజామున చల్లనిగాలికి హాయిగా నిదురపోతున్న కమలాలకు కిరణా లతో గిలిగింతలు పెట్టి, మేల్కొల్పే చిలిపిచేతల చిన్మయమూర్తికి నమస్కారం. మృత్యువును స్వాధీనపరచుకొన్న మార్తాండునకు నమస్కారం.

బ్రహ్మను, ఈశానుని, అచ్యుతుని -- ముగ్గురినీ స్వాధీనం చేసుకొన్న సూరవార్యునికి నమస్కారం. ఎంతప్రసరించినా తరుగని అక్షయకాంతితో

శోభిల్లే జ్యోతిరాదిత్యునికి నమస్కారం. భక్ష్యం, అభక్ష్యం అనే భేదం లేకుండా సర్వం హరించి, సర్వం తపింపచేసే రుద్రమూర్తికి నమస్కారం.

చీకటిని హరించి, మంచును పటాపంచలు చేసి, శత్రువులను సంహరించే సూర్యుడు మహితాత్ముడు, అమితాత్ముడు. అతని శక్తి అమోఘం. తలచుకుంటే అతడు కృతఘ్నులను కూడా సంహరించగలడు. అయాచితంగా, అవ్యాజంగా అంతులేని కాంతిని మనకు ప్రసాదించేందుకు అతడు ఎక్కడినుండో మన పంచల్లోకి దిగివస్తే, మనం మంచంమీదనుండి కూడా దిగేందుకు బద్ధకిస్తే మనం కృతఘ్నులం కాక మరేమవుతాం? కాబట్టి సూర్యదేవునికి ఏమాత్రం అపచారం చేయకూడదు. సూర్యోదయ మయ్యేసరికి లేచి ఆ ప్రాణసందేశాన్ని గ్రహించేందుకు సిద్ధంగా ఉండటమే, ఆయనకు మనం చేయదగిన ఉపచారం. అలా చేయకపోవటమే అపచారం. వెలుగుల వేల్పు విచ్చేసేసరికి మనం మెలకువతో ఉండటమే మన విధి. అలాంటి జ్యోతిర్మయునకు నమస్కారం.

కాచిన బంగారువన్నెతో కళకళలాడే అగ్నిదేవునికి నమస్కారం. సకల కార్య సమర్థుడైన విశ్వకర్మకు నమస్కారం. బహిరంతర తిమిరాన్ని ఛేదించి, కాంతిని ప్రసరింపచేసే లోకసాక్షికి నమస్కారం.

ఇంతటితో నమకం ముగుస్తుంది. మళ్ళీ సూర్యమహిమ ఆరంభ మవుతుంది. ప్రాణులను నశింపచేసి మళ్లీ సృష్టించగల శక్తి ప్రభాకరునిలో ఉంది. అతడు రక్షిస్తాడు, శిక్షిస్తాడు, వేడివేడి కిరణాలతో మాడ్చివేస్తాడు. చల్లనివర్షం కురిపిస్తాడు.

మనం నిద్రపోయినా మనలో అతడు మేల్కొని ఉంటాడు. 'అగ్నే త్వం సుజాగృహి, వయం సుమం దిశీమహి' అని శ్రుతిగీతంలో చెప్పినట్టు సర్వకాల సర్వావస్థలయందు మనకు తోడునీడగా మనలో వెలుగుతూ ఉన్న ఆదిత్యరూపం సర్వదా ఆరాధ్యం. మనం చదివే వేదాలు, చేసే క్రతువులు, యజ్ఞయాగాదులు, వాటి ఫలితాలు, సకలకార్య కలాపాలు -- అన్నిటికి సాక్షి భూతుడై అంతరాత్మలా అతడు మనవెంతనే ఉంటాడు. మన వాక్కే

ఋగ్వేదం. మనం చేసే పనులే యజుర్వేదం. మన మనస్సులోని సామ్యమే సామవేదం. ఈ మూడింటిని నడిపించే వాడు ప్రాణస్వరూపుడు సూర్యుడు. అలాంటి సూర్యుణ్ణి స్మరిస్తే చాలు, భయంకరమైన ఆపదలుకూడా నశిస్తాయి. అడవికూడా ఆనందనిలయంగా మారుతుంది.

కాబట్టి ఆ దేవదేవుని, జగదీశ్వరుని ఏకాగ్రంగా ఆరాధించు. ఈ స్తోత్రం మూడుసార్లు పఠిస్తే యుద్ధంలో నీకు విజయం లభిస్తుంది. ఈ క్షణంలోనే నీ చేతుల్లో రావణసంహారం జరుగుతుంది -- అని అగస్త్యుడు రామునికి బోధిస్తాడు. తొలిపలుకుల్లో చేసిన "మహాబాహో" అనే సంబోధన ఈ మలిపలుకుల్లో కూడా (అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి) రావటం గమనించదగ్గ విషయం. ఈ బోధనతో ఆదిత్యహృదయం లోని మంత్రభాగం ముగిసి, ఫలశ్రుతి ప్రారంభమవుతుంది.

ఈ మాటలు చెప్పి అగస్త్యుడు తాను వచ్చిన దారిని తిరిగి వెళ్లాడట. ఆ మాటలు విన్న రాముడు వినయంతో, ఆనందంతో, నిష్ఠతో ఆదిత్య హృదయం జపించాడట. కోదండం చేతబట్టుకొని, రాముడు రావణ సంహారం కోసం రణరంగంలో ప్రవేశిస్తాడు. ఆ సమయంలో అంతరిక్షం నుండి సూర్యుడు దిగివచ్చి 'త్వర' త్వరగా పని పూర్తిచేయవలసినదని సూచిస్తాడు. 'త్వర' అనే మాట సూర్యునినోట వెలువడటమే ఆలస్యం, లోకరావణుడైన రావణుడు పంచత్వాన్ని పొందుతాడు.

ఇదీ ఆదిత్యహృదయం. ఈ స్తోత్రం చదివేందుకు మూడు నాలుగు నిమిషాలకు పైన పట్టదు. సూర్య దుదయించేందుకు ఎంతకాలం పడుతుందో, సరిగా అంతే సమయంలో ఈ స్తోత్రం చదవవచ్చు. అలా లెక్క ప్రకారం వాల్మీకి ఈ స్తోత్రం వ్రాశాడా అనిపిస్తుంది. ఈ స్తోత్రం ఎప్పుడైనా చదవవచ్చు. కాని ఉదయం, సాయంత్రం, మధ్యాహ్నం నిష్ఠగా నియమంతో చదవటం మిక్కిలి శ్రేయస్కరం. ఎక్కడ ఎప్పుడు చదివినా సూర్యబింబాన్ని మనస్సులో ధ్యానించి చదవటం మంచిది. సూర్యబింబానికి ఎదురుగా నిలబడి, ఉదయాస్తమయ సమయాల్లో చదవగలిగితే మరీ మంచిది. ఏ రూపంలో, ఏ కాలంలో, ఏ ఉద్దేశ్యంతో స్మరించినా ఆదిత్యనామ సంస్మరణ సకల పాపాలను పోగొట్టి త్రికరణ శుద్ధిని ప్రసాదిస్తుంది.

అర్థం తెలియకుండా చదివినా ఈ స్తోత్రం అనిర్వచనీయమైన ఆనందాన్ని ఇస్తుంది. తెలిసినా, తెలియకపోయినా ప్రకృతిశక్తుల ప్రభావం మనమీద కనిపించినట్లే, అక్షరరూపంలో ఆదికవి అందించిన యీ అమోఘ-మైన అస్త్రం అర్థనిరపేక్షంగానే సార్థకమవుతుంది. ఇక అర్థం తెలుసుకొని ఆరాధిస్తే అపరిమేయమైన ఆనందం లభిస్తుంది. ఇది అనుభవం వల్లనే బోధ పడుతుంది. కాబట్టి తర్క కుతర్కాలతో కాలయాపన చెయ్యక అమృతాయమాన అక్షరభారతిని ఆరాధించి తరించటం వివేకవంతుల విధి.

-*-

# స్తోత్రం

హరిః ఓం

తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్,
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్. 1

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్,
ఉపాగమ్యాబ్రవీద్రామం అగస్త్యో భగవాన్ ఋషిః. 2

* * *

రామ! రామ! మహాబాహో! శృణు గుహ్యం సనాతనమ్,
యేన సర్వా నరీన్ వత్స! సమరే విజయిష్యసి. 3

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్,
జయావహం జపే న్నిత్యం అక్షయ్యం పరమం శివమ్. 4

సర్వమంగళ మాంగల్యం సర్వపాపప్రణాశనమ్,
చింతాశోక ప్రశమనం ఆయుర్వర్ధన ముత్తమమ్. 5

* * *

రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతమ్,
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్. 6

సర్వ దేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః,
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః. 7

ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః,
మహేంద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః. 8

పితరో వసవః సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః,
వాయు ర్వహ్నిః ప్రజాఃప్రాణాః ఋతుకర్తా ప్రభాకరః

ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్
సువర్ణసదృశో భానుః స్వర్ణరేతా దివాకరః.

హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిః మరీచిమాన్,
తిమిరోన్మథనః శంభు స్త్వష్టా మార్తాండకోఽంశు

హిరణ్యగర్భః శిశిర స్తపనో భాస్కరో రవిః,
అగ్నిగర్భోఽదితేః పుత్రః శంఖః శిశిరనాశనః.

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామ పారగః,
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః.

ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః,
క(ర)వి ర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః.

నక్షత్ర గ్రహ తారాణా మధిపో విశ్వభావనః,
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్! నమోఽస్తుతే.

* * *

నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః.

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః
నమో నమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః,
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః

బ్రహ్మేశా నాచ్యుతేశాయ సూర్యా యాదిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః.

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే,
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః. 20

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే,
నమస్తమోఽభినిఘ్నాయ రవయే లోకసాక్షిణే. 21

* * *

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః,
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః. 22

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః,
ఏష ఏవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్. 23

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ,
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః. 24

ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ,
కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ! 25

పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్,
ఏతత్ త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి. 26

అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి,
ఏవ ముక్త్వా తతోఽగస్త్యో జగామ చ యథాగతమ్. 27

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా,
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్. 28

ఆదిత్యం ప్రేక్ష్యం జప్త్వేదం పరం హర్ష మవాప్తవాన్,
త్రిరాచమ్య శుచి ర్భూత్వా ధను రాదాయ వీర్యవాన్. 29

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా జయార్థం సముపాగమత్,
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్. 30

అథ రవి రవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః,
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణ మధ్యగతో వచ స్త్వరేతి.

ఓం తత్ సత్.

* * *

కోపము. అందుచేత రామానుజులు స్వామిని సేవింపకయే కాంచీపురికి మరలి పోయిరి.

యామునుల చరమకార్యము లాయెను. రామానుజులు తిరుక్కచ్చినంబితో జరిగినసంగతి చెప్పి యామునాచార్యులుండిన నెన్ని విషయములు తెలిపియుందురో యని దుఃఖించిరి. రంగనాథు డేమిచేయును ? నీవు స్వామిని సేవించి వచ్చి యుండవలయును. యామునాచార్యులను బ్రదికి యుండగా చూడనైతిగదా యని స్వామిపై నలిగి వచ్చితివి. అదియును న్యాయమే. పోనిమ్ము. కొదువచేత ముడుచుకొనిపోయినవేళ్లను సరిగా వచ్చునట్లు చేసితివి. ఎప్పటివలె తిరుమంజన కైంకర్యము చేయుచుండు మని తిరుక్కచ్చినంబి చెప్పగా రామానుజు లట్లే చేయుచుండిరి. ఎల్లరును పుస్తకముజూచి విషయము గ్రహింతురు. తిరుక్కచ్చినంబికి స్వామియే సందేహములు తీర్చుచున్నాడు. కావున వీరి నాశ్రయింపవచ్చును. ఈయన అవంశ్యు డైనను జ్ఞానము ముఖ్యముగదా! ఋష్యాదులు గ్రంథములను జూచి పరబ్రహ్మ మందురు. ఈయన ఆపరబ్రహ్మతో ప్రత్యక్షముగ మాట్లాడుచున్నాడు. ఇట్టివారి కులశీలాదులు చూడరాదు. కులమున తక్కువయైనను భగవత్సంబంధ ముండబట్టి యీయన గురువే. కావున నమస్కారాదులచేత నీతని వద్ద విషయములను తెలిసికొనెద నని యనుకొనిరి. అట్లుతలచి తిరుక్కచ్చినంబి యొద్దకేగి నేను మీశిష్యుడను. శాస్త్రములనేర్చి యితరులను వాదముచేత ఖండింప సమర్థుడనై యున్నాను. ఐనను నామదిలో కొన్నిసందేహము లున్నవి. వాని నెవ్వరు తీర్తురు ? యామునులు పోయిరి. నాకు మీరే గతి. నా కుపదేశింపవలయును అని సేవింప బోయిరి. తిరుక్కచ్చినంబి వారి చేయిపట్టి సేవించుట నాపి "రామానుజా! నీవు చెప్పినట్లు వరదుడు నాతో మాట్లాడును. సత్కాలక్షేపము చేయువారితోను మాట్లాడడు.